రుకు పూర్తి పోషకం-తక్కువ ధరలో అధిక భాస్వరం

# గోదావరి డి.ఎ.పి. మాత్రమే ఇస్తుంది

ఇతర కాంప్లెక్స్ ఎరువులు

| గోదావరి డి.ఎ.పి. | | |
| --- | --- | --- |
| 64% | 56% | 40% |
| N 18% | N 28% | N 20% |
| P 46% | P 28% | P 20% |
| 1 కిలో నత్రజని ఖరీదు = రు. 5-11 | 1 కిలో నత్రజని ఖరీదు = రు. 5-11 | 1 కిలో నత్రజని ఖరీదు = రు. 5-11 |
| 1 కిలో భాస్వరం ఖరీదు = రు. 5-83 | 1 కిలో భాస్వరం ఖరీదు = రు. 7-75 | 1 కిలో భాస్వరం ఖరీదు = రు. 7-89 |

34-5764

మపు విలువ బస్తా బరువులో కాదు. ానిలోని పోషక పదార్థాల మీద ఆధారపడి ుంది. అందుకే ఈ విలువను ుకున్న రైతులు, ఎప్పుడూ అవసరమైన ాలు ఎక్కువగా ఉన్న ఎరువునే ంటారు.

ాయ నిపుణుల పరిశోధనా ఫలితాల ంగా మన భూములకు భాస్వరం ఎంతో ం అని నిర్ధారణ అయ్యింది. వలనంటే భాస్వరం మొక్కల వ్రేళ్ళను ా వృద్ధి పొందిస్తుంది. పూతను ్రోహిస్తుంది. పంట దిగుబడిని ుతుంది. అందుకే మెట్ట పైర్లకు ోనూ, మాగాణి పైర్లకు దమ్ములోనూ ానికి అనువైన కాంప్లెక్స్ ఎరువులో ం అధికంగా ఉండాలి. కాంప్లెక్స్ ులన్నింటిలోకీ ఒక్క గోదావరి ి.లో మాత్రమే అత్యధికంగా 46 శాతం ం, తగినంతగా 18 శాతం నత్రజని ుు. అందుకే రైతులు గోదావరి ి.ని పైరు వేసే సమయంలో

**వాడటానికి అత్యుత్తమమైన కాంప్లెక్స్ ఎరువుగా పరిగణిస్తారు.**

ఎరువు ధర పోషక పదార్థాల పరిమాణం మీద ఆధారపడి వుంటుంది. అత్యధిక పోషకాలు కలిగిన గోదావరి డి.ఎ.పి. మీరు వెచ్చించిన సొమ్ముకు మించిన విలువను సమకూర్చుతుంది. **ఇతర కాంప్లెక్స్ ఎరువులన్నింటికంటే గోదావరి డి.ఎ.పి. లోనే అత్యధిక భాస్వరం అతితక్కువ ధరకు లభిస్తోంది.**

అందుకే ముందుచూపు గల రైతులు ముందుగా గోదావరి డి.ఎ.పి.నే అడుగుతారు. వాడుతారు.

"గంగి గోవు పాలు గరిటెడైనను చాలు" అని మన పెద్దలు చెప్పినట్లు, పట్టెడు గోదావరి డి.ఎ.పి.తో పుష్టిదు పంట పండుతుంది. గంపల్లో గోదావరి డి.ఎ.పి.ని వాడితే ధాన్యంతో మీ గరిసెలు నిండుతాయి.

మీరు తక్కువ వ్యయంతో ఎక్కువఫలసాయం పొందాలంటే గోదావరి డి.ఎ.పి.నే వాడండి.






గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్

50, సెబాస్టియన్ రోడ్, సికింద్రాబాద్ - 500 003.


Sobhagya H. GFC

**ముందుచూపు గల రైతులు ముందుగా వాడే ఎరువు గోదావరి డి.ఎ.పి.**

పైవారమే

# సంక్రాంతి సంచిక

ఆంధ్రుల అభిమాన రచయిత

## మల్లాది వెంకట కృష్ణమూర్తి

ఆహ్లాదభరిత సీరియల్

## వినాయక రావు పెళ్ళి

ప్రారంభం!

* * *

## దీపావళి కథల పై బాలట్ ఫలితాలు

* * *

వ్యాసరచన పోటీలో బహుమతి పొందిన వ్యాసాలు

కొత్త శీర్షిక ఈకాలం పిల్లలు,

సినిమా బాలట్, ప్రత్యేక వ్యాసాలు,

శీర్షికలు, కవితలు, కార్టూన్‌లు

84 పేజీలు వెల: రు. 3/-

## పాఠకులకు మనవి

న్యూస్‌ప్రింటు ధర, ముద్రణ వ్యయం పెరిగినందున ఆంధ్ర సచిత్ర వారపత్రిక వెలను 8-1-1988వ తేదీ సంచిక నుంచీ రు. 3-00లకు పెంచుచున్నాము. పాఠకులు, ఏజంట్లు యీ మార్పును గమనించి సహృదయంతో యధాప్రకారము సహకరించవలసిందిగా కోరుతున్నాము.

### విడిప్రతి వెల రు. 3-00

### చందా రేట్లు

| | ఏజంటుద్వారా | పోస్టుద్వారా |
|---|---|---|
| 3 నెలలకు | రు. 39-00 | రు. 43-55 |
| 6 నెలలకు | రు. 78-00 | రు. 87-10 |
| 12 నెలలకు | రు. 156-00 | రు. 174-20 |

8-1-'88వ తేదీ నాటి పూర్వపు చందాలు గడువు కొత్త రేట్ల ప్రకారము సవరించబడును.


## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు ·

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం . 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు . (1938-1972)

1-7 జనవరి, '88

శ్రీ ప్రభవ నామ సం పుష్య శు త్రయోదశి

సంపుటము 80 : సంచిక 19

ముఖ్య సంపాదకుడు .

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు ·

మత్సుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75. |
| పోస్టులో 6నెలల చందా | రు 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి . రజని

(ఫొటో . కె. ఆర్. వి. భక్త)



# న్యూఢిల్లీ లేఖ

డా॥ జయ్‌దుబాషి

## పాలకుల సేవలో భారతీయ మేధావులు!

"ప్రభుత్వం తలచుకుంటే ఏ వార్తా పత్రికనైనా ఆపి వేయ గలదు. సిగ్గు లేకుండా ప్రవర్తించి, న్యాయస్థానాలను కూడా లెక్క చేయకుండా ఉండ గలదు. కనుక అటువంటి ప్రభుత్వంతో వీధులలో పోరాడటం బహుశా సాధ్యం కాదు...."

ఈ మాటలు రాసిన వ్యక్తి తనకు తానుగా పిరికి పందనని ఒప్పుకోక పోవచ్చు. కాని ఆయన పిరికి వాడే. ఇది రాసినటువంటి వ్యాఖ్యాత ఒక ప్రముఖ దిన పత్రికకు సంపాదకుడు కూడా. ఒక సంపాదకుడు ఏమి చేయవచ్చో, ఏమి చేయకూడదో వివరిస్తూ ఆయన సుదీర్ఘమైన, పాండిత్యంతో నిండిన వ్యాసాలు రాస్తుంటాడు. ఏ రాజకీయ పార్టీ తన ఆత్మ గౌరవాన్ని కోల్పోయిందో, హిందువులను ఒక జాతిగా ఎందుకు పిలవ గూడదో కూడా ఆయన రాస్తుంటాడు. ఆయన ఇందిరాగాంధీకి స్థిరమైన, విశ్వాసపాత్రమైన మద్దతుదారుగా ఉంటూ వచ్చాడు. ముఖ్యంగా అత్యవసర పరిస్థితి రోజులలో, తల్లి తర్వాత కొడుకు పాలన ప్రారంభమయ్యాక, ఆ కొడుకు పారిశ్రామిక వేత్తలను కటకటాల వెనుకకు పంపించే వరకూ ఈ సంపాదకుడు ఆ కొడుకుకు తోడునీడగా ఉన్నాడు. అదే వ్యక్తి ఇప్పుడు ప్రభుత్వం శక్తివంత మైనదనీ, ఏమి తలచుకుంటే అది చేసి వేస్తుందని, దాన్ని ఆపడం ఎవరి తరమూకాదని, ఆ చేసే పని తప్పయినా సరేననీ అంటున్నాడు. ఆ ప్రభుత్వానికి సర్వశక్తులూ ఉన్నాయి గనుక న్యాయస్థానాలను పట్టించు కోకుండా ఉండగలదు గనుక, మిమ్మల్ని జైలులో పెట్టగలదు గనుక మీరు ఆ ప్రభుత్వంతో పోరాడ జాలరు. కనుక, మీకు ఒక పత్రిక ఉన్నట్లయితే మూటాముల్లె సర్దుకుని మౌనంగా వెళ్ళి పోవలసిందే. లేదా ప్రభుత్వం ఏమి అచ్చు వేయాలని కోరుకుంటే అవే అచ్చు వేస్తూ దుష్టులను దూరంగా ఉంచుకోవాలి.

ఈ వ్యక్తి ఒకప్పుడు ఎం. ఎన్. రాయ్‌కి సహచరుడుగా ఉన్నాడు. బహుశా రాయ్‌లాగే ఆయన కూడా తనను తాను హేతువాదినని పిలుచు కుంటాడు. శక్తి వంతమైన బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా దేశం ఒక సాహసోపేతమైన జీవన్మరణ పోరాటం మధ్యలో ఉన్నప్పుడు ఎం. ఎన్. రాయ్ బ్రిటిష్ వారి తొత్తుగా మారాడు. కాని రాయ్ ఒక మేధావిగా గుర్తింపు పొందాడు. ఈ వ్యాఖ్యాత కూడా అంతే. ఆయన చాలా మూర్ఖమైన వాదనలను ఒక ప్రశాంతమైన శైలిలో రాస్తుంటాడు. వాళ్ళు అట్లా ఎందుకు ప్రవర్తిస్తారు? అది భయమా లేక అంతకన్నా నీచమైన దేమైనానా? న్యాయస్థానాలను విస్మరించే టటువంటి ప్రభుత్వం దాని నిర్వచనాన్ని బట్టే ఫాసిస్టు ప్రభుత్వం అవుతుంది. అటువంటి ప్రభుత్వం మొట్ట మొదట చేసేది పత్రికలను భయపెట్టి, నాశనం చేయడానికి ప్రయత్నించడమని చిన్న పిల్లలకు కూడా స్పష్టంగా తెలుసు కనుక అటువంటి ప్రభుత్వాన్ని ఎదిరించడమే మన బాధ్యత అవుతుంది. హిట్లర్ చేసిందదే. స్టాలిన్ చేసిందదే. అత్యవసర పరిస్థితికి ముందు, అత్యవసర పరిస్థితిలో ఇందిరా గాంధీ చేసిందదే. రాజీవ్ గాంధీ, ఆయన ప్రభుత్వం కూడా అదే పని చేయడానికి ప్రయత్నిస్తున్నట్లయితే ఒక ప్రభుత్వం సంపాదకు లను జైళ్ళలో పెట్టకుండానే, నిర్బంధ శిబిరాలకు పంపించ కుండానే ఫాసిజానికి ఎంత సన్నిహితం కాగలదో అంత సన్నిహిత మైనట్లే. ఎందుకంటే మన ప్రభుత్వం నానాటికీ నిస్సిగ్గుగా ప్రవర్తిస్తున్నదన డానికి తగిన ఆధారా లున్నాయి. సందర్భవశాత్తూ ఈ వ్యక్తే ప్రభుత్వానికి ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌ను కూలదోయ డానికి ప్రయత్నిస్తున్న దనేందుకు ఆధార మేమీ లేదని అన్నాడు. కాని ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌ను స్వాధీనం చేసుకునేందుకు ప్రయత్నాలు జరుగు తున్నప్పుడు, ఆ నిర్లజ్జాపూరిత ప్రయత్నాన్ని ప్రస్తావిస్తూ సంపాదకీయం రాయని ఏకైక పత్రిక ఆయనదే.

కాని నేను పక్కదారి పట్టినట్టున్నాను. ఒక మనిషి ఏమి అంటున్నాడు, ఏమి ఆలోచిస్తున్నాడు అనే విషయమై మనం ఎక్కువ విచారించ నవసరం లేదు. కాని ప్రభుత్వం తన అదృశ్య హస్తాన్ని చూపినప్పుడల్లా మన మేధావు లనబడే వాళ్ళ కాళ్ళల్లో వణుకు ఎందుకు వస్తుందో నాకు అర్థం కాదు. స్పానిష్ యుద్ధంలో తూటా దెబ్బ తిన్నప్పుడు– దాదాపు మెడ తెగిపోయి నప్పుడు– జార్జి ఆర్వెల్ వణికి పోలేదు. ఒక ఫాసిస్టు ప్రభుత్వం విషయంలో మీరు చేయగల పని ఒక్కటే– దాని మీద పోరాటం చేయడమే. అత్యవసర పరిస్థితిలో మాలో కొందరం చేసిన దదే. రేస్‌కోర్స్ రోడ్‌లోని ఎయిర్ కండిషన్డ్ వాహనాలలో కండలు తిప్పుతున్న వాళ్ళు మూర్ఖత్వం లోకి పోతే మళ్ళీ అటువంటి పోరాటం చేయవలసి రావచ్చు. ఇప్పుడు చెపుతున్న ఆ ప్రత్యేక మైన సంపాదకుడు ఆ పని చేయలేదు. వంగి నడవమని ఆజ్ఞలు వచ్చినప్పుడు నాలుగు కాళ్ళ మీద పాకడానికి సిద్ధపడిన వాళ్ళలో ఆయన కూడా ఒకడు.

ఇటువంటి మేధావుల పట్ల నాకు అసహ్యం తప్ప మరొక భావమేదీ లేదు. భారతీయ మేధావులు చాలా తక్కువ జ్ఞానంతో తయారవుతారు. వాళ్ళు ప్రతిదాన్నీ హేతుబద్ధం చేయగలరు. హింసను, నియంతృత్వాన్ని, అధికార దుర్వినియోగాన్ని వాళ్ళు హేతుబద్ధం చేయగలరు. ఒక వ్యక్తి శక్తి మేరకు పోరాడి, ఇంక శాంతి కోసం ప్రభుత్వంతో, అధికారంలో ఉన్న వారితో ఒప్పందానికి వద్దామని ఒక శుభోదయాన నిర్ణయించుకునే వ్యక్తిని నేను అర్థం చేసుకో గలను. ఆయన తన పరిపంథను సమర్థించుకోవడానికి సుదీర్ఘ వ్యాసాలు రాయడు, పుస్తకాలు వెలువరించడు. నేరుగా వెళ్ళి పోయి తాను చేయదలచు కున్నదేదో చేస్తాడు. తాను పాలక పార్టీలో ఉండడమే ఉత్తమమని నిర్ణయించుకునే నాటికి అశోక్ మెహతా సోషలిస్టు నాయకుడు. మరే వ్యక్తి అయినా కాంగ్రెస్ అధినాయకులను కలిసి తాను వాళ్ళ పార్టీలో చేరడం గురించి చర్చించి ఉండే వాడు. కాని మెహతా ఒక మేధావి. కనుక అటువంటి ముక్కుసూటి పనులు చేయడానికి సిద్ధపడలేక పోయాడు. ఆయన కూచుని, ఒక సుదీర్ఘమైన, విసుగెత్తించే కరపత్రం రాశాడు. "వెనుకబడిన ఆర్థిక వ్యవస్థ అనివార్యతలు" అని దాని పేరు. ఆయన పార్టీని చీల్చి, శాశ్వతంగా రద్దు చేసిన వాదనను ప్రారంభించాడు. అప్పుడింక నిశ్శబ్దంగా కాంగ్రెస్ శిబిరంలోకి నడిచి మంత్రి అయ్యాడు. అశోక్ మెహతా మోసగాడని నేను అనడం లేదు. ఎం. ఎన్. రాయ్ మోసగాడని కూడా నేను అనడం లేదు. నేననేదల్లా, ఒక మనిషిని ఆయన ఏం చెపుతున్నాడనే దానిమీద కాక, ఏం చేస్తున్నాడనే దాని మీద నిర్ణయించా లనేదే. ఎందుకంటే కావలసిందల్లా అనెయ్యడమూ, అందుకు సరిగ్గా వ్యతిరేకంగా ప్రవర్తించడమూ ప్రపంచంలో అన్నిటికన్నా చాలా సులభమైన పని. స్టాలిన్ రచనలలో నియంతృత్వాన్ని ప్రశంసించే పదం ఒక్కటయినా మీకు కనబడదు. కాని ఆయన ఒక నియంత. ఇందిరాగాంధీ రచనలలో ప్రజాస్వామ్యా నికి, పత్రికాస్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా ఒక్క మాట కూడా మీకు కనబడదు. కాని వాటిపట్ల హూణులు ప్రవర్తించి నట్టుగానే ఆమె ప్రవర్తించింది.




# న్యూఢిల్లీ లేఖ

అభివృద్ధి చెందిన దేశానికి, వెనుకబడిన దేశానికి మధ్య తేడా ఉండేది అధికారం పట్ల భయం విషయంలోనే. ఒక కార్లు వరుస గందరగోళమైనందుకు రాజీవ్ గాంధీ ఒక పోలీస్ కమిషనర్‌ను తొలగిస్తున్నాడంటే, అధికార వర్గం గుండెల్లో గుబులు పుట్టించడమే ఆయన లక్ష్యం సమయ పాలన సరిగ్గా లేనందుకు ఒక వ్యక్తిని తొలగించవలసి వస్తే ఇంకా చిన్నపాటి గుమస్తాను, ఒక పోలీసును ఇంకా చిన్న కారణాలపై అవమానించవచ్చు. అమెరికాలో గాని, బ్రిటన్‌లో గాని ఎవరూ ఒక రాజకీయవేత్త ముందర పాకరు రీగన్, థాచర్‌లు ఎటువంటి నిందలను ఎదుర్కోవలసి ఉంటుందంటే సూయెజ్ కాలువకు ఇవతలి పక్కన అటువంటివి చాలా అరుదు అక్కడ పాలకులకు, పాలితులకు మధ్య దూరం ఎంత తక్కువంటే విస్మరించదగినంత. యుద్ధం తర్వాతి రోజుల్లో లండన్‌లో నేను విద్యార్థిగా ఉన్నప్పుడు ఒకసారి భారత దేశ వ్యవహారాలు చూసే ప్రభుత్వ కార్యదర్శితో ఫోన్ మీద మాట్లాడి కలవ దగిన సమయం అప్పటికప్పుడు నిర్ణయించు కున్నాను స్వీడన్‌లో ప్రధాన మంత్రులు తమ ఫోన్లకు తామే జవాబిస్తారు. ఒలాఫ్ పాల్మె కాల్చి చంపబడి నప్పుడు ఆయన ఒక సినిమా థియేటర్ నుంచి కాలినడకన ఇంటికి తిరిగొస్తున్నాడు మహా భయోత్పాతం రోజులలో స్టాలిన్‌కు ఉన్నంత మంది కంటే ఎక్కువ మంది అంగరక్షకులు మన నాయకు లనబడే వాళ్ళకు కాపలాగా ఉంటున్నారు. మొన్న ఒక రోజున ఒక కాబినెట్ మంత్రి ఒక హోటల్ ఆవరణలోకి వెళ్తుండగా చూశాను. ఆయన ఢిల్లీలో అందరి కంటే అసహ్యకరమైన మనిషను కోండి– అది అలా ఉంచుదాం. కాని ఆయన చుట్టూ నల్ల చొక్కాల గుంపు ఒకటి ఉంది. వాళ్ళ చేతుల్లో పూల గుత్తులున్నాయి. మన సినిమా హీరోలు పెళ్ళిళ్ళ తర్వాత యుగళ గీతాలు పాడేటప్పుడు పట్టుకునే పూలగుత్తుల్లా ఉన్నాయవి. ఆ భారీ మనిషి స్టెన్‌గన్‌ల వెనుక కనుమరుగయ్యే వరకు ఆ విశాలమైన ఆవరణలోకి ఎవరినీ రానివ్వ లేదు. లిఫ్టులు ఆపేశారు. అదంతా ఒక ప్రదర్శన ఆధిపత్య ప్రదర్శన. ఇటువంటి ప్రదర్శన "జాతీయ" పత్రికల సంపాదకులను, పిరికి వ్యాఖ్యాతలను సంతృప్తి పరుస్తుంది వాషింగ్టన్‌లో మీరు తిరుగుతున్నప్పుడు అధ్యక్షుడు వస్తున్నాడనో, కాసేపట్లో రాబోతాడనో ఎవరూ వీధులు ఖాళీ చేయరు మొన్నొక రోజు ఎవరో ఒక ముఖ్యమైన వ్యక్తి, చాలా ముఖ్యమైన వ్యక్తి పాలమ్ విమానాశ్రయానికి వెళ్ళబో తున్నాడని చెప్పి ఢిల్లీలో వాహనాల రాకపోకల్ని అరగంట సేపు నిలిపి వేశారు అందుకు ఏ ఒక్కరూ నిరసన ప్రకటించ లేదు. ఎందుకంటే అందరూ భయపడి పోయి ఉన్నారు. ఎంత భయపడి ఉన్నారంటే గొంతెత్తి మాట్లాడితే మనం నిర్మించుకున్న చిన్నారి గూడు ఎక్కడ అదృశ్యమై పోతుందో అన్నట్టున్నారు. బ్రిటిష్ పాలనా కాలంలో సంపాదకులకు నెల జీతం ఎక్కువలో ఎక్కువ 200 రూపాయ లుండేది వాళ్ళు విదేశీ పాలకుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించారు ఇప్పుడు మన సంపాదకులకు నెలకు 20,000 రూపాయలు అందుతున్నాయి. వాళ్ళేమో పాలక పార్టీ గూండాల వీపులు తడుతున్నారు ఏమీ చేయొద్దని, చేస్తే ఆ గూండాలు "నిస్సిగ్గుగా న్యాయస్థానాల్ని ధిక్కరిస్తారని" ప్రజలకు గంభీరంగా చెపుతున్నారు సిగ్గు, సిగ్గు 

మల్లాది వెంకట కృష్ణమూర్తి

పోస్టు బాక్స్ నెం. 1807
చిక్కడపల్లి
హైదరాబాద్-500020

## పాఠకులకు నమస్సులు

34564

నేను రాసిన మొట్టమొదటి సాంఘిక కథ 'పిరికివాడు'. దాన్ని 1970లో ఆంధ్ర సచిత్ర వారపత్రికకి పంపాను. అది ఆ నవంబర్‌లో అనుకుంటా అచ్చయింది. నా మొదటి కథని రిజెక్ట్ చేయకుండా ప్రచురించడంతో రచయితగా నాకు కాన్ఫిడెన్స్‌ని ఇచ్చింది పత్రిక. అది తిరిగి వచ్చి వుంటే బహుశ ఆ తర్వాత కథలు రాసేవాడిని కానేమో? ఆ తర్వాత పత్రికలో నా కథలు చాలా ప్రచురించారు. నేను రాసిన మినీ కథలు మొదట్లో ప్రచురించింది కూడా పత్రికే.

అన్ని వార పత్రికల్లో నా సీరియల్స్ వచ్చాయి. కాని ఇంతవరకు ఆంధ్ర సచిత్ర వారపత్రికలో రాలేదు అనిపిస్తుండేది. 'వినాయకరావు పెళ్ళి' తో ఆ బాధ తీరింది.

ఆంధ్ర పత్రిక తెలుగులో సీనియర్ వారపత్రిక. నాలాంటి ఎందరో రచయితలు ఈ పత్రిక ద్వారా పరిచయం అయి రచయితలుగా నిలదొక్కుకో గలిగారు. ఈనాటి కొన్ని వార పత్రికల పేర్లు కూడా వినని వారుండచ్చు కాని, ఆంధ్ర పత్రిక గురించి తెలీని తెలుగు పాఠకులే వుండరు. విశ్వనాథ సత్యనారాయణ లాంటి వారి సీరియల్స్‌ని మాత్రమే ప్రచురించే పత్రికలో సీరియల్ రైటర్‌గా నాకు అవకాశం వచ్చినందుకు, నా మొదటి కథ ప్రచురించి నాలో రచయితగా ధైర్యాన్ని పోసిన నా మొదటి పత్రికలో ఓ నవలని రాస్తున్నందుకు ఎంతో సంతోషంగా వుంది.

ఆంధ్ర పత్రిక రచనల విషయంలో ఖచ్చితంగ పాటించే పాలసీలకి, వరవడికి ఏమాత్రం దూరం కాకుండా పై వారం నుంచి నేను రాస్తున్న ఈ 'వినాయకరావు పెళ్ళి' మీ అందరికీ నచ్చుతుందని ఆశిస్తూ-

# శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయితలు, రచయిత్రులు, ఏజెంట్లు, ప్రకటనకర్తలందరికీ కొత్త సంవత్సర శుభాకాంక్షలు. -సం.

## సీరియల్స్

ప్రముఖ రచయిత్రి రావి నూతల సువర్ణాకన్నన్ గారి సీరియల్ "మంజీరనాదం" చాలా బాగుంది. నిధి పరిశోధనలు గురించి వ్రాయటము మాకు కూడ కుతూహలం కల్గుతుంది. రచయిత్రికి నా ధన్యవాదాలు.

– ఎస్. కె. పాష, మంథని

★ ★ ★

"మంజీరనాదం" ఆనందభైరవి రాగంలా అత్యంత ఆకర్షణతో సాగుతోంది.

ఎన్. చిరంజీవి, వీరవరం

★ ★ ★

'మంజీరనాదం' సీరియల్ నా గుండెల్లో సాహిత్య రవళి మీటుతున్నది.

యస్. డి. కె. సుల్తానా, చింతకాని (ఖమ్మం)

★ ★ ★

"ఈతరం యువతి" సీరియల్ మమ్మల్ని బాగా ఆకట్టుకొంటున్నది. ఈ సీరియల్ చదువుతున్నంత సేపు సినిమా చూసిన భ్రాంతి కల్గుతున్నది.

దువ్వాడ శ్రీకాంత్, కాశీబుగ్గ

★ ★ ★

"ఈతరం యువతి, డి. ఎస్. పి. విజయ్ "సీరియల్స్ రెండూ ఆసక్తిని, ఉత్కంఠతని కల్గిస్తూ వూహించని మలుపులతో శరవేగంతో ముందుకు సాగుతున్నాయి.

హిమబిందు, నాగినీప్రియ, డోర్నకల్

★ ★ ★

"ఈతరం యువతి" సీరియల్ ఇంట్రెస్టింగ్‌గా

## ఉత్తరాలు

సాగుతున్నది. సీరియల్‌ను నాలుగైదుసార్లు చదువుతున్నాం. సీరియల్‌కు వేస్తున్న రావుగారి బొమ్మలు బావున్నాయి.

డి. ఎస్. పి. విజయ్ సీరియల్ శైలి చక్కగా వుంది. సమాజానికి చైతన్యం కలిగించే రచనలు చేస్తున్న రచయిత్రికి నా అభినందనలు.

ఎ. సురేష్‌కుమార్, హైదరాబాద్

★ ★ ★

సి. ఆనందరామంగారి సీరియల్ నవల రేపటి మహిళ చాల ఇంటరెస్ట్‌గా సాగుతుంది. కథలు ఎక్కువగా వేయండి.

ఎల్. వి. సుబ్బయ్య, గూడూరు

★ ★ ★

"మంజీరనాదం" ఎంతో ఇన్‌ట్రస్టింగ్‌గా సాగుతున్నది. "ఈతరం యువతి" ఫేర్‌గా వుంది.

కాజ హనిత, ఏలూరు

★ ★ ★

చక్కని కుటుంబ కథనానికి హాస్య సంభాషణలు జత చేసుకుని ప్రత్యేక శైలితో రూపు దిద్దుకుంటున్న 'ఈతరం యువతి' అద్భుతంగా ఉంది. ఆదూరి సావిత్రిగారి 'డి. ఎస్. పి. విజయ్' రియల్లీ సూపర్బ్.

మంతెన విజయలక్ష్మి, విజయవాడ

★ ★ ★

సువర్ణా కన్నన్‌గారి "మంజీరనాదం" సీరియల్ చారిత్రాత్మకముగాను, ఆదూరి సావిత్రిగారి సీరియల్ "డి. ఎస్. పి. విజయ్" సందేశాత్మకముగాను, వద్దమన్నాటి కుటుంబరావుగారి "ఈతరం యువతి" క్రొత్త సీరియల్ తమాషాగాను, ఆహ్లాదంగాను, విశ్వనాథ సత్యన్నారాయణగారి "వేయి పడగలు" సీరియల్ అనూహ్యమైన మలుపులతో ఆసక్తిదాయకంగా, శ్రీ ఆనందా రామంగారి "రేపటి మహిళ" సీరియల్ సస్పెన్స్‌గా, ఆసక్తిదాయకంగా ఒకదాని కొకటి పోటీ పడుతూ పాఠకులను ఎంతగానో మెప్పిస్తున్నాయి.

డి. పద్మావతి. సుబ్బాయమ్మ, సి. హెచ్. రమాదేవి, యన్. అచ్యుతవల్లి, అద్దంకి

★ ★ ★

శ్రీ వద్దమన్నాటిగారి 'ఈతరం యువతి' ప్రతి వారం ఫాలో అవుతున్నాం. ఈవారం మృదులయొక్క పెళ్లిచూపుల వ్యవహారం చదువుతున్నంతసేపు ఓ ప్రక్క బాధ, మరోప్రక్క ఇంకా ఏమైందోనన్న ఉత్సాహం కలుగుతుంది. ప్రముఖ రచయిత్రి ఆదూరి సావిత్రిగారి 'డి. ఎస్. పి. విజయ్' ఈవారం మా కెంతో నచ్చింది. విజయ్ గత చిన్ననాటి విషయాలు తల్లి ప్రేమకోసం ఎంతగా పరితపించిపోయాడో చదువుతున్నంతసేపు కంట నీరొచ్చింది. ఇంతగా చదివించగలిగిన రచయిత్రి గారి కలంలో ఎంత బలముందో తెలుస్తోంది.

పోలోజు వెంకటాచారి, ధనలక్ష్మి, వినోద్‌కుమార్, హైదరాబాద్

## కథలు

"రజతోత్సవం" కథలో మనుషుల మనస్తత్వాన్ని చక్కగా వివరించారు రచయిత.

చోడవరపు విజయకుమార్, హైదరాబాద్

★ ★ ★

విమలా రామంగారి కథ "మంచిని పెంచిచూడు" నీట్‌గా మసాలాలు లేకుండా చదివించేదిగా ఉంది.

కె. భాస్కర్, ఇచ్ఛాపురం

## శీర్షికలు

'షేర్ మార్కెట్' శీర్షిక ప్రారంభం చాలా నీట్‌గా వుంది. శ్రీ యన్. రాంజీగారు ప్రారంభంలోనే పాఠకుల్ని ఆకర్షించగలిగారు. ముందు ముందు షేర్ మార్కెట్ గురించి విజ్ఞానవంతమైన, మార్గదర్శకమైన వివరాలను చెప్పగలరని గట్టి నమ్మకం కలిగించారు.

ఎస్. ఎ. వహాబ్, గూడూరు

★ ★ ★

క్రొత్తగా ప్రవేశపెట్టిన 'షేర్. మార్కెట్' శీర్షికలో అంశాలు చాలా ఆసక్తిదాయకంగా ఉన్నాయి.

ఈ శీర్షిక యిలాగే యింకా ఆసక్తిదాయకంగా పాఠకుల దృష్టిని ఆకర్షించాలి. ఇకపోతే 'లిస్టెడ్ షేర్స్'. 'స్పెసిఫైడ్ షేర్స్', 'దలాల్‌స్ట్రీట్'. 'క్యాష్ సెక్షన్', పెర్మిటిడ్ సెక్యూరిటీస్'. 'బిజినెస్‌డన్' అనువాటిని గూర్చి వివరంగా రాయగలరు.

టి. సాంబశివరావు, చీరాల □

అబ్బే! బిల్లు తప్పువేయడం నా ద్వారా!
ఇప్పుడు మీరు చేసింది నిన్నటి టిఫిన్!
అంచేత డిస్కౌంట్ ఇచ్చాం!!
HOTEL

# వినాయకరావు పెళ్ళి




మల్లాది వెంకట కృష్ణమూర్తి సరికొత్త సీరియల్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

లో

సంక్రాంతి సంచిక నుంచి ప్రారంభం!

సీరియల్

# ఆడపిల్లలు - అనుభవాలు

హరికిషన్

(గత సంచిక తరువాయి)

అభిలాష్ ఇంటికి వచ్చాక మనస్సు బావుండక భోజనం చెయ్యలేదు. ఆలోచిస్తూ పడుకున్నాడు. తల్లి శాంతాదేవి కూడా నిద్ర పోలేదు. భర్తతో అన్నది.

"అభిలాష్ భోజనం చెయ్యలేదు ఆకలి లేదన్నాడు, వాడిని చూస్తుంటే ప్రేమ వ్యవహారంలో పడ్డాడేమోనని అనుమానం, ఆ సత్యభామ, సావిత్రి వీడి బుర్రలో చొరబడ్డారు"

"నేనూ చూస్తూనే ఉన్నాను, వాడి అంతర్యం కనుక్కో, వాడి ఇష్ట ప్రకారమే చేద్దాం" అన్నాడాయన పేపరు చూస్తూ.

"వీల్లేదు, కొంత మందిలో ప్రేమ శరీరాన్ని కోరి పుడుతుంది, కొంత మంది అందానికి మార్కులు వేస్తారు, ఇంకొంత మంది డబ్బుకు గేలం వెయ్యటానికి ప్రేమను ఎరగా వేస్తారు. ఆ ఇద్దరూ డబ్బుకోసమే ప్రేమిస్తున్నారని నా అనుమానం" అన్నదావిడ.

ఆయన మాట్లాడుతూనే నిద్రలోకి జారుకున్నాడు. ఆవిడ మెల్లగా లేచి కొడుకు గదిలోకి వెళ్ళింది. అతని పుస్తకాలూ, కాగితాలూ, బట్టల బీరువా అన్నీ వెదికింది. ఏమీ కనపడలేదు. "అభిలాష్" అని పిల్చింది, అతను పలకలేదు, అటు తిరిగి పడుకున్నాడు.

టేబుల్ మీద ఉన్న అభిలాష్ డైరీ తీసి చూసింది. మూడు, నాలుగు పేజీలు చదివింది. గుండెలు దడదడలాడేయి. ముఖ కవళికలూ మారేయి.

అక్కడే వున్న ఒక తెల్ల కాగితం తీసుకుని ఆ మూడు, నాలుగు పేజీల్లో ఉన్న విషయాలూ రాసుకున్నది, డైరీ యధాస్థానంలో వుంచింది. వచ్చే వెక్కుసీ, దుఃఖాన్నీ ఆపుకుని ఆ రాసిన విషయాన్ని చదువుకుంటూ ఇవతలికి వచ్చేసిందావిడ.

తెల్లవారింది. అభిలాష్‌కు కాఫీ ఇస్తూ అన్నదావిడ.

"ఆ ఇద్దర్లో నీకు ఎవర్ని పెళ్ళి చేసుకోవాలని ఉన్నది"

"నీ ఇష్టం, ఎవరన్నా నాకు ఇష్టమే"

"ఆ ఇద్దరూ నాకు ఇష్టం లేదు, కాని ఒక షరతు మీద వప్పుకుంటాను. నువ్వు ఎమ్.కాం.లో యూనివర్శిటీ ఫస్ట్ రావాలి. అప్పుడే అందులో......తో నీకు పెళ్ళి జరిపిస్తాను. ప్రేమను హృదయంలో దాచుకో, మనస్సుతో పరీక్షలకు చదువు. మావాడు ఎమ్.కాం.లో యూనివర్శిటీ ఫస్ట్ అని సగర్వంగా నా కోడలితో నేను చెప్పాలి, దట్సాల్" అన్నదావిడ.

జరిగిన కథ - 2 : గోపాలరావు కూతురు సత్యభామ, ఆమె స్నేహితురాలు సావిత్రిలలో ఎవరినైనా పెళ్ళి చేసుకోవాలని తనకు కోరికగా ఉందని చెప్తాడు దశరధరామయ్య కొడుకు అభిలాష్. అభిలాష్‌ను మందలించ బోయిన జగదీష్‌తో స్నేహం చెడిపోతుంది. జగదీష్ తల్లి, చెల్లెలు విచారిస్తారు.

అభిలాష్ మనస్సు అనంత లోకాలకు వెళ్ళింది.

## ప్రేమకు రాయబారం:-

అది సత్యభామ ఇల్లు. తండ్రి గోపాలరావు తన వ్యవహారాల కాగితాలు చూసుకుంటూ కూర్చున్నాడు ఆఫీస్‌రూంలో. సత్యభామ ఇంకా కాలేజీకి వెళ్లలేదు. వెళ్ళటానికి తయారవుతున్నది. ఆయనకు ఫోన్ వచ్చింది. రిసీవర్ తీసుకొన్నాడు.

"హల్లో గోపాలరావు స్పీకింగ్, ఎవరు మాట్లాడేది"

"నా పేరు జగదీష్ సర్, సత్యభామగారున్నారా" అన్నాడు అట్నుంచీ జగదీష్.

"సత్యా నీకు ఫోన్, మాట్లాడు" సత్యభామ ఫోన్ రిసీవర్ తీసుకుంది.

"హల్లో సత్యభామా స్పీకింగ్"

"నా పేరు జగదీష్ మేడమ్, అభిలాష్ స్నేహితుడిని, మీతో ఇంటికొచ్చి మాట్లాడుతాను, మీనాన్నగారి సముఖంలోనే మాట్లాడుతాను, దయచేసి అపాయింట్‌మెంట్ ఇవ్వండి" అన్నాడు.

"ఓ.కె. ఈరోజు సాయంత్రం ఆరు గంటలకు, మా ఫాదర్ కూడా ఉంటారు, యుకెన్ స్పీక్ ఇన్‌హిజ్ ప్రెజెన్స్."

"వెరీ మెనీ థాంక్స్, తప్పకుండా వస్తాను" అని ఫోన్ పెట్టేశాడు. గోపాలరావు పుస్తకం మూసి అన్నాడు.

"జగదీష్ ఎవరమ్మా"

"అభిలాష్ స్నేహితుడు, సాయంత్రం మాట్లాడటానికి వస్తానన్నాడు, ఈమధ్య అభిలాష్ చాలా డిసీవ్ చేశాడు, కడిగేస్తాను, మీరు స్పెక్టేటర్‌లా ఉండండి" అన్నది నవ్వి ఊరుకున్నాడాయన.

సాయంత్రం ఆరయింది, ఆరో గంట కొడుతూ ఉండగానే జగదీష్ గేటు తీసుకుని లోపలికి వచ్చాడు. వరండాలో కుర్చీలో కూర్చున్నది సత్యభామ. తండ్రి గోపాలరావు ఆఫీస్ రూంలో ఉన్నాడు. "గుడీవినింగ్ మేడమ్"

"పంక్చ్యుయల్‌గా వచ్చారు" బింకంగా చూస్తూ అన్నది.

"ఎపాయింటెడ్ టైంకి రావాలికద, ఎనీ అబ్జెక్షన్" అవతల కుర్చీలో కూర్చుంటూ అన్నాడు

"నో సర్, చెప్పండి, ఏమిటి విషయం" అన్నది మెళ్లో గొలుసు పెదవుల మధ్యకు తీసుకుని-

"మీరే ఏదయినా చెపుతారేమోనని వచ్చాను" అన్నాడు.

"చెప్తాను, కాని ప్రశ్న మీది, సమాధానం నాది. అడగండి, నాతో మాట్లాడాలని ఫోన్ చేసింది మీరు".

"మీ ఫాదర్‌ని పిలుస్తారా?"

"అక్కర్లేదు, నా మీద ఆయనకు నమ్మకం ఉన్నది" చిరునవ్వు. ఏం మాట్లాడుతాడో తెలీదు.

"అభిలాష్ ఇంటికి మీరూ, సావిత్రిగారు వెళ్లేరు, వాళ్ళ ఫాదర్ బర్త్‌డే అని చెప్పాడు, మీ ఇద్దర్లో ఒకర్ని పెళ్లాడుతానని చెప్పాడు, మీరిద్దరూ నిర్ఘాంతపోయారు, కామెంట్ ప్లీజ్" అన్నాడు.

సత్యభామ ముఖంలో కోపం, అయిష్టత, అనేక ఆలోచనా తరంగాలు, అనవసరమైన సమస్య. "అతని దృష్టిలో ఆడపిల్ల ఓ మాట్లాడే బొమ్మ ఇండివిడ్యుయాలిటీ లేని అందమైన అభినేత్రి. తన భావాలతోనే ఏకీభవించాలనే మనస్తత్వం కల అహంబావం కలవాడు అతన్ని పెళ్లాడే ఏ ఆడపిల్లయినా



దురదృష్టవంతురాలే కాని అదృష్టవంతురాలు కాదు, అతనొక శాడిస్ట్" అన్నది.

నిలువునా నీరైపోయాడు జగదీష్ నాలుక తడారిపోయింది ఇంత నిష్కర్షగా మాట్లాడుతుందని అతను అనుకోనే లేదు.

"అతని మీద దురుద్దేశ పడ్డారు. కాని, పైకి దురుసుగా కనిపించినా, మాట్లాడినా, ఇన్‌సల్టింగ్‌గా మాట్లాడినా, మనస్సు చాలా మంచిది" నెమ్మదిగా, నమ్రతగా అన్నాడు, మాటలు అర్థించినట్లుగా ఉన్నవి

"జగదీష్‌గారూ, వెన్నపూస, మీగడ, నవనీతం మంచులా కరిగిపోవటం, అవన్నీ మనిషి మంచితనాన్ని పోల్చే ఉపమానాలు ఆడపిల్లలంటే అతని దృష్టిలో పేపర్ గ్లాస్, పేపర్ ప్లేట్, తాగి పారెయ్, తిని వదిలెయ్ అనే మనస్తత్వం కలవాడు అయినా మీ దృష్టిలో అతను మంచివాడు కావచ్చు, బ్రహ్మాండమైన బుద్ధిమంతుడే అనుకుందాం, కాని ఆడపిల్ల కూడా అంగీకరించాలి కదా, అతనంటే నాకు సెంట్‌పర్సెంట్ ఇష్టం లేదు" అన్నది స్పష్టంగా

మరో అడుగు ముందుకు వేద్దామనుకున్నాడు జగదీష్, అరిచేతులు చూసుకుంటూ అన్నాడు "అతను బాగా డబ్బున్నవాడు, కట్న కానుకలు అక్కర్లేనివాడు, భార్యను అమితంగా ప్రేమించగలడనే నమ్మకం నాకున్నది, పెళ్ళయితే ఆ దుడుకుతనం తప్పకుండా పోతుంది" అన్నాడు మార్దవమైన కంఠ

# ఆడపిల్లలు - అనుభవాలు

స్వరంతో

నవ్వింది, ఇంకా నవ్వింది. పక పక నవ్వింది, అంతలోనే సంబాళించుకుని, ఆలోచించి అన్నది "ఒకకిరాతకుడిని పెళ్ళి చేసుకోమని నాకు సిఫార్స్ చేస్తున్నారు పెళ్ళి అనేది ఉద్యోగం కాదు సార్ సిఫార్స్ చేసి వప్పించటానికి. మీ స్నేహితుడి మీద అంత అభిమానం ఎందుకు సార్?"

అతను తల వంచుకున్నాడు

"ప్రత్యేకమైన కారణం ఏమీ లేదు, దుర్మార్గుడూ, కిరాతకుడూ అని మీరే అన్నారు కదా, మీరతనిని పెళ్ళి చేసుకుంటే వాడు బాగుపడతాడేమోనని"

చెంపలు రాచుకున్నది, పెదవి కొరుక్కున్నది. "ఒక దుర్మార్గుడికి భార్య కావలసినంత గతి నాకు పట్టలేదు సార్, అంతటి త్యాగం నేను చెయ్యలేను. ఆ అవసరం నాకు లేదు" స్పష్టంగా చెప్పింది

"ఒక్క మాట" అన్నది. మళ్ళీ తలెత్తి చూశాడు

"నాలో ఏ ప్రత్యేకత ఉన్నదని నన్నే అతన్ని పెళ్ళి చేసుకోమని కోరుతున్నారు?"

"మీరూ ఆస్తి, అంతస్తూ కలవారని, విచక్షణా జ్ఞానం తెల్సినవారని. అందమైన స్వభావం కలవారు, మాటకారి అతను కూడా ఇష్టపడ్డాడు కనుక మిమ్మల్ని ప్రాధేయపూర్వకంగా అడుగుతున్నాను" అన్నాడు.

"నాలో ఇన్ని సుగుణాలు ఉన్నాయని మీరు ఊహించి అంటున్నారా, నన్ను వప్పించి మీ స్నేహితుడి కోరిక తీర్చాలని పొగుడుతున్నారా?"

"లేదు మేడమ్, పొగడ్త కాదు, యు ఆర్ ఎ పర్ఫెక్ట్ యూత్ విత్ ప్లీజింగ్ మేనర్స్" అన్నాడు చిరు నవ్వుతో

"జస్ట్ మినిట్" అని ఇంట్లోకి వెళ్ళింది ఫ్రిజ్‌లో నుంచీ రెండు కూల్ డ్రింక్స్ తెచ్చింది.

అతను మామూలుగా కూర్చొని తాగుతున్నాడు కళ్ళు మూసుకుని తాగుతున్నది సత్యభామ రెండు నిమిషాలకు కళ్ళు తెరిచింది. అశ్రు నయనాలు, తొట్రుపాటు చెందిన మనస్సు, ఆవేదన, అవ్యక్తమైన అనుభూతి, చెప్పాలనే తహ తహ "ఇంత మంచి అమ్మాయిని ఆ కిరాతకుడికి ఇచ్చి పెళ్ళి చేయాలని మీరు అనుకోవటం పాపం కదూ' అన్నది

"లేదు మేడమ్, అది నా బాధ్యత, డిగ్రీ క్లాసునుంచీ, పోస్ట్ గ్రాడ్యుయేషన్ వరకూ నన్ను అతనే ఫీజులు కట్టి చదివిస్తున్నాడు. ప్లీజ్ వప్పుకోండి, నేను బీదవాడిని"

"సర్, ఇంత ప్లీజింగ్ మేనర్స్ కల సత్యభామ .."

"వెరీ గ్లాడ్, మార్వెలెస్, కంగ్రాట్యులేషన్స్, వప్పుకున్నారు మాడమ్" సంతోషంగా అన్నాడు.




"ఎస్ ప్లీజ్, కాని. " అర్థోక్తి-

"చెప్పండి మేడమ్, వాడికి మీరు మినహా ఎవ్వరూ అక్కర్లేదు, నో డౌరీ వేస్టు, నో కట్న కానుకలు"

"సర్, నేను ఇష్టపడ్డది అతన్నికాదు, మిమ్మల్ని, ఆశ్చర్యంగా ఉన్నదా, కానీ కటిక నిజం" అన్నది.

కుర్చీలో నుంచీ తూలి క్రింద పడ్డాడు జగదీష్

సత్యభామ ఖంగారు పడింది, ఇదేమిటా అని బాధ పడ్డది.

"ప్లీజ్ క్షమించండి. మీ మాటకి నేను ముగ్ధుడిని కాలేకపోయాను. షాక్ తిన్నాను నా పెళ్ళి విషయం నేనేమీ ఆలోచించటం లేదు. నేను మధ్యవర్తిగా వచ్చాను అభిలాష్‌ని స్వీకరించండి" అన్నాడు లేచి కుర్చీలో మళ్ళీ కూర్చొని.

నవ్వింది సత్యభామ, సీరియస్‌గా చూసింది. "జగదీష్‌గారూ, మనిషికి కొంత వయస్సూ, అవగాహన విచక్షణా జ్ఞానం వచ్చాక, ప్రేమను గురించి వింటుంటే, జుగుప్సగా ఉంటుంది సావిత్రి అయినా అతనికి ఇష్టమే కనక, సావిత్రి ప్రేమిస్తున్నదేమో ట్రై చెయ్యండి" అన్నది, హతాశుడై నమస్కారం చేసి వచ్చేశాడు

జగదీష్ సావిత్రి ఇంటికి వెళ్ళాడు. సావిత్రి తల్లి పిడకలు ఎత్తుతున్నది, తండ్రి బురదలో దొర్లి వచ్చిన గేదెని కడుగుతున్నాడు. అసిరమ్మ తండ్రికి నీళ్ళు అందిస్తున్నది. సావిత్రి పాత కుర్చీలో కూర్చుని కొత్త పుస్తకం చదువుతున్నది.

"గుడీవినింగ్ సావిత్రిగారూ"

తలెత్తి చూసింది, లేచి నిల్చున్నది, ఆశ్చర్యపోయింది. చిరునవ్వుతో అన్నది "రండి కూర్చోండి" తను కూర్చున్న కుర్చీ చూపించింది, మరో కుర్చీ లేదు, స్టూలు తెచ్చుకుని కూర్చున్నది. ఎవరా అని అందరూ చూసేరు.

"చెప్పండి, మా ఇంటి వాతావరణం మీకు బావుండదేమో, పేడ వాసన, కుడితి కంపు" అన్నది కాస్త ఫీలయినట్టు చూస్తూ.

"గేదె గడ్డి తింటుంది, వాసన వేసే కుడితి తాగుతుంది, కాని ఆ గేదె పాలు మనం తాగుతాం. కావలసింది వాతావరణం కాదు, గుణం" అన్నాడు.

"విశేషాలు చెప్పండి"

"విశేషాలు ఎప్పుడూ సశేషంగా ఉంటయ్యి, అభిలాష్‌ని గురించి మీ అభిప్రాయం" అన్నాడు, ఎందుకు అడుగుతున్నాడో కాస్త గ్రహించింది సావిత్రి.

"డబ్బూ, ఆస్తి ఉన్న వాడు, ఇగోయిజం జాస్తి, శాడిస్ట్ లక్షణాలూ ఉన్నాయి, ఆ స్వభావం వంచుకోకపోతే ఉన్న డబ్బు అతన్ని రక్షించలేదు, గర్విష్టి" అన్నది, తల వంచుకొని, మనస్సులో బాధపడ్డాడు జగదీష్.

"అతను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలని ఉద్దేశ్యపడుతున్నాడు, కట్న కానుకలు లేవు, మీకు ఇష్టమేనా మధ్యవర్తిగా నన్ను పంపించాడు".

అయిష్టంగా చూసింది.

"చూడండి జగదీష్‌గారూ, స్టేటస్ అనేది డబ్బు, ఆస్తితో పెర్గదే. ముడి పదార్థం, రా మెటీరియల్. ఆ పేడను చూడండి, అట్లా కుప్పగా ఉంచితే వాసనేస్తుంది, కాని పిడకలు చేస్తే దాని ఉపయోగం పెరుగుతుంది. అట్లాగే స్టేటస్ వాసన వెయ్యకుండా ఉండాలంటే సద్భావం అనేది చాలా అవసరం, అతనిలో గౌరవప్రదమైన వ్యక్తిత్వం లేదు, ఒక వేళ ఏ ఆడపిల్లయినా అతన్ని పెళ్ళి చేసుకున్నా, డోర్ కర్టెన్‌లా మార్చి వేస్తాడు. అతని దృష్టిలో ఆడపిల్ల అనుభవించబడి విసిరిపారేసే సజీవమైన బొమ్మ" అన్నది.

నిర్వీణ్ణుడయినాడు. నిరాశ మనస్సుతో కూర్చున్నది. "సావిత్రిగారూ ఈ రోజుల్లో ప్రతి వస్తువూ తన రేటుని ఊహించలేనంతగా పెంచుకుంటున్నది. ఆ రేటు ఎందుకు పెరుగుతున్నదో అర్థం కాదు. అట్లాగే కట్నాల రేటు, ఆడపిల్ల అనే మాటతోనే ఆ పిల్ల ఆడది కాని ఈడది కాదు అనే అర్థం వస్తుంది. ఈ పిల్ల ఆడకు వెళ్ళాలంటే ఎన్ని వేలు అవుతాయో ఆలోచించండి. చదువు, డబ్బు, ఆస్తి, వయస్సూ, సంస్కారం, అందం అన్నీ ఉన్నాయి. ఇన్ని ప్లస్ పాయింట్లు ఉన్న

# పళ్ల డాక్టర్లకు కూడా లవంగ నూనె పైన పరమ విశ్వాసం.



ఆయుర్వేదంలోనేమి, అల్లోపతీలోనేమి లవంగ నూనెకు గొప్ప ప్రశంస ఉంది. దంతవైద్యశాలల్లో కూడా దీనికి గొప్ప స్థానం ఉంది.

వెనకటి రోజులలో, పళ్లలో ఎంత చిన్న బాధ వచ్చినా లవంగ నూనెనే గుర్తు చేసుకునే వారు. అదే లవంగ నూనె, అచ్చంగా కావలసినంత మోతాదులో మీకిప్పుడు ప్రామిస్ టూత్‌పేస్టులో అందుతుంది. ఇందుచేత మీరు ప్రామిస్‌తో పళ్లు తోముకున్నప్పుడు, అదే లవంగ నూనె మీ పళ్లలో మూలమూలలా చేరి, మీ పళ్ల మొదళ్లకు హాని చేస్తున్న సూక్ష్మజీవులను తరిమి కొట్టుంది. ఈ సూక్ష్మ జీవుల పీడ నుంచి విముక్తి పొందిన మీ పళ్లు సదా ఆరోగ్యవంతంగానూ దృఢంగానూ, మెరిసిపోతూనూ ఉంటాయి. ఇది లవంగ నూనె అద్భుత గుణాలలో ఒక్కటి మాత్రమే.

ప్రామిస్‌లోని అద్వితీయ ఫార్ములా కారణంగా ఈ లవంగ నూనె, నోటి దుర్వాసన కలిగించే సూక్ష్మజీవులను కూడా కూల్చివేస్తుంది; మీ శ్వాసలో సువాసనలు నింపి తెస్తుంది.

మీ పళ్లను సదా ఆరోగ్యవంతంగా ఉంచుకోండి, మంచి ముత్యాల్లా మెరిసిపోనీండి. నోటిలో అద్భుతమైన తాజాదనం తీసుకు రండి—ఒక్క మాటలో చెప్పాలంటే ప్రామిస్ టూత్‌పేస్టు వాడడం ప్రారంభించండి.





లవంగ—
**ప్రామిస్** టూత్‌పేస్టులోని
అద్వితీయ పదార్థం

# Promise

లవంగ నూనెతో అద్భుత సృష్టి – ప్రామిస్ టూత్‌పేస్టు

3 బల్సారా—
టూత్ పేస్ట్ విశేషజ్ఞులు

CHAITRA • B BLS 851 TEL

## ఆడపిల్లలు - అనుభవాలు

అభిలాష్‌ని మీరు కాదన్నారంటే అది మీ జాతకం బావుండలేదనే అనుకుంటాను" అన్నాడు.

సావిత్రి తల్లి పేడ చేతులు కడుక్కుని వచ్చింది. "బాబూ, అమ్మాయి కళాసే సదూతున్నారా, మంచోడిలా ఉన్నావయ్యా, బుద్ధిగా సదూకోయే అని ఎన్ని సెప్పినా ఇనుకోదా, మేం పాత కాలం ఓల్లమయినా అలాటి, ఇలాటోల్లం కాదు, బెమ్మాండమయిన సమ్మందం చెప్పు బాబూ దానికి పెల్లి సేసేద్దాం. అల్లుడూ కూతురూ ఇంగిలీసులో కాపురం సేత్తా ఉంటే నా జనమ తరించినట్టే" అన్నది.

సావిత్రి మనస్సులో బాధపడింది, జగదీష్ చెప్పేస్తాడేమోనని భయపడింది. ఈ పెద్ద వాళ్ళకు ఏం చెప్పినా అర్థం కాదు.

"డియర్ సర్, డోంట్ ప్రొలాంగ్ దిస్ కన్‌వర్‌సేషన్, మై పర్సనల్ రిక్వెస్ట్" అన్నది సావిత్రి.

ఆవిడ మనస్సు పిడకల్లో నుంచీ గోశాలలోకి వెళ్ళింది.

"సూశావా బాబూ, మా సాయిత్రి ఇంగిలీసు మాటాడతా ఉంటే నేను అవు పాలు పితికినట్టే ఉంటుంది. మంచి సమ్మందం సూడు బాబూ" అన్నది కళ్ళింతవి చేసుకుని.

గేదెని కడగడం పూర్తయి తండ్రి వచ్చాడు. తలగుడ్డ తీసి దులిపి చేతులు తుడ్చుకుని, "ఏందే నంజికానా సంమందం అటన్నావ్, నీ బోడి సలా ఎవురిక్కావాలే, నానూ, బాబుగారూ సక్కని సుక్కయ్యని సూసి సాయిత్రి పెల్లి సేసేత్తాం" అన్నాడు. మూతి అష్ట వంకర్లు తిప్పింది తల్లి.

"వొల్లకోయ్, నా కూతురు నా యిష్టం, నువ్వేటి సేసినావ్ దానికి, కన్న పిల్లకి కూడూ, గుడ్డా ఎట్టటం గొప్పేటి? సదూ, సదూ సెప్పటం గొప్ప. ఆ సత్తెభామ తల్లి పున్నెవా అని కాలేజీ సదూ సదువుతున్నది. ఆ గొప్ప నాదోస్" అన్నది జాడిస్తున్నట్టుగా చూస్తూ రవణమ్మ.

"ఆ మాటన్నావంటే మూతి పల్లు రాలే పొగలవ్ నంజికాన. నాను సెప్పేదే కాయం, బాబూ సమ్మందం సూడు ముడెట్టేద్దాం" అన్నాడు మళ్ళీ.

సావిత్రికి విసుగొచ్చింది.

"చూడండి, నాకు తగిన సంబంధం ఈ బాబుగారే చూస్తారు సరేనా, ఇక మీరు ఊరుకోండి" అన్నది కోపంగా చూస్తూ.

మళ్ళీ గేదె దగ్గరకూ, పిడకల దగ్గరకూ వెళ్ళేరు వాళ్ళు. "చూసేరుగా మా ఇంటి వాతావరణం, ఇదీ వరస, నాకూ ఓ ఏక్లాస్ సంబంధమే చేసుకోవాలనే ఉన్నది, కాని కట్నం రేట్లు రాకెట్‌లా దూసుకుపోతున్నాయ్యి. మీరూ రాకెట్ యుగంలో వాళ్ళేగా" అని ప్రశ్నార్థకంగా చూసింది.

తల వంచుకొని నవ్వేడు. అర్థం కాక చూసింది. "మేడమ్, నేను చెప్పేది నా స్వంత గొంతు. కవితాగానం కాదు, డిబేట్లు, వ్యాస రచన, నృత్య, శ్రవ్య నాటికలూ కాదు. మనస్సులో మగ్గిపోయే స్వాభిమానం, స్వాతిశయం. కట్నాలూ, కరప్షన్, వ్యభిచారం, వీటిని రూపు మాపడం, ఎవ్వరి వశం కాదు. నాబోటివాడు, అభిలాష్‌లాంటి వాడూ నూటికి ఇద్దరున్నా, ఈ జాడ్యం రూపు మాసిపోయిందనుకోవటం శుద్ధ తెలివితక్కువ. వీటిని గురించి ప్రచారం చేసిన కొద్దీ, వాటి స్థాయి పెరుగుతున్నదే కాని తరగటం లేదు. ఇంతకీ కట్నం తీసుకోని అభిలాష్ అంటే ఇష్టమేనా?" మళ్ళీ అడిగాడు అర్థించినట్లు చూస్తూ.

"మీకు ఏ దేవుడంటే ఇష్టం?"

అర్థం కాక చూశాడు.

"ఆరాధ్య దైవం ఏ రూపంలో ఉన్నా, ఏ పేరుతో ఉన్నా ఒక్కరే" అన్నాడు.

పెదవులు బిగబట్టి చూసింది.

"కాదు, ప్రతివారికీ వేరు వేరు ఆరాధ్య దైవాలు ఉంటారు. దేవస్థానాలు గొప్పవయినా, రాబడి ఎక్కువ అయినా, వాటిని గురించి విమర్శించేవాళ్ళు




వయస్సు మళ్ళిన పెద్దలు వయో వృద్ధులు : పిన్న వయస్సులోనే ఉన్నా, జ్ఞానంలో పెద్దలతో సమానమైనవారు జ్ఞానవృద్ధులు! ఈ ద్వివిధ వృద్ధులూ సమానంగా కానవస్తున్నప్పటికీ వయో వృద్ధుల కంటె జ్ఞాన వృద్ధులే శ్రేష్ఠులని చెప్పవలసి ఉన్నది. శివుని గురించి ఘోరంగా తపస్సు చేస్తున్న బాల యైన పార్వతి తపోనియమాలు తమ నియమాలను మించి ఉండడం వల్ల మహామునులాశ్చర్యపడి ఆమెను చూడడానికి ఆమెవద్దకు వచ్చారట! ధర్మం చేత వృద్ధులైన వారి విషయమై వయస్సు లెక్కలోనికి రాదని కాళిదాస మహాకవి వివరించాడు.

"పెద్దలను గౌరవించవలె" నని మనం పిల్లలకు నీతిని బోధిస్తాము. వయస్సు మళ్ళిన పెద్దలు జీవితంలో ఎన్నో కష్ట సుఖాలను అనుభవించి ఉంటారు. ఆ అనుభవం వల్ల అనేక విషయాలు వారికి తెలిసి ఉంటాయి. వారిని గౌరవ భావంతో చూస్తే, పిన్నలు వారి వల్ల తమకు మార్గదర్శకాలయిన అంశాలను తెలుసుకోవచ్చును. పెద్దలను గౌరవంగా చూడడంలోని పరమార్థం ఇది!

జ్ఞాన వృద్ధులకు పసితనంలోనే వయస్సుకు మించిన జ్ఞానం ఉంటుంది. వారికి కార్యసాధనలో పట్టుదల, పెద్దలకు కూడా నీతిని, సన్మార్గాన్నీ బోధించడం, మాట తప్పకుండుట సహజంగానే అలవడతాయి.

తండ్రి తొడపై కూర్చుండ గోరిన పసి బాలుడైన ధ్రువుడు సవతి తల్లిచే అవమానింపబడి, అత్యున్నత స్థానాన్ని అధిగమింప దలచి, శ్రీమన్నారాయణుని గూర్చి ఘోర తపస్సును పట్టుదలతో ఒనరించి, ఆ దేవదేవుని అనుగ్రహం వలన ధ్రువతారయై వెలుగుతూ ఉన్నాడు. బాలుడైన ప్రహ్లాదుడు శ్రీహరిని ద్వేషించిన తండ్రికి హితాన్నీ, శ్రీహరి మహాత్మ్యాన్నీ బోధించి, ఆతని క్రోధానికి గురియై, ఎన్నో కష్టాలను అనుభవించి, తుదకు భగవదనుగ్రహాన్ని పొంది అందరికి ఆదర్శప్రాయుడై గొప్ప కీర్తిని గడించాడు. సర్వమూ దానం చేయవలసిన విశ్వజిద్యాగాన్ని ప్రారంభించిన తండ్రి, మంచి వస్తువులను కొడుకుకోసం దాచిఉంచి, నిరుపయోగమైన వాటిని దానం చేయడం చూచిన కొడుకు నచికేతుడు "తండ్రీ! నన్నెవరికిస్తావు?" అని ప్రశ్నించి, తండ్రి కోపానికి గురియై "మృత్యువునకిస్తా" నని అతడికి చెప్పగా, 'మాటతప్పకూడ"దని బోధించి, యముని వద్దకు పోయి, ఆతనివల్ల ఆత్మతత్వాన్ని తెలుసుకో గలిగాడు. జ్ఞానవృద్ధుల స్వభావం ఇట్టిది!

—బులుసు వేంకటరమణయ్య

ఎక్కువే ఉంటారు. కావలసింది ఆదరించే దేవుడు కాని, దేవస్థానం రాబడి కాదు'' అన్నది. చెంపకు చెయ్యి ఆనించి విన్నాడు

"మి అంచనా తప్పు. దేవుడి గొప్ప దేవస్థానం ఆయివేజునుబట్టి కూడా ఉంటుంది. గర్భ గుళ్లో మూల విరాట్టు మహేశ్వరుడైనా, ఉత్సవ విగ్రహాలు ఊరేగింపుని బట్టే మూల విరాట్టు మహిమ వెల్లడి అయ్యేది'' అన్నాడు.

ఇంట్లోకి వెళ్ళింది, గాజు గ్లాసుతో పాలు తెచ్చింది. గ్లాసు చేతికి ఇచ్చింది పాలు తాగేడు "మా అమ్మ కాచిన కాఫీ నేనే తాగలేను, కాఫీ డికాక్షన్ చీర కొంగుతో వడబోస్తుంది ఆ పరిస్థితిలో ఉన్న తల్లిదండ్రుల ప్రథమ సంతానాన్ని నేను నా చదువుకు జీతాలూ, పుస్తకాలూ, అన్ని ఫీజులూ సత్యభామ కడుతున్నది జగదీష్‌గారూ! అభిలాష్‌కి తగినది సత్యభామ కాని నేను కాదండి, సత్యభామని అడిగేరా?" అన్నది సావిత్రి.

మాట్లాడకుండా చూసేడు, కోపంగా చూసేడు, అసహ్యంగా చూసేడు ఏం తెలియక ఖంగారు పడి చూసింది సావిత్రి.

"మీకు సిగ్గూ, లజ్జా లేవు, మర్యాద, మంచితనం లేదు, నిలువెల్లా స్వార్థం, విషం. జేబు గుడ్డతో హత్య చేసే రకం" తక్షణంగా చూస్తూ అన్నాడు

నిర్ఘాంతపోయింది. వణికిపోయింది. కళ్ళల్లో నీళ్ళు. మనస్సు ఆవేదనతో నిండిపోయింది. "నేను పొరపాటుగా మాట్లాడానా, క్షమించండి'' ప్రాధేయ పూర్వకంగా అన్నది.

"ఎస్, అభిలాష్‌ని శాడిస్ట్ అన్నారు, ఏ ఆడపిల్లయినా అతన్ని చేసుకుంటే డోర్ కర్టెన్‌లా మార్చివేస్తాడన్నారు. అంచేత మీ దృష్టిలో పరమ కిరాతకుడైన అభిలాష్‌ని మీరు పెళ్ళి చేసుకోరు. కాని సత్యభామ చేత సకల ఫీజులూ కట్టించుకుని, ఆవిడ ఆర్థిక సహాయంతో చదువుకుంటున్న మీరు అభిలాష్‌కు తగిన వధువు సత్యభామ అని చెప్తున్నారా. యు వాంట్‌టు సజెస్ట్ వట్ సాడిస్ట్ టు సత్యభామ. మీ స్వార్థానికి నా జోహార్లు హేట్స్ ఆఫ్'' అన్నాడు కోపంతో

ఈ అభియోగానికి హతాశురాలయింది. వణికిపోయింది కన్నీరు పెట్టుకున్నది, కుమిలిపోయింది.

"జగదీష్‌గారూ! మన్నించండి నేను దురుద్దేశ్యంతో నా స్నేహితురాలి మీద కోపంతో, కక్షతోను అనలేదు, స్టేటస్‌నీ, ఆస్తినీ, డబ్బునూ దృష్టిలో పెట్టుకొని అన్నాను. అతన్ని వంచుకుని రాగల శక్తి సామర్థ్యాలు సత్యభామకే ఉన్నాయ్యి. నాకా శక్తి లేదు. నేను జడపదార్థాన్ని'' అని అతనికి నమస్కరించింది సావిత్రి.

(ఇంకా ఉంది)

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి



**సి.కె., సికింద్రాబాదు**

★ ఒకోసారి నాకు చాలా వైరాగ్యం కల్గుతోంది. ఒక్కోసారి రెచ్చిపోవడం, ఒకోసారి అణగారిపోవడంగా నా జీవితం తయారైంది- గృహ విషయంలో ఇలాంటి సమస్యలు అందరు గృహిణులకి వుంటాయా! అనిపిస్తోంది. నా వయసు ఇరవై ఎనిమిదే కాని జీవితం అంతా ఇలా గడపాలంటే వైరాగ్యం వస్తూంది.

● దీన్ని వైరాగ్యం అనరు. విరక్తి. మనసులో ఒకటి జీవించేది ఒకటి అయినప్పుడు ఎదురయ్యే పరిస్థితి. గృహిణులు- అందరూ ఏదో ఒకప్పుడిలాంటి పరిస్థితిని ఎదుర్కొంటూనే వుంటారు. కారణం- జీవితపు కాఠిన్యం వీరి సున్నితమైన మనస్సులపై దెబ్బ తీస్తుంది... ఆడది జీవితంలో సర్దుకుపోయినంతగా- మగవాడు సర్దుకుపోనక్కరలేదు. ఆడదానికి సర్దుకుపోవడమే- సుగుణంగా ఎన్నో రోజులలో యిటువంటి పరిస్థితి సహజంగా తోచేది కాని యిప్పుడిలాంటి పరిస్థితిని 'సహజమ'ని స్త్రీలు అనుకోలేకుండా వున్నారు. మారిన స్త్రీల మనస్తత్వాలు గుర్తించని 'మారని వాతావరణం'లో ఇమడలేని, ఇమడలేక- మనస్సు కలవర పెట్టుకుంటున్నారు... ధైర్యం తెచ్చుకోవడం, కావాలనుకున్నది చెప్పడం, ఇష్టం లేనిది తెలియ జెయ్యడం వంటివి అలవాటు చేసుకోండి. ఘర్షణలు ఎదురౌతాయి కాని మీ మనస్సు ఇంత ఒత్తిడితో నిండిపోదు.. ఇటువంటి విసుగుదల ఎక్కువైతే మానసిక రోగాలు రావచ్చు. అవి మరీ కృంగదీయడమే కాదు. వాతావరణాన్ని చాలా కౄరంగా మార్చివేస్తాయి.

**ఎల్. ఎస్. డి., తుంగభద్ర డామ్**

★ సామాజిక స్పృహ అంటే?

● మీ చుట్టూ ఉన్న వాతావరణాన్ని తెలుసుకొని వుండడం దానిలోని తప్పొప్పులు బేరీజు వేయ కల్గి వుండడం. అంతే కాదు వీలైతే- ఒప్పులకు పెద్ద పీట వేయడానికి తాపత్రయ పడడం!!

★ ఉరి శిక్ష రద్దు చేస్తే?

● నేరస్తుడు- పరివర్తన చెందే అవకాశం వుంటుంది.

★ స్త్రీకి స్త్రీయే శత్రువు. మీకున్న శత్రువులెవరు?

● లేరు!!

**డి. బి. ఆర్., యామలపేట**

★ చీకటిని తొలగించుకోడానికి దీపం వెల్గించుకోవాలి. మరి సక్రమమైన ప్రగతి మార్గంలో పయనించాలంటే!

● ఆ దీపం చేత పట్టి నడవాలి.

**మధు, అంబుసోలి**

★ స్త్రీ జీవితంలో సుఖం ఎప్పుడు అనుభవిస్తుంది?

● ఇంటా బయటా తననో మనిషిగా ఎంచినప్పుడు.

★ ఇప్పుడు వస్తున్న రచనలు దేనికి నిదర్శనాలు?

● నేటి పఠితల అభిరుచికి, రచయితల నేర్పుకి.

★ సతీ సహగమనంపై మీ అభిప్రాయం!

● దారుణం. హత్యకంటే హీనమైన నేరం.

**జి. వి. కె. ఆర్., సికింద్రాబాదు**

★ మనిషి మంచిగా మారడానికి మార్గం?

● కనీసం రోజుకో మంచి పుస్తకంలో కనీసం ఓ పేజీ చదవడం మంచి సంగీతం వినడానికిదా ప్రయత్నించడం, ప్రకృతిలోని అందాన్ని ఆస్వాదించడానికీ, మనిషిలోని మంచిని చూడడానికి ప్రయత్నించడం చాలు- మనిషిని మనిషిగా నిలబెట్టడానికని నేను నమ్ముతాను




**రఫీ, కాశీబుగ్గ**

★ నేటి సమాజాన్ని సంస్కరింప చేసేవి ఏవి?

● వర్తమానపు వూహలు.

★ స్త్రీ చేతిలో మగాడు కీలుబొమ్మగా మారేదెప్పుడు?

● అనవసరం.

**బి. కె. ఆర్., సోంపేట**

★ అక్కయ్యా రామాయణ మహా భారతాలు జరిగాయి అనడానికి ఆధారాలేమిటి? వ్యాసుడు ఆ తరాలకు చెందిన వాడు కాదా?

● చూడు, నేను యివన్నీ ఆలోచిస్తూ... వాటినెప్పుడూ చదవడానికి ప్రయత్నించ లేదు!! రాముడు దేవుడా! ద్రౌపతికి ఐదుగురు భర్తలా అని ఆలోచించడం దేనికి! ఈనాటి నవలలూ, ఇతర రచనలూ మీరు యిలాంటి ప్రశ్నలు వేసుకుంటూ చదువుతారా?!

**రాజు, నారాయణపేట**

★ మీరున్న రాష్ట్ర ముఖ్యమంత్రి అమెరికా నుంచి ఆ రాష్ట్రాన్ని చక్కగా పాలిస్తున్నారు. ఇదంతా దైవ మహిమ అంటారా?

● ఇంకో దేవుడు ఎందుకు? మా రాష్ట్రానికి ఎం.జి.ఆర్ దేవుడు ఆయన ఎక్కడి నుంచి పాలించినా ఒకటే!

**ఎస్. వి. ఆర్., గోవా**

★ ఒకరోజు బస్సులో ఒక మహిళను ఇక్కడ సీటు వుంది రండి కూర్చోండి' అన్నాను. ఆమె తప్పుగా భావించి నాతో గొడవ పెట్టుకుంది అందరూ నన్నే అన్నారు. నే చేసినది తప్పా?

● తప్పు కాదు- ఆమె మీకు తెలిసిన వ్యక్తి అయితే. లేకుంటే ఇక్కడ సీటుందని మిరు కండక్టరుకి చెప్పాలి కదా- ఆవిడగారికి ఇష్టమైతే కూర్చుని వుండేది- లేదా లేదు. ఈ రోజులను బట్టి ఆడవారు ప్రతి చిన్న విషయానికీ ఉలిక్కిపడుతున్నారంతే.

**సిహెచ్. ఎన్. ఆర్., సత్తెనపల్లి**

★ స్వర్గీయ ఇందిరాగాంధీతో మీరు ఎప్పుడైనా మాట్లాడడం జరిగిందా?

● ఆ. రెండుసార్లు. కాని దాన్ని పీకి లాగి నాల్గు సీరియల్ వ్యాసాలు లాగిద్దామనిపించలేదు. కారణం- నేను రాజకీయవేత్తగానో, పి.యమ్.గానో ఆమెని చూడలేదు- స్త్రీగా మాత్రమే చూశాను.

★ ఉరి తీసే ముందు చివరి కోర్కె అడుగుతారు తీరుస్తారా?

● తీర్పుకల్గినదైతేనే తప్పించుకుపోవాలనో- ఒదిలెయ్యండనో అడిగితే- కుదరదు! ఆఖైముళ్లో దేవుణ్ని, సాటివారినో దొంగ సాక్షులనో తిట్టుకుంటాడుగాని- యింకేం అడుగుతాడు?! □






పిచ్చికాదుటే పిన్నీ... రాత్రి
నాగార్జున సిమెంట్ తో యిల్లు
కట్టుకున్నట్లు కలొచ్చిందట! అదో
ఆనందం!! కలొస్తేనే అంత ఆనందం
అయితే నిజంగానే ఆ సిమెంట్ తో
ఇల్లు కడ్తే ఇంకెంత ఆనందమో!!

MAM 85



సి.వి.సర్వేశ్వరశర్మ
కుమారి చావలి శ్రీవాగ్దేవి

రంగారావు వీధి గదిలో తన టేబుల్ ముందు కూర్చొని ఏదో రాసుకుంటున్నాడు. కాంపౌండు గేటు తీసిన చప్పుడయితే తలెత్తి చూశాడు. సీసా ఒకటి పుచ్చుకుని ఒకామె లోపలకు వస్తోంది. రంగారావు ఆలోచనకు ఆమె ఎవరో అంద లేదు.

ఆమె గుమ్మంలో నుంచుంది.

"ఏం కావాలి?" అన్నట్లు రంగారావు చూశాడు.

"సెప్టిక్ లెట్రిన్ ప్లేట్లు క్లీన్ చేసుకునే యాసిడ్ తీసుకుంటారేమోనని...." ఆమె అంది.

"మీరు తీసుకు వచ్చా రేమిటి?" రంగారావు ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"నేను సేల్సు గరల్‌ని. మా కంపెనీ ఈ యాసిడ్‌ని కొత్తగా తయారు చేస్తోంది. మార్కెట్‌లో దీని గురించి బాగా తెలియడం కోసం ఇంటింటికి వెళ్లి అమ్ముతున్నాం" ఆమె అంది.

రంగారావుకు ఎంతో సంతోషం అయ్యింది. చాలా కాలంగా ఒక సేల్సుగరల్‌ని ఇంటర్వ్యూ చేయాలనుకుంటున్నాడు. అవకాశం ఇంటికి వచ్చింది. తన పని తరువాత చేసుకో వచ్చు ననుకున్నాడు.

"రండి! అలా కుర్చీలో కూర్చోండి" రంగారావు ఆహ్వానించాడు.

"కూర్చుంటే, ఎలాగండి! మేము త్వర త్వరగా మా పని పూర్తి చేసుకుని నలుగుర్ని కలసి వెళ్లి పోవాలండి" ఆమె అంది.

"సీసాలు రెండు నేను కొంటాను" రంగారావు అన్నాడు.

ఆమె ముఖంలో ఆనందం రంగారావు గుర్తించాడు. ఆమె గది లోకి వచ్చి రంగారావు ముందున్న టేబుల్ మీద సీసా ఉంచింది. రంగారావు కూర్చున్న గదిలో ఎక్కడ చూసినా పుస్తకాలు.

"కూర్చోండమ్మా" ఆమెకు కుర్చీ చూపించాడు.

ఆమె "ఫర్వాలేదండి" అంటోంది. అయినా పైన తిరుగుతున్న ఫ్యాన్ గాలికి శరీరంలో అలసట బయటకు వచ్చినట్లయి ఆ కుర్చీలో అప్రయత్నంగా కూర్చుండి పోయింది.

"కొంచెం మంచి నీళ్లు కావాలా?" రంగారావు అడిగాడు.

ఆమె ఆశ్చర్యంగా రంగారావు కేసి చూసింది. నలభయి సంవత్సరాల వయస్సు గల రంగారావు కళ్లల్లో ఆమెకు ఏ విధమైన దోషం కన్పించినట్లు లేదు. మంచినీళ్లు కావాలని తలూపింది.

రంగారావు ఇంట్లోకి వినిపించేటట్లు గట్టిగా అన్నాడు.

"దేవీ: మంచినీళ్లు తీసుకురా"

"మీది ఏ ఊరు?" రంగారావు అడిగాడు.

"పాలకొల్లు" ఆమె చెప్పింది.

"పాలకొల్లులో కొత్తగా పెట్టారా ఈ కంపెనీ" రంగారావు ప్రశ్నించాడు.

ఆమె కొంచెం అయిష్టంగా కన్పించింది. "ఎండలో వచ్చారు కదా! కొంచెం సేద తీర్చుకోండి." రంగారావు మాటల్లో ఆమెకు ఏదో ఆప్యాయత అభిమానం కన్పించాయి.

గుమ్మం తెర తొలగించుకుని పద్దెనిమిదేళ్ల దేవి మంచి నీళ్లు తీసుకుని వచ్చింది. రంగారావు సైగను అర్థం చేసుకుని దేవి ఆమెకు మంచి నీళ్లు ఇచ్చింది. ఆమె మంచి నీళ్లు తాగింది.

"దేవీ! అమ్మను కాఫీ ఇమ్మను. ఈవిడ చాలా అలసినట్లు కన్పిస్తున్నారు" రంగారావు మాటలకు సేల్సు గరల్ "వద్దండి! నేను వెళ్లి పోతాను" అంది.

"రెండు నిముషాల్లో కాఫీ తయారవుతుంది. మీరు ఇంటికి వెళ్లేసరికి ఎంత టైము అవుతుందో తెలియదు కదా!" రంగారావు అన్నాడు.

ఆమె మాట్లాడలేదు. నిజానికి ఆమెకు కాఫీ తాగాలనివుంది. కాని పరిచయం లేనిచోట కాఫీలు తాగి కొత్త సమస్యలు సృష్టించుకోవడం ఆమెకు నచ్చదు. శరీర పరిస్థితి తన అభిప్రాయాలకు అతీతంగావుంది. ఆమె తన భావాలు బయటకు కనబడనివిధంగా గంభీరంగా కూర్చుంది.

"మీ పేరు?" అడిగాడు.

"మీరు యిన్ని ప్రశ్నలు వేస్తున్నారు. మీకు ఏమికావాలి. సరుకా? నా వివరాలా?" ఆమె సూటిగా అడిగింది.

రంగారావు నివ్వెరపోయాడు. తన ఆలోచనలో తనువున్నాడు. ఆమెకు తన అభిమతం చెప్పాలనుకున్నాడు.

"మీరు అలా కోపగించి మాట్లాడనవసరంలేదు. నేను ఒక రచయితను. మగవాడితో సమానంగా అన్నిరంగాల్లోను స్త్రీ ముందుకు వస్తోంది. స్త్రీ శక్తిని సమాజం గుర్తించింది. కాగితాలమీద ఊహలతో రాసే విషయాలకన్నా, ప్రత్యక్షంగా మీ అనుభవాలు విని వాటిని పాఠకులకు అందించాలని నా కోరిక" రంగారావు అన్నాడు.

"ఏమి అందిస్తారు? ఒక స్త్రీ యింటింటికి వెళ్ళి యాసిడ్ సీసాలు అమ్మగలదనా?" ఆమె అడిగింది.

గేటు తీసిన చప్పుడయింది. రంగారావు అటు చూశాడు. మరొకామె గేటు తీసుకుని లోపలకు వచ్చింది. "అక్కా! ఇక్కడ కూర్చుండిపోయావేమిటి?" ఆమె అంది.

రంగారావుకు విషయం అర్థమయ్యింది. "రండి లోపలకు. అలా కూర్చోండి" మరొక కుర్చీ చూపించాడు.

"వెళ్ళిపోదాం బయలుదేరు" చెల్లి అంది.

"కాఫీ తాగి వెడుదురుగాని" రంగారావు అన్నాడు.

"వీరు రచయితట. నా వివరాలు అడుగుతున్నారు. పాఠకులకు నా అనుభవాలు చెబుతారట!" అక్క అంది.

"అవునండి. మీరు ధైర్యంగా పొరుగూళ్ళు వెళ్ళి సేల్సు చేస్తున్నారు. వంటరిగా స్త్రీలు ప్రయాణంచేసి, వ్యాపారం చేసే స్థాయికి మన దేశ నాగరికత ఎదిగిందంటే మనం స్వతంత్రం వచ్చిన తరువాత ఎంత పురోగమించామో అంచనా వేయలేకపోతున్నా" రంగారావు అన్నాడు.

"ఎంతమంది స్త్రీలు వ్యాపారం చేయటంలేదు. చేపలు అమ్మే స్త్రీలు ఎందరో ఒంటరిగా బస్సులమీద ప్రయాణం చేస్తూ, వ్యాపారం అనాదిగా చేస్తున్నారు. అందులో కొత్త ఏముంది?" చెల్లి అంది.

"ఆ వ్యాపారం వేరు. వారు కలసి వ్యాపారానికి ఒకచోటు నుండి మరొకచోటుకు వెడుతుంటారు. అలవాటు ఊళ్ళకే వెడతారు. మీరు అలాకాక కొత్తకొత్త ఊళ్ళకు, పరిచయంలేని యిళ్ళకు వెళ్ళి సేల్సు కొనసాగించడం..... ఎందుకో నాకు కొత్త విషయంగా అన్పిస్తోంది. మన ప్రగతికి యిదొక ప్రతీకగా తోస్తోంది" రంగారావు అన్నాడు.

"మా అనుభవాలు తెలుసుకుని రాస్తే ఏమిటి లాభం?" చెల్లి అడిగింది.

"మీ అనుభవాలు యితరులకు మార్గదర్శకం

కావచ్చు. లేదా సామాజిక చైతన్యానికి ఉపయోగపడవచ్చు" రంగారావు అన్నాడు.

అంటే?" చెల్లి అడిగింది.

"నిరుత్సాహంతో నీరుకారిపోయే కొంతమందికి మీ అనుభవాలు వారి కొత్త జీవితానికి ఆశలు కల్పించవచ్చు లేదా కొన్ని సంఘటనలు మనిషి మనసును కదలించి అతని లేదా ఆమెలో ని పైశాచిక ప్రవృత్తికి స్వస్తి చెప్పించవచ్చు" రంగారావు అన్నాడు.

"మీరు చాలాబాగా చెప్పారు అయితే ఈ స్వార్థపూరిత సమాజంలో ఎవరిబ్రతుకుతెరువు వారే చూసుకుంటున్నారుగాని సామాజిక బాధ్యత నెత్తిన పెట్టుకునేవారు ఎవరువుంటారనుకున్నాను. రచయిత డబ్బుకోసం రచనలు అమ్ముకుంటాడనుకున్నాను" చెల్లి అంది.

రంగారావు ఆమెను పరిశీలనగా చూశాడు. ఇరవై ఆరు సంవత్సరాల వయస్సు వుంటుంది. ఎంతో నాజూగ్గావుంది. అందం ఆమె ముఖంలో తాండవిస్తోంది. అక్క వయస్సు యిరవై ఎనిమిది వుంటాయి. వయసులో చిన్నదయినా ఆమె ముఖంలో అందం ప్రక్కన వయసుకు మించిన అనుభవాలు వున్నట్లు రంగారావుకు అన్పించింది.

"మీ పేరు?" రంగారావు అడిగాడు.

"రేవతి" ఆమె చెప్పింది.

"వయసుకు మించిన అనుభవంతో మాట్లాడుతున్నారు. మీ అభిప్రాయాలు తమాషాగా వున్నాయి" రంగారావు అన్నాడు.

"దేశాన్ని పాలించే నాయకులే అవకాశం దొరికితే పెద్ద నాయకుడిని గద్దెదించాలనే ఆలోచనలతో వుంటున్నారు. జాతీయ సమైక్యతాభావం అని ఉపన్యాసాలు యిస్తూ, దేశాన్ని రక్షించేందుకు గట్టి నాయకుడు కావాలనే మాట మారుస్తూ స్వార్థంతో తమ జేబులు నింపుకునే ధోరణితో ఈ దేశం ఎటుపోతే మన కెందుకులే అని ప్రవర్తించే రాజకీయనాయకులే స్వీకరించని బాధ్యత రచయిత స్వీకరించగలడా?" రేవతి ఆవేశంగా అంది.

"మీ ఆవేదన చాలు చైతన్యానికి. అయితే మీ ఆవేదన పదిమందికి తెలియాలి. మీ ఆవేదన, ఆవేశం, అనుభవాలు ప్రజలను ఆలోచింపజేసేవిగా ప్రయోగించాలి. అదే రచయిత బాధ్యత" రంగారావు అన్నాడు.

"అక్కా! నీ విషయం పూర్తిగా చెప్పు. ఈయన చెప్పినట్లు యితరులకైనా ఉపయోగిస్తుంది" రేవతి చాలా ఆవేశంతో అంది.

"మీ పేరు?" రంగారావు అడిగాడు.

"కాత్యాయని" ఆమె చెప్పింది.

"నువ్వు చెబుతావా? నేను చెప్పనా?" రేవతి కాత్యాయనికేసి చూసి అడిగింది.

దేవి కాఫీ తీసుకువచ్చింది.

"ముందు కాఫీ తాగండి. తర్వాత మాట్లాడుకుందాం" రంగారావు అన్నాడు.

* * * * *

"ఇప్పుడు చెప్పండి" రంగావు అడిగాడు.

"మా అక్క చెప్పదు. నేను చెబుతాను వినండి. మా బావ తాగుబోతు. మా అక్క కష్టపడి డబ్బులు సంపాదించి అతనికి యివ్వాలి. అతడు తాగుడుకి డబ్బు యివ్వకపోతే తన్నుతాడు" రేవతి చెప్పింది.

రంగారావు నమ్మలేకపోతున్నాడు. కాత్యాయని ఎంతో ఆకర్షణీయంగా, హుందాగా వుంది. పైగా ఆమె చదువుకున్న స్త్రీలా కన్పిస్తోంది. తనూహించింది నిజమయితే, భర్తను అదుపులో వుంచుకోలేదా?

"మీరు చెబుతున్నారు కాబట్టి నమ్మాలి. మీ అక్క చదువుకున్నట్లు కన్పిస్తున్నారు పెళ్ళయి ఎన్నాళ్ళయింది?"

"మా అక్క యింటర్ చదివింది. పెళ్ళయి పది



ఏళ్ళయింది మా అక్క జీవితం పెళ్ళితో కష్టాల్లోకి వెళ్ళిపోయింది రేవతి చెబుతూంటే, కాత్యాయని వింటోంది

"దగ్గర సంబంధమా?" అడిగాడు

'కాదు అదొక దురదృష్టం మా అక్కను ప్రేమించి మా బావ పెళ్ళిచేసుకున్నాడు' రేవతి చెప్పింది

రంగారావులో ఆసక్తి మొదలయింది "వీరిద్దరికి అసలు పరిచయం ఎలా జరిగింది?

'మా కుటుంబం పాలకొల్లు నుండి విజయవాడకు మారింది అప్పటికి అక్క యింటర్ పరీక్షలు రాసింది విజయవాడలో మేము అద్దెకు వుంటున్న యింటిలో మరొక వాటాలో మా బావ తల్లి దండ్రులతో వుండేవాడు మా అక్క అందానికి అతడు యిష్టపడి ప్రేమించాడు

మీ అక్క రంగారావు అర్థోక్తి ఆగాడు.

"మా అక్క ఎటువంటి ఆలోచనా లేదు. మా కుటుంబం వివరాలు తెలుసుకుని మా అమ్మగార్ని అడిగాడు "

ఏమని?

"మీ కాత్యాయనిని నేను పెళ్ళిచేసుకుంటాను "

మా బావ మంచివాడని గుర్తించిన మా అమ్మ ఈ పెళ్ళికి వెంటనే ఒప్పుకుంది గుళ్ళో పెళ్ళిచేసుకుని యింటికి వచ్చారు ఆ తర్వాత మొదలయింది గొడవ మా బావ తల్లిదండ్రులకు ఈ సంబంధం యిష్టంలేదు కొన్నిరోజుల్లో గొడవ సర్దుకు పోతుందనుకున్నాము కాని కొత్తకొత్త సమస్యలు మొదలయ్యాయి

మీ నాన్నగారు ' రంగారావు ఏదో అనబోయాడు

"మానాన్నగారు వున్నారు మా అమ్మకు నాన్నగారికి ఎలాంటి పేచీలు లేవు మధ్యమధ్య మా యింటికి వచ్చి మా మంచి చెడలు తెలుసుకుంటారు" రేవతి అంది.

రంగారావుకు రేవతి చెప్పేవిషయాలు వింటూంటే మనుషుల జీవితాలవెనుక కన్పించని మలుపులు ఎన్నో వుంటాయన్పిస్తోంది.

"మీ నాన్నగారు ఏమిచేస్తూవుంటారు?"

'మా నాన్నగారు టీచర్ ఆయన చాలా మంచివారు రెక్కలే ఆధారం మేము పాలకొల్లులో, వుండేవాళ్ళం మా నాన్నగారి జీతం మా కుటుంబ పోషణకు సరిపడేదికాదు ఆయనకు తెలియకో, సరియైన సలహా యిచ్చేవారు లేకపోవడం వల్లనో మా అమ్మా నాన్నలు ఎనమండుగురు సంతానానికి తలితండ్రులైపోయారు" కాత్యాయని మాటల్లో ఎంతో నిదానంవుంది ఆవేశంలేదు

రంగారావు, రేవతి కాత్యాయనికేసి చూస్తున్నారు ఆమె చెబుతోంది.

'కుటుంబ పోషణకోసం అమ్మ డబ్బు సంపాదించాల్సివచ్చింది. అమ్మ చదువుకోలేదు. విజయవాడ వచ్చి వంటలు చేయడం మొదలు పెట్టింది నాన్న కొంత డబ్బు పంపించడం మొత్తంమీద సంసారం దొర్లేది."

"ఇలాంటి యిబ్బందిలో నన్ను పెళ్ళి చేసుకుంటానని మావారు ముందుకు వచ్చేసరికి, సంసార భారం కొంత తగ్గుతుందని మా అమ్మ ఒప్పుకుంది మా నాన్నగారికి యిలాంటి విషయాల్లో కలుగజేసుకునే చాకచక్యంలేదు "

రంగారావు ఆలోచనలో పడ్డాడు తండ్రి టీచర్ అటువంటప్పుడు కుటుంబాన్ని అలా ఎలా వదిలేశాడు మరి ఆ తండ్రి ఎక్కడ టీచరో? బహుశా ప్రయివేటుగా చదువుచెప్పే టీచరు అయ్యి వుండవచ్చు అసలువిషయం వినాలని ఆమెకేసి కుతూహలంగా చూశాడు

"మీ భర్త పెళ్ళినాటికే తాగుడు అలవాటు వుండేదా?" రంగారావు అడిగాడు




నా భర్తకి పెళ్ళినాటికి ఏవిధమైన దురలవాట్లు లేవు ఉద్యోగం చేసేవారు. పెళ్ళయిన వెంటనే ఉద్యోగం పోయింది" కాత్యాయని చెప్పింది.

"ఏదైనా తప్పుడుపని చేశాడా?" రంగారావు ప్రశ్నించాడు

"నా భర్త ఒక ప్రయివేటు కంపెనీలో పనిచేసేవారు ఆయన ఉద్యోగం పట్టణంలో అన్ని షాపుల్లోకి వెళ్ళి కంపెనీ సరఫరాచేసిన సరుకు బాపతు సొమ్ము అడిగి తీసుకురావాలి."

"ఈ ఉద్యోగం డబ్బుతో ముడిపడివుందికాబట్టి, కంపెనీకి కొంత సొమ్ము ధరావత్తు కట్టాలి లేదా కొంచెం పలుకుబడి గలవారు హామీ వుండాలి. చాలా కాలం ఈ ఉద్యోగం మా మామగారు చేశారు ఆయన పలుకుబడిమీద నా భర్తకు ఉద్యోగం యిచ్చారు.'

'తల్లిదండ్రులను కాదని నా భర్త నన్ను పెళ్ళిచేసుకోవడంతో కంపెనీవారికి కొడుకు విషయంలో తనకు సంబంధం లేదని నా మామగారు చెప్పారు. నా భర్త ఉద్యోగం పోయింది "

'పెళ్ళి చేశాం నీ గొడవ నువ్వు నీ భర్తా చూసుకోవాలి. నేను ఏమీ చేయలేను మా అమ్మ ఖచ్చితంగా చెప్పేసింది రోజు ఎలా గడుస్తుంది? ఆకలి తట్టుకోలేంకదా! కాయకష్టం చేయడానికి సిద్ధపడలేము ఒక ఫ్యాన్సీ దుకాణంలో సేల్సుగరల్ ఉద్యోగం సులువుగా దొరికింది నన్ను చూడగానే ఉద్యోగం యిచ్చాడు "

'మీ భర్త అంగీకరించారా?" రంగారావు అడిగాడు.

"ఏమిచేస్తారు బ్రతుకుతెరువు జీతం తక్కువ ఎక్కువ సమయం దుకాణంలో వుండాలి." కాత్యాయని చెప్పింది

"మీ భర్త ఉద్యోగంకోసం ప్రయత్నించారా? రంగారావు అడిగాడు

"ప్రయత్నించారు అనుభవం అడిగినపుడు పాత కంపెనీలో పనిచేసిన మాట చెప్పేవారు ఎందుకు ఆ ఉద్యోగం మానేశారు? వాళ్ళు ఎందుకు మిమ్మల్ని తీసేశారు? అడిగేవారు నా భర్త చెప్పిన సమాధానాలు వారికి నచ్చేవికాదు మాకు హామీ ఏమిటి? ఈవిధంగా ఉద్యోగం రాలేదు '

"సమయాన్ని మీ భర్త ఎలా గడిపేవారు?' రంగారావు ప్రశ్నించాడు

ఇంటిపని ఆయన చేసేవారు వంటచేసి నన్ను చూసి ఎంతో బాధపడేవారు 'పెళ్ళిచేసుకుని నిన్ను సుఖపెట్టడానికి బదులు నీ సంపాదనతో బ్రతుకుతున్నాను' అని ఎంతో మానసికంగా నలిగిపోయేవారు. నాకు తోచిన ధైర్యం నేను చెప్పేదాన్ని" కాత్యాయని చెపుతుంటే రేవతి మధ్యలో అంది –

"మా బావ మంచి ధైర్యం గలవాడు ఏమాత్రం ఆధారం దొరికినా తన కుటుంబాన్ని తాను

పోషించుకునేవాడు ఆర్థికంగా ఏమాత్రం బలంలేదు అక్క జీతంరాళ్ళు ఆధారం. ఆ జీతమైనా అంతంతమాత్రం. వయసులో వున్న బావకు డబ్బు లేదుగాని కోరికలు, సరదాలు చచ్చిపోవుకదా ఖాళీగా ఉండడంవల్ల స్నేహితులు తయ్యారయ్యారు. వాళ్ళతో సినిమాలకు వెళ్ళేవాడు'

రేవతికేసి కాత్యాయని కోపంగా చూసింది

ఎందుకు అలా కోపంగా చూస్తావు ఉన్నమాటే చెబుతున్నాను మొగుడు ఎంత హింసించినా అతడిని ఎవరూ ఏమి అనడానికి వీలు లేదంటుందండి ఈ మహా ఇల్లాలు" రేవతి మాటలకు కాత్యాయని మౌనంగా తలవంచుకుంది

చిల్లరఖర్చులకు మీ బావ ఏమైనా సంపాదించు కునేవారా? రంగారావు అడిగాడు

మొదట్లో స్నేహితులు తీసుకువెళ్ళేవారు వాళ్ళకి అన్నీ దురలవాట్లే మా బావకు మెల్లిగా తాగుడు అలవాటు అయ్యింది మొదట్లో చాలా భయపడేవాడు తర్వాత తర్వాత తాగేసి యింటికి వచ్చేవాడు మా అక్క కళ్ళు తెరచి ఎందుకు యిలాంటిపనిచేస్తున్నారని? అడిగేసమయానికి అతడు వ్యసనానికి బానిస అయిపోయాడు.

మనిషికి ఏదో వ్యాపకం వుంటే మరొక ఆలోచన లేకుండా, ఆ వ్యాపకంలోపడి వుంటాడు ఆర్థికసోమత, మనోధైర్యం లేకపోతే వివేకం కోల్పోయి, తన ఉనికిని తనే మర్చిపోయేస్థితికి మనిషి రావడంలో ఆశ్చర్యం ఏముంది?" రంగారావు అన్నాడు

"మీరు చెప్పింది నిజమే. ఇటు నా తల్లిదండ్రులు అటు ఆయన తల్లిదండ్రులు మా మంచిచెడ్డలు పట్టించుకోనిస్థితిలో వదిలేశారు మాజీవితాంతం నడిసముద్రంలో చుక్కాని లేని నావలా తయారయ్యింది అనుభవంలేని నేను జీవితాన్ని ఎలా సరిదిద్దుకోగలను?' కాత్యాయని ప్రశ్నార్థకంగా అంది

మా అక్క బావని చేజేతులా యిప్పటికీ పాడుచేస్తోంది రోజూ తాగేందుకు డబ్బులు యిస్తుంది బావ తాగి వస్తాడు ఇంటికి వచ్చి అక్కను కొడతాడు రేవతి ఆవేశంతో తన ఆవేదనను వెళ్ళబోస్తోంది

రేవతి మాటలు కాత్యాయని అయిష్టంగా వింటోంది

ఫ్యాన్సీ దుకాణం నుండి ఈ యాసిడ్ కంపెనీలోకి ఎలా వచ్చారు?" రంగారావు టాపిక్ మార్చడానికి ప్రయత్నిస్తూ అడిగాడు

"జీతం మొదట్లో సరిపెట్టుకునేందుకు ప్రయత్నించేవాళ్ళం. కాని ఖర్చులు, ఖరీదులు పెరగడంతో మరొక ఉద్యోగం చేయాల్సి వచ్చింది. ఫ్యాన్సీదుకాణం ఎదురుగా యాసిడ్ తయారుచేసే కంపెనీలో సేల్సుగరల్ నందినితో పరిచయం అయ్యింది ఆమె నన్ను ఆ కంపెనీలో జేర్పించింది

"జీతం బాగావచ్చేదా? రంగారావు అడిగాడు

"జీతంలో మార్పులేదు కాని సీసాలు అమ్మినందుకు అదనంగా కమీషన్ యిచ్చేవారు జాగ్రత్తగా కంపెనీని కనిపెట్టుకుని ఉద్యోగం చేయడం వల్ల యాసిడ్ ఎలా తయారుచేస్తారో కిటుకు తెలుసుకున్నాను తక్కువ పెట్టుబడితో ఈ వ్యాపారం చేయవచ్చునని ఆలోచనవచ్చింది కాత్యాయని చెబుతోంది

అవసరం అన్వేషణకు ప్రాతిపదిక బ్రతుకు తెరువుకోసం ఏదో ఒక మార్గం కాత్యాయని గొప్పవ్యక్తి నైతికంగా దిగజారకుండా తన సంసారాన్ని గుట్టుగా చేసుకుంటున్న స్త్రీ మూర్తి ఆమెలో ఎంతటి వినయం, ఎలాంటి ఆలోచనలు వున్నాయి" రంగారావు ఆలోచిస్తున్నాడు

వింటోంది

"రేవతిగారు చెప్పినట్లు ఎందుకు చేయలేక పోతున్నారు మీకు అభ్యంతరం లేకపోతే చెప్పండి" రంగారావు అన్నాడు

కాత్యాయని రంగారావుకేసి సాలోచనగా చూసింది

'తెలియని వయసులో పరిచయం లేని వ్యక్తితో నా యిష్టా యిష్టాలతో ప్రమేయంలేకుండా పెళ్ళిచేశారు నా వునికి నేను తెలుసుకునేసరికి పరిస్థితులు నా చేయి దాటిపోయాయి ఫలితం నేను అనుభవిస్తున్నాను ప్రపంచం కొంత అవగాహన అయిన నేను ఏదైనా ఒక నిర్ణయం తీసుకుంటే యింతకంటే దారుణమైన ఫలితాలు అనుభవించ వలసివస్తే ఏమిచేయ్యాలి? కాత్యాయని అడిగింది

అక్క భయంగాని, భర్త పెట్టే హింసలను భరించలేక ఎంతమంది విడాకులిచ్చి సుఖపడటం




మా అక్క సంపాదన మా బావ తాగుడుకు అంకితం పగలు యాసిడ్ సీసాలు అమ్మి డబ్బు సంపాదించి అలసిపోతుంది ఇంటికి వెళ్ళేసరికి డబ్బు కోసం బావ ఎదురుచూస్తూ వుంటాడు బావకి డబ్బులుయిస్తుంది తాగుడు రాత్రి ఏదో సమయంలో యింటికి వస్తాడు అక్కను కొడతాడు అక్క ఏడుస్తుంది మేము భరించలేము" రేవతి తన అక్క బలహీనత దీనికి కారణం అంటుంది'

కాత్యాయని ముఖంలో ఆందోళనలేదు ప్రశాంతంగావుంది ఆమె గంభీర స్వభావం గలది

"అక్కకి మానసిక సౌఖ్యం, శారీరక సుఖం రెండూలేవు. ఏనాడో గుళ్ళో అయిన పెళ్ళికి విలువ అంటుంది ఈ నరకం నుండి బయటకు రావడానికి ఒకటే మార్గం బావను విడిచిపెట్టెయ్యమన్నాను అక్క ఒప్పుకోవటంలేదు రేవతి నిక్కచ్చిగా తన అభిప్రాయం చెప్పేసింది కాత్యాయని మౌనంగా

లేదు అక్క అదృష్టం ఎల్లలు కూడాలేరు చక్కగా తన జీవనం తను సాగించవచ్చు ఇలాంటివారికి రక్షణ కల్పించే స్వచ్ఛంద కేంద్రాలు కూడా వున్నాయి రేవతి ఆలోచనలు చెబుతోంది

"దూరపు కొండలు నునుపుది దగ్గరకు వెడితేకాని కన్పించవు ఎత్తు – పల్లాలు ఎక్కడ వుండే సమస్యలు అక్కడ వుంటాయి' కాత్యాయని తల వొంచుకుని అంది

యాసిడ్ సీసాల్లో పోసేందుకు కావలసిన సీసాలు తెచ్చుకునేందుకు అక్క వంటరిగా రాత్రి సమయాల్లో కూడా బ్రాందీ షాపుల్లోకి వెళుతుంది వంటరిగా రాత్రి సమయాల్లో ప్రయాణం చేస్తుంది ఇంకా ఏవేవో సమస్యలని భయపడుతుంది అంత ధైర్యంగల అక్క బావ విషయంలో బేలయిపోతుంది ఎందుకో అర్థం కాదు. రేవతిలో విశ్లేషణా చాతుర్యానికి రంగారావు ఆమెను మనసులో అభినందించుకున్నాడు

"రాత్రి ఒంటరిగా స్త్రీ ప్రయాణించడం అంటె చాలా గొప్పవిషయం సామాజికంగా సమస్యలు ఎదురుకావా? బ్రాందీషాపులోకి వెడితే యిబ్బందులు ఏమీ వుండవా?" రంగారావు యింటర్వ్యూచేసే ధోరణిలో అడిగాడు.

కాత్యాయని రేవతికేసి చూసింది

"అలా చూడకు అక్కా! నిన్ను తక్కువచేసి మాట్లాడాలనికాదు నావుద్దేశ్యం నీ కథ విని కొంతమందయినా జాలిపడతారు, సానుభూతి చూపిస్తారు ఈ జాలి, సానుభూతి నీ జీవితానికి సుఖం తీసుకురాగలవా? అన్పించవచ్చు నీకు నీ కథ సమాజంలో కొంతమందికయినా చేరుతుంది. నిరాశతో తాగుడువంటి దురభ్యాలకు మనిషి వెళ్ళకుండా చేయవచ్చు లేదా అలాంటి దురభ్యాసాలు గలవారు మారవచ్చు"

'మీరు చెప్పింది నిజం మీ కథవల్ల తప్పక సామాజిక ప్రయోజనం వుంటుంది చెప్పండి" రంగారావు ప్రోత్సహించాడు

"సమాజం కత్తుల బోనువంటిది. ఏ మాత్రం అజాగ్రత్తగా ప్రవర్తించినా గాయం తప్పదు. తలవొంచుకుని పరిసరాలు గమనించనట్లుగా ఉంటూనే పరిసరాలు గమనించుకుంటూ జీవితం గడపాలి. అలవాటు ప్రదేశాల్లో సమస్యలకన్నా కొత్త ప్రదేశాల్లో కొత్త కొత్త సమస్యలు ఎదురవుతూ ఉంటాయి. అందుకే జనసమర్దంగల్ల ప్రాంతాల్లో మసలుతూ ఉండాలి" కాత్యాయని అనుభవాన్ని అందంగా మలచి చెబుతోంది.

'నాభర్తకు విడాకులు ఇవ్వమని చాలామంది సలహా ఇస్తున్నారు, నా మీద చూపించే సానుభూతికి నాకు ఎంతో సంతోషంగా ఉంది నా చెల్లి అనుభవాలు వేరు ఆమె జీవితం వేరు. ఆమె గురించి ప్రస్తావించను. నేను బాధపడి అవస్థ పడుతున్నానని ఆమె ఆవేదన "

నా అనుభవాలు చెబుతాను వినండి

"ఏ రాయి అయినా గుళ్లో ఉంటే ప్రజలు దేముడని కొలుస్తారు దండంపెడతారు అదే గుడి బయట ఉంటే మామూలు రాయిగా ఉంటుంది కాళ్ళతో తొక్కుతారు, ముళ్ల కంచెల్లోకి విసిరేస్తారు ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్ళు ఉపయోగిస్తారు."

నా కుటుంబాన్ని గమనించిన ఒక ఆసామీ నన్ను ఎంతో సానుభూతితో పలకరించాడు. చాలా గౌరవాన్ని ప్రదర్శించాడు. ఆయన వాత్సల్యానికి నేను పొంగిపోయాను. కనిపించినప్పుడు ఎంతో ఆదరంగా కుశల ప్రశ్నలు వేసేవారు. నా తండ్రి చూపించలేని ఆదరణ ఆయన దగ్గర ఉందని నమ్మాను. ఆయనకు నాకు ముప్పయి సంవత్సరాలు తేడా ఉంది

ఒక రోజున నా సంసార జీవితం గురించి ప్రస్తావిస్తూ సుఖపడలేని భర్తతో సంసారం ఎందుకు?? నీకు సంసార సుఖం నేను సమకూరుస్తాను అంటూ మనిషి లోతుకందని లోతుల్లో ఉన్న ఆయన స్వార్ధాన్ని బయట పెట్టాడు. కాత్యాయని ఆగిరిది. కాసేపు మౌనంగా ఉంది. అంతా నిశ్శబ్దం

మళ్ళీ ప్రారంభించింది.

ఒక రిప్రజెంటేటివ్‌తో సేల్సు సమయంలో పరిచయం అయ్యింది అతడు మంచివాడు. నాకన్నా నాల్గయిదేళ్ళు పెద్ద ఉంటాడు. నేనంటే చాలా ఇష్టం అని చెప్పాడు. నా అభిప్రాయం అడిగాడు. ఎందుకని అడిగాను చెప్పలేదు. కన్పించినప్పుడు ఎంతో ఇష్టంగా తనహద్దుల్లో ఉండి నాతో ప్రవర్తించేవాడు

'మీ తాగుబోతు భర్తతో ఎలా సంసారం చేయగల్గుతున్నారు. నాకు విచారంగా ఉంది మీ జీవితం చూస్తూ ఉంటే' అన్నాడు

'ఏమి చెయ్యమంటారు?' అడిగాను.

ధైర్యం చేసి అన్నాడు "మీరు, నేను కలిసి జీవిద్దామా?"

'అంటే' అని అడిగాను

'స్నేహితుల్లా. మీకు ఏ లోటు రానియ్యను. పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాను."

నేను నవ్వాను

'ఎందుకు నవ్వుతున్నారు?' అడిగాడు.

"మీకు ధైర్యం ఉంటే నన్ను పెళ్ళి చేసుకుని భార్యగా తీసుకు వెళ్ళండి" నేను అన్న మాటకు అతడు అదోలా అయిపోయాడు. మళ్ళీ కన్పించలేదు. 'నేను అంటే అతనికి ఇష్టం. బాగుంది. సమాజానికి భయపడి నన్ను పెళ్ళి చేసుకోలేదు "

'పోనీ పెళ్ళి చేసుకోవద్దు. నన్ను చేరదీసి నా మంచి చెడ్డలు చూస్తూ నన్ను కాపాడగల మొగవాడు ఎవరైనా ఉంటే నేను వెళ్ళిపోతాను. ఎవరైనా చూపగలరా నా వయస్సు, నా అందం, ఆకర్షణ ప్రతి మగవాడికి ఇష్టం అనిపించవచ్చు. నేను తొందరపడి నిర్ణయం తీసుకుంటే ఏమవుతుంది?"

చెప్పండి రంగారావుగారు ఇది జీవితం. సినిమాకాదు. తాళితెంపి ముఖాన పడేసేందుకు.

భర్తను వదలిన స్త్రీ అంటే ఆమె పరిస్థితి ఈ సమాజంలో ఎలా ఉంటుంది. సానుభూతి, జాలి ఇవన్నీ తమాషాలు. వీటి వెనుక స్వార్ధం గడపదాటనంత వరకూ విలువ."

ప్రస్తుతం నా భర్త తాగుడు మైకంలో నన్ను కొడుతున్నాడు మైకం లేనప్పుడు నేనంటే పంచ ప్రాణాలు. నిరాశ, నిస్పృహల పర్యవసానంగా వ్యసనానికి బానిస అయ్యాడు వీలయినంత వరకూ అతన్ని బాగు చెయ్యాలని నా ప్రయత్నం.

అతని మానాన అతన్ని వదలి నాకు తోచినట్లు నేను ప్రవర్తిస్తే అతని ప్రాణానికి ముప్పుకల్గితే దానికి నైతిక బాధ్యత ఎవరు వహిస్తారు. అతను నా భర్త. అందుకే దూరం నుండి రాళ్ళు విసరి నన్ను కొడదామని ప్రయత్నిస్తున్నారు

నా భర్త నీడలోంచి నేను బయటకు వస్తే అందరూ దగ్గరకువచ్చి రాళ్ళతో నన్ను బాదేస్తారు. నేను పిరికి దా ననుకాదు కాని సమస్యకు పరిష్కారం విడాకులని నేను భావించను

ఈ సమాజం స్త్రీ కూడా మనిషేనని ఆమె విలాస వస్తువుకాదని, ఆమెకు మనసు, అభిప్రాయాలు, అభిమతాలు ఉంటాయని ఎప్పుడైతే గుర్తించి ఆమెను గౌరవించగల్గుతుందో అప్పుడు తాగుబోతు భర్తకు దూరంగా ఒంటరిగా బ్రతకగలను.

అంతవరకూ ఆ భర్త నీడలో నా జీవితం సాగించక తప్పదు సలహాలు ఇచ్చినంత సులువుగా పనులు చెయ్యలేం

రంగారావు, రేవతి కాత్యాయని మాటలు వింటున్నారు అక్కలో కన్పించని అక్కను చూసి రేవతి ఆవేశం చల్లారిపోతోంది. కాత్యాయనిలాంటి స్త్రీల జీవితాలు వెనుక ఎలాంటి పచ్చి నిజాలుంటాయో సమాజానికి తెలియ జెప్పాలని రంగారావు నిశ్చయించుకున్నాడు. □



# వ్యక్తిగతం

## అసలు కారణం?

రామభద్రుడు పలికించిన "బాల రసాల సాల నవపల్లవ కోమల కావ్య కన్యకను" ఆయనకే అంకితం ఇస్తానని పోతనామాత్యుడు సింగ భూపాలుని కోర్కెను తిరస్కరించాడు. ఇప్పుడు మళ్ళీ ఇందిరా గాంధీ వర్ధంతి సందర్భంగా తాను ప్రత్యేకంగా కూర్చిన సంగీత సమ్మేళనాలను ప్రసారం చేస్తామనే దూరదర్శన్ వారి కోర్కెను తిరస్కరించారు సితార్ విద్వాంసుడు పండిత రవిశంకర్. "ఆ మహానుభావు రాలికి నేను వ్యక్తిగతంగా తెల్పిన నివాళి అది. నేను నా సంగీతంలో నా ఉద్వేగాలన్నిటినీ పలికించాను. నేను నా గదిలో, నా కోసం నేను సంగీత సాధన చేసుకోవడం లాంటిదది. అటువంటి పవిత్రమయిన, ఉద్వేగభరితమైన సంగీతాన్ని నేను బహిరంగంగా ప్రదర్శించదలచుకోలేదు" అని ఆయనన్నాడు. కాని ఆయనది పోతనామాత్యుని సాంప్రదాయమేమీ కాదని, గతంలో జవహర్‌లాల్ నెహ్రూ



కోసం వినిపించిన పవిత్ర సంగీతం విషయంలో ఆయన ఈ అభ్యంతరం చెప్పలేదని, ఇప్పుడు కూడా తన సంగీతాన్ని ఏదో విదేశీ టెలివిజన్ వారికి అమ్ముకున్నందు వల్లనే ఇలా అంటున్నారని వార్తలు వచ్చాయి...

## పత్రికాస్వేచ్ఛపై శుక్లా ప్రవచనాలు!

"సమాచార స్వేచ్ఛ ముఖ్యంగా భారత వర్తమానంలో దాని ప్రాముఖ్యత" అనేచర్చలో మాట్లాడుతూ ఒక వక్త



ఇప్పుడు పత్రికా స్వాతంత్ర్యం ఏమంత మెరుగుగా లేదని, ఈ పరిస్థితి అత్యవసర పరిస్థితి రోజులలాగానే ఉన్నదని అన్నారు. ఆ రోజులలో పత్రికలన్నిటినీ ప్రి సెన్సారుషిప్‌కు గురి చేశారని, సంజయ్‌గాంధీ అనుచర వర్గం పత్రికల మీద ఆధిపత్యం చలాయించిందనీ అందరికీ తెలుసు. ఈ పత్రికల మీద దాడికి అప్పుడు నాయకత్వం వహించిన వారు అప్పటి కేంద్ర సమాచార శాఖ మంత్రి విద్యాచరణ్ శుక్లా. పైన రాసిన మాటలు అన్న వక్త కూడా విద్యాచరణ్ శుక్లాయేనంటే ఆశ్చర్యమా? ఆయన ఈ మాటలు స్వానుభవంతో చెపుతున్నారను కోవాలా? ప్రస్తుతం నెరపుతున్న వి పి సింగ్ స్నేహం వల్ల చెపుతున్నారను కోవాలా?...

## మహిళా నాయకురాలికి స్థానంలేని మహిళా సమావేశం

స్త్రీలకు ప్రాముఖ్యం లేకపోవడం మాత్రమే కాదు. ఉన్న స్థానాన్ని, హోదాను వాడుకొనే అవకాశం కూడా లేదేమోనని రీనాకుమారి అనుభవం తెలియ జేస్తోంది. ఆమె శాసన సభ్యురాలు. ఉత్తరప్రదేశ్ యువజన కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి. క్రియాశీల కార్యకర్త అయిన ఆమెకు ఏమాత్రం భాగస్వామ్యం లేకుండా ఉత్తరప్రదేశ్ యువజన కాంగ్రెసు ఆధ్వర్యాన నవంబర్ 19న ఇందిరాగాంధీ జన్మదినం సందర్భంగా లక్నోలో ఒక మహిళా సమావేశం ఏర్పాటు అయింది. చివరికి ఈ మహిళా సమావేశానికి అధ్యక్షత వహించినది కూడా ఒక పురుషుడే.



ఆయన ఉత్తరప్రదేశ్ యువజన కాంగ్రెసు అధ్యక్షుడు సంతోష్‌సింగ్!...

## పి. టి. ఉషకు అత్యధిక స్థాయి భద్రతా ఏర్పాట్లు!

పరుగుల రాణి పి. టి. ఉష అనేక పరుగు పందాల్లో విజయం సాధించి సుస్థిర స్థానాన్ని సంపాదించుకుంది. ఇప్పుడు దేశంలో అందరి కన్నా ఎక్కువ భద్రతా ఏర్పాట్లు అవసరమైన క్రీడాకారిణిగా సురక్షిత స్థానాన్ని



సంపాదించుకుంటున్నట్టున్నది. ఈ మధ్యనే కలకత్తాలో జరిగిన దక్షిణ ఆసియా క్రీడలలో ఆమె చుట్టూ ఎప్పుడూ నలుగురు బ్లాక్ క్యాట్ కమాండోలు నిలబడి రక్షణ ఇచ్చారు. ఆమె 400 మీటర్ల హర్డిల్స్ పోటీలో, పరుగు ప్రారంభించేటప్పుడు కూడా ఆమె చుట్టూ రక్షణ ఏర్పాట్లున్నాయి. ఆ పోటీలో గెలుపొంది విజయ వేదిక మీదికి వెళ్ళేటప్పుడు కూడా రక్షణ ఏర్పాట్లున్నాయి. చివరికి ఆమె ఆటోగ్రాఫ్ కోసం ప్రయత్నించిన వందలాది మందిని నిరాశ పరుస్తూ భద్రతా సిబ్బంది ఆమెను "సురక్షితంగా" ఒక గదిలోకి పంపించారు!...

## రక్తనిధి కోసం వైజయంతీమాల నృత్యం

నటి – పార్లమెంటు సభ్యురాలు వైజయంతిమాల బాలి నృత్యాన్ని



దాదాపు వదిలేశారు. సర్వసాధారణంగా ఆమె గజ్జె కట్టడం లేదు. కాంగ్రెస్ శతజయంతి ఉత్సవాల వంటి ప్రత్యేక సందర్భంలో మాత్రమే ఆమె టెలివిజన్ తెరపై ఒక ప్రదర్శన ఇచ్చారు. ఇప్పుడు మళ్ళీ డాక్టర్ బాలి ఫార్మా ఫౌండేషన్ వారు నడిపే ఒక రక్తనిధి కోసం ఆమె ప్రదర్శన ఇచ్చారు. మద్రాసులో లాభాపేక్ష లేకుండా నడిచే ఈ రక్తనిధి సంస్థ ఇప్పటికి 500 మంది రోగులకు ఉచిత వైద్య సహాయాన్నందజేసింది. □



సీరియల్

# ఈతరం యువతి

## వడ్లమన్నాటి కుటుంబరావు

(గత సంచిక తరువాయి)

మధుసూదనంగారు, సుదర్శనం, రాజేంద్రలు.. గట్టి ప్రయత్నాలు చేయసాగారు. మృదుల మీద అపనింద వేసి వినోదం చూస్తున్న అపరాధి కోసం, కానీ వాడి జాడ ఇంత వరకూ ఏమీ తెలియలేదు.

మొదట్లో ఇంటిల్లపాదీ. ఏమనుకున్నారంటే.. ఎవడో ఒక పనికి మాలినవాడు ఏదో అవాకులు చవాకులు రాసినంత మాత్రాన మృదులకు సంబంధాలు రాకపోతాయా ఆమె వివాహం జరక్కపోతుందా? అని.

తమకున్న డబ్బు... పరపతి వగైరాలతో ఈ అపనిందని నిముషంలో తుడిచి వేయగలం దివ్యమైన సంబంధం తెచ్చి... మృదుల వివాహం రంగ రంగ వైభవంగా జరిపించగల మనుకున్నారు. కానీ... వారి ఆశలు అడియాసలయ్యాయి.

ఈ కరపత్రాలు వెలుగులోకి వచ్చిన తరవాత . సమ ఉజ్జీల దగ్గర నుంచి మృదులకు పెళ్ళి సంబంధాలే రావటం మానుకున్నాయి.

విషయం తెలియక ఒకటీ అరా వచ్చినా. . ఎవరు చెడగొడుతున్నారో ఏమో. "అమ్మో! ఆ అమ్మాయికి ఆడతనం లేదా? అయితే మా అబ్బాయి కెలా చేసుకుంటాం?" అంటూ తరవాత జాడ తెలియకుండా పారిపోతున్నారు.

అది చూసి నిర్విణ్ణులయి పోతున్నారు . మధుసూదనరావుగార్ను వారి కుటుంబ సభ్యులు

ఆ రోజు సాయంత్రం ఫోన్ కాలొకటి వచ్చింది ఆ వార్త విన్న మధుసూదనం గారు ఎలక్ట్రిక్ షాక్ తిన్నట్టయిపోయారు

మధుసూదనంగారికి ఆ అజ్ఞాత వ్యక్తికి ఫోనులో సంభాషణ ఇలా జరిగింది.

"హలో! మధుసూదనం హియర్! మీ రెవరు?"

"నేను మీకు తెలియదు కానీ మీ శ్రేయోభిలాషిని "

"అయితే ఏవంటారు?"

"ఏమీ అనను! మీరు మేలుకునే కళ్ళు మూసుకుంటారనుకుంటాను."

"వాట్ రాట్ యూ ఆర్ టాకింగ్?"

"డోంట్ ఇరిటేట్ మిస్టర్ మధుసూదనం! నేను మీ శ్రేయోభిలాషినని ముందే చెప్పాగా?'

"విషయం ఏమిటో త్వరగా తేల్చండి."

"తేల్చటం గురించి కాదు. . మునిగి పోయే నీ కొంప గురించి గంగలో కలిసి పోయే నీ పరువు గురించి ఇప్పటికే కొంత కలిసిందనుకో '

"వాట్జ్ ది మాటర్?" ఓర్పు పట్టలేక పోతున్నారు మధుసూదనంగారు.

"కరపత్రం వచ్చి జరపాల్సిన పని జరిపింది గదా!"

"దాన్ని గురించి నీకెలా తెలుసు?"

"కరపత్రం వేసిన వాళ్ళు దాన్నెందుకు ప్రింట్ చేయించారు మధుసూదనం గారు? మాబోటి వాళ్ళ కళ్ళ పడటానికేగా?"

"అసలు సంగతి చెప్పండి "

"ఇక నీ కూతురికి ఏ పెళ్ళి సంబంధమూ రాదు జన్మలో దానికి పెళ్ళికాదు" వికటంగా నవ్విన శబ్దం

"యూ బాస్టర్డ్! ఏం కూశావ్? నా ప్రాణంలో ప్రాణమయిన నా చిట్టి తల్లికి పెళ్ళి కాదా? నా లక్షల ఆస్థి మొత్తం అక్షరాలా ధారపోసి నా కూతురి పెళ్ళి చేస్తాను ఆకాశమంత పందిరి వేసి వైభవోపేతంగా ఏ పంది వెధవలు అడ్డమొస్తారో చూస్తాను నా కూతురి మీద ఇంత ఘోరమైన నింద వేసి, నన్నింత మానసికమైన టార్చర్‌కి గురి చేసిన సన్నాసులు దొరకాలే గానీ నిలువునా ఉరి తీసి ఉప్పు పాతరేస్తాను బల్ల మీద పిడికిలితో గుద్దారు మధుసూదనంగారు

"ఏయ్ మిస్టర్ మధుసూదనం! ఏమిటా చప్పుడు? ఫోను పెట్టిన బల్ల పగులకొడుతున్నావా? యూ! ఇన్నొసెంట్ జెంటిల్‌మన్. కాస్త వాస్తవానికి రండి సార్.. మీ అమ్మాయి ఆడతనం లేని బొమ్మ అనే విషయం .. కాశ్మీరు నుంచి కన్యాకుమారి దాకా ప్రచారం అయింది. నిజమో . అబద్ధమో. తెలియక పోయినా నిజమనే నమ్ముతారు పెళ్ళికొడుకు గొర్రెలూ, వారి తల్లిదండ్రులూ చూస్తూ. . చూస్తూ... ఏ పెళ్ళి కొడుకూ ఆడది కాదని చెప్పబడుతున్న నీ కూతురిని పెళ్ళి చేసుకోలేడు లైఫ్ రిస్కు తీసుకోలేడు. ఆఁ!. . అదలా ఉంచు. నీ కూతురు మాత్రమేం జాగ్రత్తగా ఉంది?"

"ఏమిటండీ? మీరనేది మా అమ్మాయి మృదుల?"

"ఆహా! సాక్షాత్తూ మీ అమ్మాయి మృదుల గురించే నేను చెప్పేది?"

"ఏం చేసింది?"

"ఆ లెక్చరర్ రవికాంత్ గాడు లేడూ వాడి దగ్గరకు కనీసం ఓ వందసార్లు వెళ్ళింది ?"

"ఎందుకు?"

'ఏమో నాకేం తెలుసు? మీ అమ్మాయినే అడుగు. బహుశ "

"ఏమిటో చెప్పు?"

"తనకు ఆడతనం లేదు గదా . పరాయి మగవాడి దగ్గరకు ఎన్నిసార్లు వెళ్ళి

---

జరిగిన కథ – 11 : చెల్లెళ్ళ పెళ్ళి జరిగే వరకు పెళ్ళి మాట తలపెట్ట, వద్దని రవికాంత్‌ను తండ్రి అభ్యర్థిస్తాడు రవికాంత్ ఆ త్యాగానికి ఇష్టపూర్వకంగానే సిద్ధపడతాడు పెద్ద చెల్లెలు పద్మినికి సంబంధం కుదురుతుంది మృదుల తానే రవికాంత్ ఇంటికి వస్తుంది. మృదుల, రవికాంత్‌లు తమ ప్రేమను వెల్లడించుకుంటారు. మృదులకు వచ్చిన సంబంధాలన్నీ చెడిపోతుంటాయి వసంతకు కూడా పెళ్ళి కుదురుతుంది. ఉత్తరంపై మృదుల కుటుంబంలో ఆందోళన కలుగుతుంది

వచ్చినా ఫరవా లేదనుకుందో ఏమో?"

"యూ బాస్టర్డ్! ఏం పేలావ్? మా అమ్మాయి ఘూసనమ్మ కాదు... కాదు... కాదు..."

"ఆ సంగతి నీకు తెలుసునయ్యా! లోకం దృష్టిలో... మీ అమ్మాయి అలా చిత్రీకరించబడింది గదా!.. అందుకే ఇప్పుడు నేను ఫోను చేసేది?"

"ఎందుకు?"

"ఇన్ని పార్లు వెళ్ళిన మీ అమ్మాయిని చూస్తూ... చూస్తూ... గుటకల్ని మింగటానికి.. చిటికెలు వెయ్యటానికి... ఆ లెక్చరర్‌గారు- వయసు మళ్ళిన వాడనుకుంటున్నావా?"

"యూ! యూ! స్టాప్ దట్ డర్టీ టాకింగ్" ఆవేశంతో గర్జించారు మధుసూదనంగారు ఫోనులో.

"మరీ అరవకండి సార్... బి. పి. పెరుగుతుంది. పాపం... నేను ఆపేస్తే మీకే నష్టం మీ అమ్మాయి మీద ఇంత విష ప్రచారం చేసిన వాడి విషయం మీకు తెలియకుండా పోతుంది?"

"వాడెవరో నీకు తెలుసా? ఓ. కే. చెప్పు, ఎవరు వాడు?"

"అమ్మ! ఆశ! మసాల దోశ... ఊరికే చెప్తుతానేమిటి?"

"ఏం కావాలి నీకు?"

"కావాలి?"

"ఏమిటి?"

"విటమిన్ ఎం. అంటే తెలుసుగా మనీ."

"ఎంత కావాలి?"

"ఏంతిస్తారు?"

"నస పెట్టకు. చెప్పు. క్విక్."

"ఫోనులో నే పంపించేట్టున్నారే చెక్?"

"ఓ. హో! కమాన్ టిల్ మీ ఐసే."

"ఎంతో వద్దులెండి సింపుల్‌గా...."

"ఊఁ!. చెప్పు."



# ఈ తరం యువతి

సర్ఫ్ పాంచ్ లాఖ్ రుపయా జస్ట్ ఫైవ్ లాక్ రుపీస్. అయిదు లక్షలు మాత్రమే.'

"యూ రోగ్ ! బ్లాక్ మెయిల్ చేస్తున్నావా?"

"ఛ చ నేను నీ వెల్ విషర్ని పోనీ బాధ పడకు .. నాలుగు లక్షలయితే నీ లగకుండా సర్దగలవా?

'ఏ నంబరు నుంచి మాట్లాడుతున్నావ్ నువ్వు?"

'నువ్వు చాలా తెలివిగలవాడవనుకున్నాను మధుసూదనం ప్చ్! పాపం కూతురు కారణంగా మతి గతి తప్పి ఉండొచ్చు... పోనీ . మూడు లక్షలతో నే ముడుచుకుంటాన్లే

".. "

"పోనీ రెండు లక్షలు

. . "

"అఖరి బేరం. ఒక లక్ష!'

. "

'అవసర బేరం రాయల్ సెల్యూట్. పది బాటిల్స్ . మసాలా చికెన్ మజాగా ఉండే రోజా లాంటి అరుగురు అడపిల్లలు "

' '

'లాస్ట్ అండ్ ఫైనల్ చాన్స్ "

" . .

"ఓ వంద రూపాయలు "

'

వింటున్నావా? మధుసూదనం!'

యూఫెలో! నీ సొంత కూతురి మీద నీతిమాలిన నింద వేసిన ఓ దుర్మార్గుడి కోసం ఆఫ్ట్రాల్ వంద రూపాయలు ఖర్చు పెట్టటానికి వెనకాడేనువ్వు డబ్బు ఖర్చు పెట్టి వాడ్ని పట్టుకుంటా వనుకోవటం వట్టి భ్రమ! అందుకే నీ మీద జాలి తలిచి చెప్పేస్తున్నా విను! వాడెవరో .?"

చెప్పు ప్లీజ్! నీ సహాయం మరువలేను " అందాక రిసీవరు చెవి దగ్గర పెట్టుకుని మౌనంగా అసహనంగా వింటున్న మధుసూదనంగారు ఆతృతగా గట్టిగా అరిచారు ఫోనులో నే

"చెపుతున్నా '

"ఊ .. ఎట్ వన్స్"

"చెప్పేస్తున్నా "

"చంపకయ్యా బాబూ! చెప్పు"




"నీ కూతురి మీద ఇంత జుగుప్సాకరమైన నిందని ప్రచారంలోకి తీసుకొచ్చిన వాడు అ(! ఉందు దగ్గొస్తోంది "

"అబ్బా..."

"వాడు.. వాడు .. అమ్మో తుమ్మొచ్చేస్తోంది హాచ్ స్కాచ్ "

"అబ్బబ్బ!"

"వాడు.. రవికాంత్"

"నో.. నో . నో. 'గట్టిగా అరిచారు మధుసూదనంగారు హి ఈజ్ ఎ గుడ్ గై" అన్నారు.

"ఎవరు చెప్పారు?"

"నా ఉద్దేశం అది అతను చాలా మంచివాడు "

"అయితే నీ ఖర్మ ఫోను పెట్టెయ్యనా?'

బాబ్బాబు పెట్టెయ్యకు వివరంగా చెప్పు"

"ఏమని?"

'వాడు .. మా అమ్మాయి స్కూటర్ యాక్సిడెంటు చేస్తే . ట్రీట్‌మెంట్ కోసం మా ఇంట్లో వారం రోజులున్నాడు వాడీ విధంగా ఎందుకు చెస్తాడు?

'అడ్డదీ వరస! తిన్న ఇంటి వాసాలు లెక్క పెట్టటం అంటారే అది తెలుసా మీకు? కానీ తెలుసువాడికి .

'అంటే ?"

పెట్టే తలని కొట్టేస్తే కోటలో ఎదురుండదుగా. అందుకని. .'

'అందుకని. '

"అ వారం రోజుల్లో మీ యింట్లోని విషయాలన్నీ వివరంగా తెలుసుకున్నాడు మీ అమ్మాయి మీద కన్నేశాడు కన్నెపిల్ల కదా! తన వన్నె చిన్నెల గురించి పొగిడితే పడిపోతుందని తెలుసు. అలా మచ్చిక చేసుకున్నాడు మీ అమ్మాయిని మరి పెళ్ళి చేసుకోవాలి కదా! మామూలుగా అయితే మీ గుమ్మం దగ్గర మెట్టు కూడా ఎక్కనీయరు కదా అందుకని నీచాతి నీచమైన ఈ దారుణానికి ఒడిగట్టాడు మీ ఇంట్లో జరిగిన ఓ పెద్ద ఫంక్షనుకి ఆహ్వానించిన అతిథుల లిస్టు మీ ఇంట్లో ఎలాగో తస్కరించి... తను అచ్చొత్తించిన పాంప్లెట్లన్నీ ... పోస్టు చేయించాడు మీ మిత్రులు. బంధువులు శ్రేయోభిలాషులకి

"దీనివల్ల అతనికేమిటి ఉపయోగం?"

ఊరికే అలా చెయ్యటానికి అతనేమన్నా పిచ్చివాడటండీ.. పిచ్చిదాన్ని చేసి హిప్నటైజ్ చేసి మీ అమ్మాయిని మీకు తెలియకుండా తన యింటికీ రప్పించుకుంటున్నాడు. ఈ నిందపడ్డ తరువాత మీ అమ్మాయికి పెళ్ళి కాదని తెలుసు ఈ వంకతో మీ అమ్మాయిని బుజ్జగించి ఓదార్చి లాలించి. పెళ్ళి చేసుకోవాలి. అదీ అతని ప్లాను అందుకనే చాలా రోజుల్నుంచీ మీ ఇంటికి రావటం లేదు గనించారా?"

"అవును" అప్రయత్నంగా అన్నారు మధు సూదనంగారు.

"ఇప్పుడయినా నమ్ముతారా నా మాట?"

"నిజమేనంటావా?"

"మధుసూదనంగారూ! మీరింత మరీ మంచి వారయితే ఎలాగండీ...అవతల మీ కూతురి జీవితం కొల్లేరయిపోతుంటేను. నమ్ముతారో . నమ్మరో మీ యిష్టం నేను మీ శ్రేయోభిలాషిని గనక . నా బాధ్యత నేను నిర్వర్తించాను... ఆపైన మీ ఖర్మ! ఫోను పెట్టేస్తున్నా "

అవతల వేపు ఫోను క్లిక్‌మన్న ధ్వని వినిపించింది

ఆతృతగా చుట్టూ చేరిన కుటుంబ సభ్యులను చూస్తూ . "ఆ బాస్టర్డ్ ఎంత పని చేశాడు?" అన్నారు మధుసూదనం గారు పళ్ళు పటపటలాడిస్తూ.

ఏమిటండీ? అనడిగిన రుక్మిణమ్మతో సహా అందరికీ విషయమంతా వివరించి చెప్పారు అ(! అంటూ నోళ్ళు తెరిచేశారంతా!

ఆ సమయంలో మృదుల పక్కింటికెళ్ళింది. ఆయన మనసు ... పగతో

సెగలు కక్కుతోంది

★ ★ ★ ★ ★ ★

అది కాలేజి కాంపౌండు.

క్లాసు రూములన్నీ చాలా బిజీగా ఉన్నాయి. తమ తమ సబ్జెక్ట్‌ల మీద లెక్చర్ ఇస్తున్న లెక్చరర్ల గొంతులు. కొన్ని వినసొంపుగాను. కొన్ని బొంగురుగాను కొన్ని నవ్వు పుట్టించేటటువంటి మాడ్యులేషన్స్‌తోనూ వినిపిస్తున్నాయి. లేడీ లెక్చరర్ల కంఠాలు మాత్రం ... శ్రావ్యంగా వినవస్తున్నాయి

బుద్ధిమంతులయిన ఆడ -మగ స్టూడెంట్‌లు శ్రద్ధగా వింటున్నారు లెక్చరర్లు చెపుతున్న పాఠాలు అది లోపించిన విద్యార్థులు మాత్రం .. తమ అధ్యాపకోపన్యాసకుల్ని . ఎన్ని గొంతులతో.. ఎన్ని తంతులతో ఏడిపించ వచ్చునో సన్నగా. చిన్నగా ప్రాక్టీసు చేసుకుంటున్నారు.

అది లెక్చరర్ల రెస్టు రూం! అప్పుడే తన క్లాసులో లెక్చరరు ముగించుకు వచ్చి విశ్రాంతిగా కుర్చీలో కూర్చున్నారు రవికాంత్.

"హాయ్" అంది కొలీగ్ హిమబిందు. ఆమెకు కూడా ఈ అవర్ ఖాళీనే ..

"హలో" అన్నాడు అనాసక్తంగా

అతని కుర్చీకి పక్కగా తన కుర్చీ జరుపుకుని కూర్చుంది

"పిక్చర్సేం చూశారు? హాండ్‌సమ్! అంది

ఆమె మామూలుగా అడిగితే 'ఎమెరాల్డ్ ఫారెస్ట్' చూశాను అని చెప్పి ఉండేవాడే హాండ్‌సమ్ అని ప్రత్యేకంగా విశేషణం తగిలించి అడిగేసరికి మండిపోయింది రవికాంత్‌కి.

"మండే గుండెలు" అని చెప్పాడు . ముఖం మీద కొట్టినట్టుగా -

దానికీ ఒక కారణం ఉంది హిమబిందు పేరు అందంగా ఉంది గానీ. . మనిషి మామూలుగానే ఉంటుంది. అయినా తననందరూ ఎంతో స్మార్ట్. అండ్ బ్యూటిఫుల్ అనుకోవాలని ఆమె తాపత్రయం అందుకోసం ఆమె రకరకాల కాస్మెటిక్స్ వాడి.. ఆమె ముఖం అందంగా కనిపించటానికి నానా తంటాలు పడుతూంటుంది అది ఆమెకు బాగుంటుందేమో గానీ చూపరులకు కాస్త ఇబ్బందిగానే ఉంటుంది. తనకి ఆర్ట్ ఆఫ్ టాకింగ్ బాగా ఉందని ఆమె నమ్మకం! అందుకని - కామాలు, సెమీ కోలన్లు, ఫుల్‌స్టాప్‌లు లేకుండా నాన్ స్టాప్‌గా మాట్లాడుతుంది. ఆమె వాయిస్ ఎంత స్వీట్‌గా ఉన్నా ఆమె ధోరణి మాత్రం హేట్ చేసేటంత విసుగొస్తుంటుంది ఇకపోతే ఆఖరి అంశం . పెద్ద సంసారం అవటం వల్ల. వాళ్ళ నాన్న పెళ్ళికొడుకులు ఆశించే కట్నం ఇచ్చుకోలేని స్థితిలో ఉండటం వల్ల... దురదృష్టవశాత్తు. ఆమె వయస్సు పెళ్ళి చేసుకునే లేత వయస్సుని చాలా దాటిపోయింది. అందుకని ఆమెకు పెళ్ళికాని మగ లెక్చరర్లంటే ప్రత్యేకాభిమానం! కానీ... ఈ అతి చనువు రవికాంత్‌కి నచ్చదు. అందుకనే ఆమె ఎదురు పడితే చాలు బెదరిపోతుంటాడు. కానీ హిమబిందు జాలిలేని జాబిలి! ఓ పట్టాన వదిలి పెట్టదతన్ని.

"అదేమిటండోయ్!" అంది కిసుక్కున నవ్వుతూ.

ఆ నవ్వు అసందర్భంగా అనిపించింది రవికాంత్‌కి.

ఏమిటన్నట్టుగా కళ్ళతో నే ప్రశ్నించాడు.

"ఆ సినిమా ఎప్పటిదో తెలుసా?"

"చెప్పండి".

మీరూ నేను ఒకటో క్లాసు చదివేటప్పటిది!"

అది అబద్ధం అని అతనికి తెలుసు. కానీ ఖండించటం అనవసర మనిపించింది

"అలా కాంటీనుకి రారాదూ? ... సమోసాలు తింటూ తమాషాగా కబుర్లు చెప్పుకోవచ్చుగా?" కళ్ళు చక్రాల్లా తిప్పింది.

సరిగ్గా ఆ సమయంలో నే లోనికి అడుగు పెట్టాడు టీ బోయ్ .. ఫ్లాస్కుతో.

"రెండు టీ ఇవ్వు" అన్నాడు రవికాంత్.

తక్షణమే ట్రేలో ని గాజు గ్లాసులు తీసి పోసిఇచ్చాడు వాడు.

## విజ్ఞానం - వినోదం

బాబ్ బ్రౌన్



### సమస్య

గరాటులో గిరగిర తిరిగే చలువరాయి గుండు

### అవసరం

గుండ్రని చలువరాయి గుండు, అట్టతో చేసిన పెద్ద గరాటు.

### ఇలా చెయ్యాలి

గరాటాకి పై భాగాన చలువ రాయి గుండుని దొర్లించండి. అది గిరగిర తిరుగుతూ క్రిందకి దిగుతుంది క్రిందకి వచ్చే కొద్దీ అత్యంత వేగంగా తిరుగుతూ దిగుతుంది.

### ఇలా ఎందుకని?

ఇది వేగ స్థితిస్థాపకతకు ఒక ఉదాహరణ. దూరం తక్కువయే కొద్దీ వే పెరుగుతుంది. గరాటులో గుండు క్రిందకి దిగేకొద్దీ దూరం తరుగుతుంది గన గుండు వేగం పెంచి తన స్థితి స్థాపకతని కాపాడుకుంటుంది.

"తీసుకోండి" అన్నాడు రవికాంత్.

"భలే వారండీ మీరు రవికాంత్! ,కాంటీనుకి ఎగగొట్టటానికన్న మాట' అంటూ తన పర్సులోంచి డబ్బులు తీసి రెంటికీ బిల్లు పే చేసింది

"అదేమిటి?' అన్నాడు రవికాంత్ ఆశ్చర్యపోతూ

'లేడీస్ ఫస్టు' అంటూ కిలకిలా నవ్వింది చిలకలా

ఏమీ మాట్లాడలేదు రవికాంత్ టీ తాగగానే హుషారు వచ్చినట్టుంది హిమబిందుకి ఎంబ్రాయిడరీ దగ్గర్నుంచి ఎంబాసిడర్స్ వరకూ రంభా హో! హో! డిస్కో డాన్సు పాట దగ్గర నుంచి జింబాబ్వేలో ని జాతీయ పతాకం వరకు పుంఖాను పుంఖాలుగా విశృంఖలంగా మాట్లాడటం మొదలు పెట్టింది. తనూ ఆమె తప్ప మరే లెక్చరరూ లేని ఆసమయంలో తన తల పగిలి పోతున్నట్లు. తన నరనరాలు పిగిలి పోతున్నట్లు ఫీలయ్యాడు రవికాంత్.

హే కృష్ణా! ముకుందా! నీకేమన్నా ఇది బాగుందా! నన్ను రక్షించు ఆపద్బాంధవా.. అని వేడుకొంది రవికాంత్ మనసు భగవంతుణ్ని.

హాయ్! భగవంతుడు కనికరించాడు.

అయితే డైరెక్టుగా కాదు

మరో వ్యక్తి ద్వారా.

అప్పుడే వచ్చి ... గుమ్మంలో నిల్చున్న వ్యక్తిని చూడగానే రవికాంత్ ముఖం వికసించింది

అతను రాజేంద్ర!

"హలో మిస్టర్ రాజేంద్ర వెల్‌కం అన్నాడు రవికాంత్. సంతోషంగా.

అయితే అతనికి కించిత్ ఆశ్చర్యంగా కూడా వుంది ఎప్పుడూ ఇక్కడకు రాని రాజేంద్ర ఇంత హఠాత్తుగా ఎందుకు వచ్చినట్టు?

అతనిలో తలెత్తిన అనుమానం స్ప్లిట్ సెకెండ్‌లో మాయమయింది.

దాందేముంది?

ఇన్నాళ్ళ నుంచీ తీరిక లేక రాకపోయి ఉండొచ్చు. ఇప్పుడు ఖాళీ దొరికి

# ఈ తరం యువతి

డుంచె చ్చు

రాజేంద్ర కూడా విష్ చేశాడు.

కానీ అతని ముఖం ప్రసన్నంగా లేదు.

అదోలా ఉంది.

"రవికాంత్‌గారూ! మీకిప్పుడు ఖాళీయేనా?" అన్నాడు రాజేంద్ర.

"ఓ"

"కాసేపలా బయటికి వెళ్ళొద్దాం రాగలరా?"

"ప్రిన్సిపాల్‌కి చెప్పి వచ్చెయ్యనా?"

"అంతసేపు అక్కరలేదు. ఇప్పుడే వచ్చేద్దాం మళ్ళీ" అన్నాడు రాజేంద్ర.

'నీ నుంచి విముక్తి లభించింది చూశావా' అన్నట్టుగా హిమబిందుకేసి చూసి "పదండి" అన్నాడు రాజేంద్రతో.

"థాంక్యూ రవికాంత్‌గారూ' అంటూ దారి తీశాడు రాజేంద్ర.

"జస్ట్ కాఫీ తీసుకుందాంరండి" ఆహ్వానించాడు రవికాంత్.

"నో థాంక్స్ చాలా అర్జంటు"

"సరే! ఎక్కడికి వెడదాం?"

"ఎక్కండి" అన్నాడు రాజేంద్ర కాలేజీ స్కూటర్ స్టాండు దగ్గర పార్కు చేసిన బుల్లెట్‌ని స్టార్ట్ చేసి.

వెనక ఎక్కి కూర్చున్నాడు రవికాంత్.

కాలేజీ కాంపస్ దాటి . ఐ టి ఐ బస్‌స్టాపు మీదుగా జోరుగా పోతోంది బుల్లెట్.

తనేదో మాటలు కలి పినా... సరిగ్గాజవాబివ్వలేదు రాజేంద్ర.

ఎదురుగా వచ్చే వాహనాల్ని తప్పించుకుంటూ స్పీడుగా డ్రయివ్ చేస్తున్నాడు బుల్లెట్

కంగారు పడిపోతున్నాడు రవికాంత్

కొన్ని క్షణాలు . మౌనం . భరించరాని మౌనం.

రవికాంత్ మనసు పరి పరి విధాల ఆలోచిస్తోంది

ఈ మధ్య కొద్ది రోజులుగా. మృదుల తన దగ్గరికి చాలాసార్లు వచ్చింది ఇంటికే కాకుండా కాలేజీకి కూడా వచ్చింది నాలుగయిదు సార్లు ఇద్దరూ కలిసి చాలా కబుర్లు చెప్పుకున్నారు. ఒకరి మనసు ఒకరికి బాగా అర్థమయ్యేట్టు మాట్లాడుకున్నారు ఇంటి కొచ్చినప్పుడు.. కొన్ని క్షణాల కాలం ఒంటరిగా దొరికినప్పుడు . ఆమెను తటాలున ముద్దు పెట్టుకుని వదిలెయ్యటం.. ఛటుక్కున కౌగిలించుకుని విడిచిపెట్టటం ఎన్నోసార్లు జరిగింది ఆమె ఎంతగానో సిగ్గుపడి కొంటిగా అంది.

"అబ్బాయిగారి అల్లరి... మరీ మితిమీరి శృతిమించుతోందే?! అవతల మీ పెళ్ళికాని చెల్లెళ్ళు చూశారంటే... మీరూ నేనూ అల్లరయి పోతాం కొంచెం కళ్ళెం వెయ్యండి . గుర్రానికి".

అప్పుడు తనే సిగ్గుపడి పోయాడామె ముందు.

"మనం చేసే పని తప్పేమో?" అనుమానంగా అన్నాడు.

"తప్పు కాదు" అంది మృదుల ధృఢంగా.

నిర్ఘాంతపోయాడు- తను.

"ఎందుకని తప్పుకాదు?" ఎదురు ప్రశ్న వేశాడు.

"ఇందుకని"అంటూ ఆమె ఏదో తన చెవిలో చెప్పింది.

మళ్ళీ ఆశ్చర్యపోవడం తన వంతయింది.

ఆమె చాలాసార్లు చెప్పింది. ఇలా తరచుగా నేను మీ ఇంటికి వస్తున్నట్టు... మిమ్మల్ని కలుసుకుంటున్నట్టు మా ఇంట్లో తెలియదు. ప్లీజ్! మీరు కూడా ఈ విషయం ఇలాగే రహస్యంగా ఉంచండి. దానివల్ల మనకెన్నో ఉపయోగాలున్నాయ్.

"ఓ. కే" అన్నట్టుగా తలూపాడు తను.

ఒకవేళ ఈ విషయం రాజేంద్ర పసిగట్టి తన మీద కసి తీర్చుకోవటానికి రాలేదు కద! ఎంతయినా వాళ్ళు ధనవంతులు? వాళ్ళ ముందు తనెంత?

"రవికాంత్‌గారూ?" రాజేంద్ర కంఠం కంగ్‌మంది... మౌనాన్ని ఛేదిస్తూ

"వాట్ మిస్టర్ రాజేంద్రా?" తన గొంతులో ని కంగారును కప్పి పుచ్చుకుంటూ అడిగాడు.

"నేను మిమ్మల్ని ఎక్కడికి తీసుకెడుతున్నానో తెలుసా?" రఫ్‌గా ఉందతని వాయిస్.

దుగా మీరు?"

"మీరెప్పుడో గొప్ప ఆపదలో ఉన్నారు. ఏమిటో ఊహించుకోండి?" స్కాస్టిక్‌గా నవ్వుతున్నాడు రాజేంద్ర. బుల్లెట్ పోతూనే ఉంది.

(ఇంకా ఉంది)

## గడుసులోకం

—బాబు



మహిళా పాఠకుల శీర్షిక

# ఈ కాలం పెళ్లిళ్లు

## ఆదర్శ వివాహాలు చేసుకోవాలి!

సృష్టిలోని జీవరాసులలో మంచి చెడులను గురించిన వివేచనాజ్ఞానం ఒక్క మానవునికి మాత్రమేవుంది. మానవుడు ఆటవికదశలో ఒంటరిగా బ్రతకలేక స్త్రీని తనకు తోడుగా చేసుకున్నాడు. కాలక్రమంలో స్త్రీ పురుషులు వివాహం చేసుకుని వివాహవ్యవస్థని సుస్థిరం చేసారు. భారత సంప్రదాయం ప్రకారం తల్లిదండ్రులే తమ పిల్లలకు పెళ్ళి చెయ్యడం ఆచారం అయింది. ఆడ పిల్లలకు తండ్రి ఆస్తిలో వాటా వుండదుకనుక వివాహ సమయంలో తమ శక్తికొద్దీ తమ కుమార్తెపైగల ప్రేమతో కానుకలు యిచ్చేవారు. అదే ఈనాడు బలవంతమై, తప్పనిసరియై, కట్నం అనే దురాచారంగా తయారైంది. ఆనాడు కానుకలు ఇవ్వడం, ఇవ్వకపోవడం అనేది పూర్తిగా తల్లిదండ్రుల ఇష్టంపై ఆదారపడివుండేది. కాని ఈనాడు ఇష్టమున్నా లేకపోయినా కట్నం ఇవ్వక తప్పడం లేదు. ఈ కట్న దురాచారం ఎందరో స్త్రీల జీవితాల్ని ఆహుతిచేస్తూ మరెందరినో అవివాహితలుగానే మిగిలిపోయేలా చేస్తుంది. కన్న తల్లిదండ్రుల్ని నిరాశా నిస్పృహలకు లోను చేస్తుంది.

ప్రతికాలంలోను ఏదో ఒక దురాచారం స్త్రీకి అన్యాయం చేస్తూనే వుంది. కన్యాశుల్కం, బాల్యవివాహాలు. సతీ సహగమనం. నేడు వరకట్నం. ఇలా అన్నికాలలోను ఏదో ఒక దురాచారానికి స్త్రీ బలిపశువు అవుతుంది. స్త్రీ కోరినంత కట్నంతో అత్తవారింటికి వచ్చినా అడుగడుగునా పురుషుని ఆధిక్యతను అంగీకరించక, భరించక తప్పడంలేదు. ఇంత దురదృష్టకరమైన పరిస్థితి ఒక్క స్త్రీకి తప్ప సృష్టిలోని ఏ జీవికి లేదు.

వివాహం అనేది చాలా పవిత్రమైంది. రెండు మనసుల సంగమమైన వివాహాన్ని కట్న కానుకలతో ముడిపెట్టకూడదు. అది వారిమధ్య అన్యోన్యతను ప్రేమాభిమానాలను దెబ్బతీస్తుంది. ఈ కట్న సమస్య వలన మేధావిని అయిన స్త్రీ కూడా ఉన్నత విద్యను అభ్యసించడానికి నోచుకోలేకపోతుంది. తల్లిదండ్రులు కట్నకానుకలను దృష్టిలో వుంచుకుని ఆడపిల్లలను చదివించడానికి వెనకంజ వేస్తున్నారు. ఫలితంగా దేశం ఎందరో మేధావినులైన స్త్రీల సేవలను కోల్పోతుంది. వారిశక్తి అంతా వంటింటికి, పిల్లల్ని పెంచడానికి మాత్రమే వుపయోగపడుతూంది. ఒక దేశ అభివృద్ధి, భవిష్యత్తు ఆ దేశ ప్రజల సమిష్టి కృషిపై ఆధారపడివుంటుంది. దేశ జనాభాలో సగభాగం వున్న స్త్రీల శక్తి, నేర్పు వృధా యగుచున్నాయి. తద్వారా దేశ ప్రగతి కుంటుపడుతుంది.

ఆడపిల్లకు కట్నం యివ్వడం, మగపిల్లవానికి కట్నం తీసుకోవడం అనేవి చాలా సహజమైన విషయాలుగా మన మనస్సులో నాటుకుపోయివున్నాయి. అభ్యుదయభావాలతో కట్నాన్ని నిరసించడం చాలా అసహజంగా కన్పడి అలాటివారు సంఘ నిరసనకు గురియగుచున్నారు. అభ్యుదయభావాలున్న స్త్రీ లెందరో ఈ పురుషాదిక్యతా భావాలున్న సమాజంతో రాజీపడలేక అవివాహితలుగా మిగిలిపోతున్నారు.



కట్న సమస్య విషయంలో పురుషుణ్ణే నిందిచడానికి వీలులేదు. తల్లి బిడ్డల పెంపకంలోనే ఆడ, మగ పిల్లలయెడ సమదృష్టి చూపడం లేదు. మగవాడు ఎక్కువ అన్న భావాన్ని జీర్ణించుకుపోయేలా పెంచి పురుషునిలో సుపీరియారిటీ పెంచుకోవడానికి ప్రత్యక్షంగా కారణభూతురాలవుతుంది స్త్రీ. అలా పెంచడానికి కారణం సృష్టిలో స్త్రీ, పురుషుడు సమానులే అన్న అవగాహన ఆమెకు లోపించడమే. సంఘ సంస్కరణ, భావ చైతన్యం కల్గడానికి సాహిత్యం ఎంతో తోడ్పడుతుంది. రచనా వ్యాసాంగంలో వున్న స్త్రీలు కూడా ఎక్కువమంది స్త్రీ సమస్యయైన ఈ కట్నం వైపు దృష్టి మరల్చడంలేదు.

కట్న దురాచారం పరిష్కరించబడాలంటే ఈ సమస్యయెడ సమగ్రమైన దృష్టి, అవగాహన స్త్రీలోను పురుషుని లోను ఏర్పడాలి. వారిలో మానసిక చైతన్యం రావాలి. కట్నం యిచ్చి పెళ్ళిచేసుకోవడం తనను తాను అవమానించుకోవడమే అని స్త్రీ భావించాలి. కట్నం తీసుకుని తనను తాను అమ్ముకునే స్థితికి పురుషుని ఆలోచనలు దిగజారకూడదు. యువత స్వశక్తిపై నమ్మకాన్ని పెంచుకోవాలి. సమాజ దురాచారాలైన కుల,కట్న సమస్యలకు భరతవాక్యం పలకాలి.

తల్లి దండ్రులు ఆడపిల్ల పుట్టింది మొదలు పెళ్ళిగురించి ఆలోచించక ఆమె భవిష్యత్తుకు తోడ్పడే విధంగా విధ్యావంతురాల్ని చెయ్యాలి. అసమానతా భావాలకు, సంకుచిత స్వభావాలకు తావివ్వని రీతిగా పెంచాలి.

పవిత్రమైన వివాహవ్యవస్థను కట్న కానుకలతో ముడిపెట్టి కలుషితం చేయ్యకుండా యువతీ యువకులు మేల్కొని ఆదర్శంగా వివాహాలు చేసుకోవడానికి ముందుకువచ్చినపుడే కట్న సమస్య రూపుమాపబడుతుంది.

– కె. సీతాలక్ష్మి, కావలి.




కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**ఈ కాలం పెళ్లిళ్లు**

పంపిన వారి పేరు ....................................................

పూర్తి చిరునామా ....................................................

....................................................

....................................................

పిన్ కోడ్: ....................

# మన సంస్కారాలు ఓం విశేషాలు

ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి

(గతసంచిక తరువాయి)

## ప్రస్తుత విషమ సమస్య – పరిష్కార మార్గం

పరమార్థ పరిస్థితి ఇట్లుండగా ఆర్థిక సంబంధమైన ఆశాపాశాలలో చిక్కుకొన్న కొందరు నేడు, తమ గృహ లక్ష్ములను "పుట్టినింటికి వెళ్ళి సొమ్ము తీసికొని రమ్మని" వేధించి పీడించి బాధించడమనేది, ఆ స్త్రీల విషయంలో పురుషుడు చేస్తున్న– ప్రాయశ్చిత్తం లేని "మహా పరాధం" అనక తప్పదు. ఈ "అధిక వరకట్న పిశాచి "పవిత్ర సంస్కార ప్రభావాన్ని కాలదన్ని ప్రస్తుత సమాజానికి విషమకర నివత్కార విషతుల్య సమస్యగా పరిణమించింది. సమాజాన్ని పీల్చి పిప్పి చేస్తూ కొన్ని కుటుంబాలనే బలిగొంటూంది. అసలు ఇట్టి సమస్యలు సమాజంలో వ్యాపించడానికి బలమైన కారణాలు ఉండనే ఉంటాయి. వానిలో ముఖ్యంగా ముందుగా ముందుగా కనిపించేది, ఎక్కువ సంఖ్యలో మానవుల "నైతిక జీవిత పతనం" అనేది.

## స్త్రీ విత్తమధమాధమం

లోకంలో "పురుషకారం" కలవాడే "పురుషుడు" అనిపించుకొంటాడు. 'పురుషకారం' అనగా ఏ విధంగానూ తను ఇతరుల మీద ఆధారపడక, తన సుఖమయ జీవిత నిర్వహణకు అవసరమైన ఆర్థిక పుష్టిని స్వశక్తితో న్యాయంగా సంపాదించి, తనతో బాటు తన పరివారాన్ని కూడా పోషించగల పురుషుని సామర్థ్య విశేషాన్ని "పురుషకారం" అంటారు. ఈ విధంగా తన స్వంత శక్తితో, న్యాయ మార్గాన్ని విడవకుండా సంపాదించిన ధనమే "ఉత్తమ ధనం" అని అంటారు. ఈ సందర్భంలో ఒక సూక్తి మనకిలా మహిత ప్రబోధాన్ని ప్రసాదిస్తూంది.

"ఉత్తమం స్వార్జితం విత్తం, మధ్యమం పితురార్జితం

అధమం భ్రాతృ విత్తంచ, స్త్రీ విత్తమధమాధమం"

పురుషుడు స్వశక్తి సామర్థ్యాలతో న్యాయంగా సంపాదించిన ధనంతో జీవించడం ఉత్తమమైనది. తండ్రి సంపాదించిన ధనంతో జీవించడం మధ్య తరగతికి చెందినది. సోదరుల ధనం అధమం. స్త్రీ సంపాదించిన ధనంతో జీవించడమనేది అధమాధమమైనది.

ఉదారోత్తమ భావాలు కలవారు ఉత్తమ పద్ధతిలో జీవించ దలచినప్పుడే, నీచ భావాలు కలవాడు, నీచంగానే జీవించడానికి ప్రయత్నిస్తూంటాడు. ఇది లోక సహజం. కాని సమాజ దృష్ట్యా చూసినపుడు, ఆ సమాజంలో ఉన్న స్త్రీ పురుషుల ఉత్తమాధమ లక్ష్యాల మీదనే సమాజం యొక్క కీర్తి ప్రతిష్ఠలు కాని, అపకీర్తులుకాని, ఆధారపడి ఉంటాయి. నేటి మానవ సమాజంలో యెక్కువ మంది, అధిక వరకట్న దాహానికి వశులై ఉన్న పరిస్థితిలో సామాజిక జీవితం కూడా అనర్థ పరంపరలో చిక్కుకొనక తప్పదు. కనుక సమాజం శాంతి కీర్తి ప్రతిష్ఠలతో మనగలగాలంటే సమాజంలో గల యెక్కువమంది నైతిక సూత్రాలను పాటిస్తూ ఉత్తమ భావాలతో ఉత్తమాదర్శాలతో జీవించడమనేది ఎంతో అవసరమై ఉంది. ఇట్టి పరిస్థితిలో, నాగరికత అనే పేరుతో నేడు చాలా మంది "అధిక వరకట్న" మనే సాంఘిక దురాచారానికి దాసులై ఉండడంచేత, ఆ దురాచార ఫలితంగా దాపరించిన ఆపదలకు వేలాది కుటుంబాలు గురి కాక తప్పడం లేదు. నేటి పత్రికలు తెరవగానే వరకట్న మూలకాలైన స్త్రీల చావు వార్తలు పఠితల హృదయాలను ఉవ్వెత్తుగా కలిచేస్తున్నాయి. హానికరమైన ఇట్టి ఆపదలోంచి సమాజం బైట పడాలంటే ఒకటే మార్గం శరణ్యంగా ఉంది.

మన వివాహ ధర్మాలను అమలులో పెట్టడమనేదే ఆ మార్గం. ఆ మార్గాన్ని అనుసరించిననాడు, "వరకట్నాలు" అడగడానికే అవకాశం ఉండదు. ఎలాగంటే– వరుడు కన్యాదాత వద్దకు తన ముఖ్య స్నేహితులను కన్యావరణకై పంపుతూ వారి ముఖతః తన వివాహ లక్ష్యాన్ని–

"ధర్మ ప్రజా సంపత్యర్థం స్త్రియ ముద్వహే"

"గృహస్థాశ్రమ ధర్మాలను సక్రమంగా నిర్వహించడం ద్వారా సత్సంతానమును పొందడం కోసమే, ఈ పవిత్ర ధ్యేయం కోసం ప్రస్తుతం నేను (వరుడు) ఈ స్త్రీని సంస్కార పూర్వకంగా స్వీకరింప దలచినాను." అని శపథం చేస్తాడు. ఈ వివాహ ధర్మాన్ని పూర్తిగా అనుసరించి ఆచరించిననాడు వరుడు ధర్మాచరణానికి మూలాధారమైన కన్యను మాత్రమే కోరినాడు కాని 'వరకట్న' విషయాన్ని అసలు ఎత్తనేనాలేదు.

అప్పటి వరుని దృష్టి "ధర్మా చరణమే" జీవిత లక్ష్యంగా కలది. కనుక అప్పటి వరునికి ధర్మాచరణకు మూలమైన "కన్యక"యే పది లక్షల విలువ కలది కాని డబ్బు మాత్రం కాదు. కనుక వరుడు కాని వర వర్గం వారు కాని, ఆ కాలంలో వరకట్న ప్రస్తావన చేసే అవకాశమే లేదు అసలు ఆ ప్రస్తావన చేయడం అప్పటి వారికి "తప్పు"గా ఉండేది కూడాను. ఆ విధంగా అప్పుడు "అధిక వరకట్న నిర్ణయం" అనే విషయం సంబంధం లేని కారణం చేత ధర్మ ప్రధానమైన ఆనాటి వధూవరుల వైవాహిక జీవితం" నిత్యానంద నిలయం"గాను, శాంతి సౌఖ్యాలకు పుట్టినిల్లుగాను ఉండి, వారి దైనందిన జీవితం మూడు పువ్వులు ఆరు కాయలుగా అభివృద్ధి చెందుతూ, దేవ పితృ ఋణాలను తీర్చడం ద్వారా మోక్ష ప్రాప్తికి పాత్రంగా ఉండేది. ఇక నేటి వివాహం విషమకర సమస్యలకు నిలయంగా తయారయింది.



ఈ తేడాకు ముఖ్య కారణం, నాటి కన్యావరణలో వరకట్న ప్రస్తావనే లేకుండడం, నేటి వివాహ ప్రస్తావం" అధిక వరకట్న ప్రస్తావంతోనే ప్రారంభం కావడం అనేదే ఆ తేడాకు మూల కారణమనక తప్పదు.

కన్యాదాత, కన్యాదానం వలన కలిగే ఫలితాన్ని గూర్చి ఓ కన్యామణీ! ఈ కన్యాదానం వలన, నా వంశంలోని పది తరాల ముందు వెనుకల పితృ దేవతలు నరకం లేనివారై శాశ్వతంగా బ్రహ్మ లోకంలో ఉండడం కోసమనీ, నాకు మోక్ష ప్రాప్తి కోసమనీ ఈ కన్యాదానమనే పవిత్ర క్రియను చేస్తున్నాను, అనే దివ్య సంకల్పంతో ఉండేవాడు.

"...దశ పూర్వేషాం దశా పరేషాం మధ్యం శ్యానాం సర్వేషాం పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వత బ్రహ్మ లోకే నివాస సిధ్యర్థం..." కన్యేమే సర్వతో భూయాస్త్వద్ధానాన్మోక్ష మాప్నుయాం..." కనాఢ్యం సుశీలాయ సుధీయతే ప్రయతో హం ప్రయచ్ఛామి ధర్మ కామార్థ సిద్ధయే..."

ఇట్టి కన్యాదానం వలన నాడు కన్యాదాతకు కలిగే మహిత ప్రయోజనాలు అనగా ఆతడి "పితరులకు బ్రహ్మ లోక ప్రాప్తి, కన్యాదాతకు చతుర్విధ పురుషార్థ సిద్ధి" అనేవి రెండూ, నేటి వర కట్నాల దురాచారం వలన దూషితాలై అంతరించాయి. ఎట్లనగా, కన్యాదాత నూతన వరుణ్ని" శ్రీ లక్ష్మీ నారాయణునిగా భావించి పూజించి అతడికి కన్యాదానం చేసిన పక్షంలోనే పైది రెండు ప్రయోజనాలు కన్యాదాతకు ప్రాప్తిస్తాయి. నేటి విపరీత వరకట్నాలతో కన్యాదాతకు తల తిరిగి ఆ పరమేశ్వర భావన లుప్తమై కన్యాదాన మూలకమైన అప్పులు గృహ భూముల అమ్మకాల వంటి అనర్థ పరం పరే నేడు మిగులు తూంది. ఇట్టి దుర్భర పరిస్థితిలో, కన్యాదానం వలన ఆ దాతకు కలగవలసిన ఆ మహా ప్రయోజనాలు నేడు ఎలా ప్రాప్తిస్తాయి? ఇంకా ఈ దురాచారం వలన ఉత్తమ వరునికి ముఖ్య లక్షణమైన "ఉత్తమ శీలత్వం" పూర్తిగా అంతరించింది. నేడు ఎక్కువ మందిలో కలిగిన ఈ "శీలపతనం"తో బాటు సమాజానికి కూడా పతనం ప్రారంభమయింది. సమాజం పతనం అంటే దేశ పతనమనే అర్థం అని.

"దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే మనుషులోయ్" అనే గురజాడ వారి గుప్త సూక్తి సుస్పష్టం చేస్తూంది. ఇంతటి అనర్థ పరం పరకు అది కారణమైన- "అధిక వరకట్నం" అనే సాంఘిక దురాచారాన్ని రూపు మాపి పునః ప్రతిష్ఠ చేయడం అనే మహా కార్య సాధన నేటి భారతీయ యువకులకు ముఖ్య కర్తవ్యమై అది వారి మీద ఆధారపడి ఉంది.

## భారత దేశీయ పూర్వ ప్రతిష్ఠ

భారత దేశంలో కూడా, "ఆర్యావర్త" దేశమనీ "బ్రహ్మర్షి దేశమనీ రెండు ముఖ్య ప్రదేశాలున్నాయి.




కురుక్షేత్రం, మత్స్య దేశం, పాంచాలము, శూర సేనకం అనే దేశాలు కలిసిన దేశానికి "బ్రహ్మర్షి దేశం" అని పేరు.

"కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పాంచాలాశ్శూర సేనకాః

ఏష బ్రహ్మర్షి దేశో వై బ్రహ్మావర్తాదనంతరః!"

(మను- 2 అధ్యా- 19 శ్లో).

"ఈ బ్రహ్మర్షి దేశంలో పుట్టి పెరిగిన అగ్ర జాతి వారి వలన, భూ మండలం మొత్తంలో గల మానవులందరు తమ తమ ఆచారాలను ధర్మాలను తెలుసుకొనవలెను" అని ఈ క్రింది మనుస్మృతి సూక్తి ఇలా నొక్కి వక్కాణిస్తూంది.

"ఏ తద్దేశ ప్రసూత స్యసకాశాదగ్ర జన్మనః

స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథి వ్యాం సర్వమానవాః" (2-20) ఈ సూక్తిని బట్టి-

"భారత దేశం ఇతర దేశముల వారందరికీ ఆచార్య పీఠంగా ఉండేది" అనే విశిష్ట విషయం విశదమౌతూంది.

మన మహిత పవిత్ర సంస్కృతి జగన్మాంగళ్య సంపాదనమునకు మంగళ తోరణంగా ప్రకాశిస్తూ, అన్ని మతాల వారికి అఖిలాభ్యుదయములను అన్ని కాలాలలో అమర జేస్తున్న సంగతి స్పష్టమయింది.

ఇట్టి పవిత్ర భారత దేశంలో పుట్టి పెరిగిన మానవుల ప్రవర్తనలలో అన్ని విధాలా అన్ని విషయాల్లో "భారతీయత" ప్రత్యేక శిరోభూషణంగా భాసించిననాడే అట్టివారే నిజమైన "భారతీయులు" అనిపించుకొంటారు. కనుక భారత దేశీయులకు "భారతీయత ప్రాణం" వంటిదని ప్రకటిత మౌతుంది. ఇట్టి సన్నివేశంలో భారత దేశంలో పుట్టి పెరిగిన వానికి "భారతీయత" లేదంటే ఏమనాలి? కనుక ప్రియ భారత సోదర సోదరీమణులారా! మీ మీ ధర్మాలను ప్రాణప్రియంగా కాపాడుకొంటూ, మీ మీ కర్తవ్యాలను సకాలంలో నెరవేర్చుకుంటూ ఆ విధంగా మీ మీ జన్మలను సార్థకం చేసుకొందురు గాక.

**(అయిపోయింది)**

## పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీన గాథలు

## తప్పుదోవ పట్టిన బాలలని చక్కదిద్దే పరిశీలనా గృహం

ఇటీవల రాజమండ్రి లయన్స్ క్లబ్, లయన్ లేడీస్ క్లబ్‌ల తరఫున ప్రభుత్వ బాలుర పరిశీలనా గృహానికి వెళ్ళి అక్కడి బాలురకు అవసరమైన విద్యా, వైజ్ఞానిక, క్రీడా పరికరాలను అందజేసి, పరిశీలనా గృహం సూపరింటెండెంట్ శ్రీ ఎ. వి. నాగేశ్వర రావు గారితో మాట్లాడినప్పుడు చిన్నారి బాలల దీన గాధలు సమసి పోవడానికి, వారిలో విజ్ఞాన వికాసాల జ్యోతి వెలిగించ డానికి పరిశీలనా గృహం చేస్తున్న కృషి తెలిసింది.

అంతకు ముందు "ప్రభుత్వ రిసెప్షన్ హోమ్" పేరు మీద ఉన్న ఈ పరిశీలనా గృహం 1987 గాంధీ జయంతి నుంచి అమలులోకి వచ్చిన "ది జువెనైల్ జస్టిస్ యాక్ట్" ప్రకారం కొత్త పేరును సంతరించు కుంది. 16 సంవత్సరాల లోపు బాల నేరస్థులను న్యాయస్థానాల ఉత్తర్వుల మేరకు స్వీకరించే ఈ గృహం పరిధి తూర్పు గోదావరి, విశాఖపట్నం, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలకు విస్తరించి ఉంది. ఈ గృహాన్ని రాష్ట్ర ప్రభుత్వ జైళ్ళ శాఖ నిర్వహిస్తుంది.



రాజమండ్రిలోని ప్రభుత్వ పరిశీలనా గృహం సూపరింటెండెంట్ శ్రీ ఎ. వి. నాగేశ్వరరావు రచయిత్రి శ్రీమతి కొల్లేపల్లి రత్నకి హోమ్‌ని గురించిన వివరాలని తెలియ చేస్తున్న దృశ్యం.

గతంలో ఈ గృహంలో నేరస్థులను మాత్రమే చేర్చుకునే వారు గాని, ప్రస్తుత చట్టం ప్రకారం ఇంటి నుంచి పారి పోయిన వారిని, తప్పి పోయిన వారిని, ఆర్థిక పరిస్థితి సరిగాలేక, సవతి తండ్రి, సవతి తల్లులతో బాధలు అనుభవించి ఇంటి నుంచి వచ్చిన వారిని పోలీసు వారు తీసుకొచ్చి ఈ గృహంలో చేరుస్తారు.

ఈ గృహంలోనే ప్రతి మంగళ వారం నాడు ఏర్పాటయ్యే బాలుర న్యాయస్థానంలో విచారణ జరిగి ఈ బాలుర భవిష్యత్తు నిర్ణయ మవుతుంది. విచారణ తర్వాత వారిని విశాఖ పట్నంలోని జువెనైల్ హోంకు పంపుతారు. నేరం చేసిన వారినైతే హైదరాబాద్ లోని స్పెషల్ హోంకు పంపుతారు.

జిల్లా ప్రొబేషన్ అధికారి ఇచ్చిన వివరాల ప్రకారం బాలుర విచారణను పూర్తి చేసి వారిని తల్లిదండ్రులకు అప్పగిస్తారు. తల్లి దండ్రులు సక్రమంగా చూడలేని పరిస్థితులలో జువెనైల్ హోంకు అప్పగిస్తారు.

ఈ గృహాలలో బాలురను ఊరికే కూర్చోనివ్వకుండా విద్యలోను, వృత్తి విద్యలోను శిక్షణ ఇస్తారు. నైతిక సత్ప్రవర్తనను నేర్పుతారు. క్రీడలలో, లోకజ్ఞానములో ప్రవేశం కల్పిస్తారు. ఐతే రాజమండ్రి హోంలో మాత్రం భవన వసతి సరిగా లేకపోవడం వల్ల క్రీడాస్థలం లేక ఇన్‌డోర్ గేమ్స్‌కు మాత్రమే వీలవు తున్నది. లయన్స్ క్లబ్, జేసీస్ క్లబ్ వారి సహకారంతో ఈ సదుపాయం ఏర్పడింది. అట్లాగే రోటరీ క్లబ్ సహాయంతో పిల్లలతో కాగితపు సంచులు తయారు చేయించి బైటి మార్కెట్లోకి పంపు తున్నారు.

బాలురను కోర్టు వారు రిమాండ్‌కు పంపగానే హోంలో చేర్చుకుని, శుభ్రంగా స్నానం చేయించి, ప్రభుత్వ దుస్తులు ధరింప జేస్తారు. హోంలో కార్యక్రమం నియమ బద్ధంగా ఉంటుంది. ఉదయం 5.30కి ప్రార్థన. 6.00కి కాలకృత్యాలు. 7.00 రాగిజావ, మధ్యాహ్నం 12 గం.కు, సాయంత్రం భోజనం. ప్రభుత్వం నిర్ణయించిన కొలతల ప్రకారం భోజనం, వారానికి ఒక రోజు మాంసాహారం ఇస్తారు. రాజమండ్రి హోంలో మొత్తం 39 మంది బాలురున్నారు. ప్రభుత్వ డాక్టర్ వచ్చి రోజూ వారిని పరీక్షిస్తారు.

ఇటువంటి హోంలు హైదరాబాద్, వరంగల్, విజయవాడ, తిరుపతి, కర్నూలులలో కూడా ఉన్నాయి. తమ పిల్లల్ని అదుపులో పెట్టుకోలేని తల్లిదండ్రులు స్వయంగా హోంకు అప్పగించిన సందర్భాలు కూడా ఉన్నాయి. తెలిసీ తెలియని వయసులో పిల్లలు తప్పు దోవన నడిస్తే వారిని చేరదీసి, చక్కదిద్ది రేపటి పౌరులుగా, వారి భవిష్యత్తుకు మంచి బాట వేసే ఉద్దేశ్యంతో నెలకొల్ప బడిన ఈ గృహాలు వాటి కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించి ఉత్తమ పౌరుల్ని తయారు చేయాలని ఆశిద్దాం.

– లయన్ లేడి అండ్ జెసీరెట్
కొల్లేపల్లి రత్న,
రాజమండ్రి. ☐

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు : ....................................

పూర్తి చిరునామా : ....................................

....................................

....................................

పిన్ కోడ్ :

# కొత్త రలక్

34564

## మీ కుటుంబానికి ప్రత్యేక సబ్బు

తులసి సద్గుణాలు గలది.




[illegible]
[illegible]
[illegible]
ప్రత్యేక సబ్బు. [illegible]
తులసి సద్గుణాలున్నాయి. [illegible]
చర్మం శుభ్రంగా [illegible]
రూపొందుతుంది. దీని తాజాతాజా
సువాసనలతో వారికి సదా తాజాదనపు
అనుభూతి కలుగుతుంది. హాయిగా
ఆహ్లాదంగా ఉంటుంది.



## ఆనందారోగ్యాల కుటుంబం, రలక్ కుటుంబం.

everest 87 WIL 511-tl R

# స్వయంకృతం

లంకా సూర్యకాంతం

"సావిత్రీ, సావిత్రీ, ఓ సావిత్రీ గొంతు చించుకుని అరుస్తున్నాడు ముకుందరావు

"ఆఁ! ఆఁ! వస్తున్నాను అబ్బబ్బ! చచ్చిపోతున్నాను ఒక్క క్షణం ఊరుకోరు కదా ఈయనకి ముసలితనం వచ్చిన దగ్గర్నుండీ పిచ్చి ఎక్కువవుతూంది ఒక్క క్షణం ఊపిరి పీల్చుకోనివ్వరు కదా అంటూ అర్చినందువల్ల వచ్చిందో, వయస్సు మీరడం వల్ల, కంగారుగా వచ్చినందువల్ల వచ్చిందో తెలియని ఒగర్పుతో వచ్చింది సావిత్రమ్మ

"కొంచెం మంచి నీళ్ళియ్యవే! నోరెండుకపోతోంది అన్నాడు ముకుందరావు

"ఊఁ! తాగండి " అంటూ పట్టించింది సావిత్రమ్మ గ్లాసు కింద పెట్టి వెనుదిరగబోయిందామె

'సావిత్రీ!'

"ఊఁ !

కాస్సేపు ఇక్కడ కూర్చోరాదూ ఒక్కణ్ణీ ఉండలేక చచ్చిపోతున్నాను ఈ ఒంటరితనం నన్ను బతకనీయడం లేదు ఈ రోగం నన్ను చావనియ్యడం లేదు

ఇందులో అర్థం చేసుకోడాని కేముందండీ నేను కూర్చున్నా ఎంతసేపు కూర్చోగలను చూసే వాళ్ళకి బావుండదు కదా అవతల మనవలూ, కొడుకూ, కోడలూ తిరుగుతూంటే నేనిక్కడ కూర్చుంటే ఏం బాగుంటుంది చెప్పండి ముదికాలానికి ముచ్చట్లు తక్కువయ్యేయా అనుకుంటారు మొదట్నించీ అలా కూర్చోడం మనకు అలవాటుందా ఏమన్నానా అన్నది సావిత్రి

ఏదో అనుకోడానికి ఇందులో ఏముంది సావిత్రీ అంతా మనవాళ్ళేగా అన్నాడు ముకుందం

మనవాళ్ళు అయితే మాత్రం ఉండదా! అన్నీ తెలిసిన అత్తగారూ, మామగారూ ఉండగానే ఎప్పుడూ ఎదురుపడి మాట్లాడుకోలేదు మనకంటే చిన్నవాళ్ళ ముందెలా ఉండగలం ఏదన్నా అవసరమయితే పిలవండి వస్తాను మీ కంటే ఎక్కువెవరు నాకు నిజానికి అంటూ వెళ్ళిపోయిందామె

* * * * * * *

రాముూ పుస్తకాలు తీసుకుందికి అక్కడికి వచ్చాడు 'అమ్మో! వీడు వెళ్ళిపోతాడేమో! ఒరేయ్ రామూ! రామూ!

ఏమిటి తాతయ్యా! ఎందుకు పిలిచావు నేను హోంవర్కు చేసుకోవాలి



ఇలా రామ్మా! ఓ మాట '

ఊఁ! ఏవిటి తాతయ్యా! చెప్పు "

"ఏం పాఠాలు చెప్పార్రా, మీ స్కూల్లో ఈ రోజు "

మా స్కూల్లో ఏం చెప్పారో చెప్తే నీకేం తెలుస్తుంది తాతయ్యా. నువ్వు చదివినప్పటివీ, ఇప్పటివీ పుస్తకాలు మారిపోతాయి కదా!"

"అవున్లేరా, అప్పటికీ, ఇప్పటికీ మనుషుల ప్రవర్తనలే మారిపోయాయి ఇంక పుస్తకాలు మారడంలో విశేషం ఏముంది. అవునూ! మీ నాన్న వచ్చాడ్రా ఇంటికి."

"వచ్చాడు తాతయ్యా భోజనం చేస్తున్నాడు నేను వెళ్తున్నా "

"ఉహూఁ! భోజన మయ్యాక ఇలా రమ్మను వాణ్ణోసారి "

* * * * * * *

ఏవిటి నాన్నా! పిలిచారట. ఏమన్నా కావాలా?"

ఏవీ అక్కర్లేదురా! నిన్నివాళ అసలు చూడనే లేదు. ఓ మారు చూద్దామని పిలిచానంతే. ఇలా కూర్చో '

"ఏవిటి నాన్నా! చెప్పండి మందులవీ ఉన్నాయా రోజూ పాలూ, పళ్ళూ అవీ తీసుకుంటున్నారా?" అన్నాడు రాఘవ

'అన్నీ ఉన్నాయిరా! రాఘవా! కానీ మనశ్శాంతే లేకుండా పోయింది ఈ ఒంటరితనం భరించలేక పోతున్నారా!" కళ్ళమ్మట నీళ్ళు తిరుగు తున్నాయి ముకుందరావుకి

"ఏవిటి నాన్నా! మీ చాదస్తం! ఇంట్లో అందరికీ మీ దగ్గరే కూర్చోవాలంటే ఎలా కుదురు తుంది అందరికీ ఎవరి పన్లు వాళ్ళకి వుంటాయి కదా! ఏదో కాలక్షేపం చేసుకోవాలి కానీ, ఇలా గయితే ఎలా. అక్కడికీ పుస్తకాలవీ కూడా ఏవో ఒకటి తెచ్చిస్తూనే ఉన్నా కదా!" అన్నాడు మందలింపుగా రాఘవ

"అది కాదురా. "

"మీరేవీ ఆలోచించకండి నాన్నా! డాక్టరేం చెప్పాడు మానసికంగా విశ్రాంతి కావాలని చెప్పాడు కదా ఈ వయస్సులో కృష్ణా, రామా అనుకుంటే అదే కావలసినంత మానసిక ప్రశాంతత. నేను వెళ్తాను నాన్నా పనుంది. అర్థీ తొందరగా నిద్ర పోకపోతే పొద్దున్నే మెలకువ రాదు మళ్ళా తెల్లారితే ఆఫీసు గొడవ కళ్ళు మూసుకు నిద్రపోండి హాయిగా" అంటూ వెళ్ళిపోయాడు రాఘవ

"నిజమేరా! దీర్ఘ నిద్రే పోవాలనుంది నాకు. కానీ అదీ నాకు భయపడి దూరంగా వెళ్ళి పోతోంది. బాధగా కళ్ళు మూసుకున్నాడు ముకుందరావు

* * * * * * *

'ఎలా వున్నావంటే ఏం చెప్పనురా వెంకూ ఇలా అయిపోయింది నా పని ఈ పక్షవాతం వచ్చి మంచంలో పడ్డ దగ్గర్నుండీ. నా కొచ్చింది పక్షవాతం కాదురా. నన్ను పట్టుకొంది దెయ్యంలా పక్షపాతం."

ఎందుకురా అంత బాధ పడ్తావు. అయిన వాళ్ళందరి మధ్యా ఉన్నావు. నీకు బాధేమిట్రా సాగితే రోగ మంత సుఖం లేదనీ "

"సాగకపోతే దానంత నరకం కూడా లేదురా "

"ఏం మీ వాళ్ళందరూ బాగానే ఉంటారను కుంటాను మీ ఆర్థిక పరిస్థితి కూడా బాగానే






# – ఒక్క ఆప్టానికాతోనే

ఆప్టానికా యొక్క నవతరానికి చెందిన జపాన్ సాంకేతిక విజ్ఞానం మీకోసం అందిస్తుంది ట్రూ-లైఫ్ విజన్—సజీవ సాక్షాత్కారం. దీనిలో ట్యూనింగ్‌లో ఆధునాతనమైన తీరుకోసం సూపర్ మైక్రోఛిప్, కలర్ మరియు కాంట్రాస్ట్‌లకోసం సూపర్ సెన్సిటివ్ ఆటో ట్ర్యాకింగ్ వున్నాయి. వీటితోపాటు మీ అధీనంలో ఇంకా మరెన్నో విశిష్టతలు.

Manufactured by

ఉన్నట్లుంది" అన్నాడు సావిత్రమ్మిచ్చిన ఎల్బర్ కాం చప్పరిస్తూ వెంకట్రావు

మా ఆర్థిక పరిస్థితి బాగానే ఉందిరా డబ్బుకేం లోటూ లేదు. ఇదంతా కనిపించని బాధ నేను భరించలేక పోతున్నా అన్నాడు డగ్గుత్తికతో ముకుందరావు.

'ఒరేయ్! ముకుందా! ఎందుకురా అంత బాధ పడ్తావు. ఇప్పు డేమయిందని

'ఏం చెప్పనురా ఈ ఒంటరితనం బాధ భరించ లేకుండా ఉన్నానురా ఇంత మంది ఉన్నా రవునా ఇంట్లో. ఒక్కళ్ళూ మనసు విప్పి మాట్లాడరురా నాతో. కాస్సేపయినా నా దగ్గర కూర్చోరు ఎందుకేనా పిలిచా ననుకో భయపడ్తూన్నట్లో, భక్తిగానో ఉంటారు తప్పించి ప్రేమగా ఉండర్రా మళ్ళీ వాళ్ళందరూ కులాసాగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుతూ, తుళ్ళుతూ ఉంటారు మా ఆవిడతో సహా. అందరూ కలసీ భోజనం చేస్తారు. నాకు ముందర పెట్టేస్తారు నన్ను కూడా వాళ్ళ దగ్గరికి తీసుకెళ్ళి వాళ్ళతో కలసి తిన నియ్యవచ్చుగా" అన్నాడాయన అన్నాళ్ళ ఆవేదననీ, ఆక్రోశం రూపంలో తెలియ జేస్తూ

"అందుకేరా ముకుందా- నీకు మొదట్నుంచీ చెప్తూనే ఉన్నాను నేను- ముసలితనం కోసం యవ్వనంలోనూ, పరలోకం కోసం ఇహలోకంలోనూ కూడ బెట్టుకోవాలని. ముసలితనం కోసం యవ్వనంలో కూడ బెట్టుకోవాల్సింది ధన మొక్కటే కాదు. అభిమానం కూడానూ మనం ఒకళ్ళ మీద చూపిస్తేనే కదా మన మీద వాళ్ళు కూడా చూపించేది" అన్నాడు

"అంటే నేనెవరి మీదా అభిమానం చూపించ లేదంటావా?" చిన్నబుచ్చు కున్నట్లుగా అన్నాడు ముకుందరావు.

"అంటే నీ దృష్టిలో అభిమానం చూపించడ మంటే ఏమిటి నువ్వు చెసిందల్లా నీ బాధ్యత తర్చు కున్నావు అది అభిమానం చూపించడ మవుతుందా ఇప్పుడీ పరిస్థితంతా ఎందువల్ల వచ్చిందంటావ్?"

"ఎందువల్ల?"

* * * * * * *

గంట సేపటి నుండీ వీధిలో నుండి ఇంట్లోకి, ఇంట్లో నుండి వీధిలోకి తిరుగుతోంది ఎంతకీ ముకుందం రావడం లేదు కొత్త కాపరం కొత్త ఆశలు ఓ నెల రోజు లొచ్చాయి వాళ్ళ కాపరానికి

ఇంకా కలల్లో నుండి వాస్తవంలోకి రాలేదు సావిత్రి తను కంటూన్న కలలు కల్లలుగానే ఉంటాయో, నిజా లవుతాయో ఆమెకే తెలీదు. ఎవరికయినా అంతే. ఇది జరిగింది అని పూర్తిగా జరిగాక అనుకోవాలి.

సాధారణంగా స్త్రీల అసంతృప్తికి కారణం వాళ్ళ జీవితాన్ని పురుషుల చుట్టూ అల్లుకోవడమే అయుంటుంది పురుషుడు కూడా సహకరించి ఆ అల్లికకి తోడ్పడితే అది సంతోషదాయక మవుతుంది. లేకపోతే ఆ జీవిత మంతా అసంతృప్తే.

ఆఖరికి ఏడు గంటలకు వచ్చాడు ముకుందం.

'ఏమండీ' ఆఫీసులో పనవ లేదా ఈ రోజ తొందరగా వస్తారను కున్నాను " అంది సావిత్రి

"పని అయిదున్నరకే అయింది కానీ ఇంత తొందరగా ఇంటి కొచ్చి ఏం చేయాలని రాలేదు " అన్నాడు ముకుందం.

చివుక్కు మంది సావిత్రికి కొత్త దంపతులు 'సాయంత్రం ఐదు ఎప్పు డవుతుందాని ఎదురు చూస్తూంటారట అతని కలా అనిపించదా!" అనుకుంది అయినా తమాయించుకుని-

'ఏవిటండీ బొత్తిగా అలా అంటారు తొందరగా వస్తే సరదాగా కలిసి సినిమాకి వెడదా మనుకున్నాను " అన్నది సావిత్రి బాధగా

"సావిత్రీ! మనిద్దరం మొగుడూ, పెళ్ళాలయి నంత మాత్రాన కలిసి సినిమాలకీ, షికార్లకీ తిరుగుతేనే కానీ కుదరదా ఎవరి ఫ్రెండ్స్‌తో వాళ్ళు కలసి వెడితేనే సుఖంగా ఉంటుంది కావాలంటే డబ్బిస్తాను వెళ్ళు, నిన్నొద్దన లేదు కదా అన్నాడు ముకుందం

ఇదేం మనిషి' అనిపించింది సావిత్రికి. ఇంకేమీ మాట్లాడే ధైర్యం లేకపోయింది సావిత్రికి

* * * * * * *

"ఏమండీ!

ఊఁ!'

"నేను పురిటికి మా వాళ్ళింటికి వెళ్ళాలి కదా!

"అవునూ అయితే

మిమ్మల్ని వదలి ఉండడం చాలా కష్టమని పిస్తూంది మీ కేమీ అన్పించడం లేదూ?"

సావిత్రీ! ఇలాంటి సెంటిమెంట్సన్నీ వదిలేసు కోవాలి మనిద్దరం పెళ్ళికి ముందర కలిసి ఉన్నామా! ఇప్పుడూ అంతే కాలక్షేపానికి ఫ్రెండ్సుంటారు కదా!" అన్నాడు దగ్గరగా తీసుకుంటూ

"అవును నిజమే పెళ్ళికి ముందర వేరేగా పడుకో లేదూ! ఇప్పుడు కూడా అలాగే పడుకోండి " అంది వెనక్కి తిరిగి పడుకుంటూ

ఏం మనిషో ఓ మాటొచ్చి మీదపడ్తుంది తను పడ్తే తోసేస్తుంది ఈ ఆడవాళ్ళకి ఏం కావాలో వాళ్ళకే తెలీదు అనుకుని విసుక్కున్నాడు అంతకంటే అతని మనస్సుకేం తోచలేదు

* * * * * * * *

"నాన్నా! నాన్నా!"

'ఏవిటిరా రాఘవా!

'ఎక్కడి కెళ్తున్నావు?'

ఎక్కడికని చెప్తే నీకు తెలుస్తుంది

"నువ్వెళ్ళద్దు నాన్నా నాకు కూడా నీతో రావాల నుంటుంది. తీసు కెళ్ళవా?" అన్నాడు బాబు ఏడుపు ముఖం పెట్టుకుని

"అలాగే నమ్మా మళ్ళీ వచ్చి తీసు కెడతాలే. సావిత్రీ! వీణ్ణి కాస్త మరపించు టైమయి పోతూంటే వీడొ కడు

బాబూ! ఏడవకమ్మా! నాన్న ఇప్పుడు వచ్చేస్తారుగా!" సావిత్రి ఊరడింపు.

'వొద్దమ్మా! నాన్న వెడితే రాడు. నేను కూడా వెళ్ళితే తొందరగా వస్తాడు నన్ను కూడా వెళ్ళనీయమ్మా."

వొద్దమ్మా! నేను ఇంచక్కా కథలు చెప్తాను. నాన్నతో వెడితే నాన్న ఫ్రెండ్సుతో మాట్లాడుతూ కూర్చుంటారు నీకేం తోస్తుంది చెప్పు. ఏం."

"అలాగేలే నాన్నెప్పుడూ ఇంతే

"తప్పమ్మా! అలా అనకూడదు నాన్నకి పనుంది కదా మరి "

"అమ్మా! నాన్నకి బైటేగానీ, ఇంట్లో ఎప్పుడూ పనుండదా!"

కొంతమంది కుండదు బాబూ!"

సావిత్రి మనస్సులోనే మథనపడ సాగింది



ఈయన తత్వ మేమిటో. భార్యా బిడ్డలతో గడపాలని ఉండదా అసలు. తనేమో, తన ఫ్రెండ్సేమో. చంటి పిల్లవాడు అడిగేడు కదా, వాడి కోరిక తీర్చడాని కయినా ఉండచ్చు కదా!

కానీ ఈయన మాత్రం నిజంగా ఈ ఈరట్లో వరకూతీసుకుంటే స్థిత ప్రజ్ఞుడు లాంటి మనిషే. తనేమో, తన కోరిక లేమోగానీ ఇక్కడున్న సంతోష, విచారా లేమీ ఆయనని అంటవు.

మొన్నటికి మొన్న బాబుకి ఎంత జ్వరం వచ్చింది. పలవరింతలు, కంగారు పెట్టేశాడు. అప్పుడు మనిషికి ఇంకో మనిషి ఉంటే ధైర్యమనేనా ఉండచ్చు కదా. "ప్చ్" అదేం లేదు. పైగా డాక్టరు దగ్గరికి తీసు కెళ్ళేము కదా. నేనుండి మాత్రం ఏం చేస్తాను అన్నారు. అంతేగానీ ఆయన కేమీ పేగు పీక లేదు. అందుకే అంటారు కడుపులో లేంది కావిలించు కుంటే వస్తుందాని.

సావిత్రిలో రోజు రోజుకీ అతని ప్రవర్తన పట్ల నిరుత్సాహం పెరగ సాగింది. ఇంక ఈయన మారరుగాక మారరు. మారాల్సింది తనే. అసలు తను పట్టించుకుని బాధ పడడం వల్లనే కదా. ఈ బాధంతా. తను కూడా ఆయనలాగే ఉండ గలిగినప్పుడు తను మాత్రం బాధ పడాల్సిన పనే ముందసలు.

అందుకే తన చుట్టూ తను కూడా ఓ ప్రపంచం ఏర్పరచు కుంది. స్నేహితులూ, పిల్లలూ ఇదే తన ప్రపంచం. భర్త కొరకు వండి పెట్టడం. వాతా వరణం ఇద్దరి మధ్యా బాగున్నప్పుడు కోరిక తీర్చు కోవడం. అంతవరకే ఇద్దరికీ ఉన్న సంబంధం.

ఒక్కోసారి విసుక్కునే వాడు ముకుందం. ఇంటి కొచ్చేసరికి నిద్ర పోతుం దేవిటి. కాస్త మెలకువగా ఉండి వడ్డించ వచ్చుకదాని.

ఎప్పుడయినా ఆ మాట అంటే విసుక్కునేది. 'అన్నీ అక్కడే ఉన్నాయి కదా. పెట్టుకు తినలేరూ' అని.

ఎప్పుడయినా బైట పని లేక తొందరగా ఇంటికొచ్చినా కూడా ఏమీ తోచేది కాదు.

ఒక్కోసారి పిల్లలు చదువుకుంటూంటే సావిత్రి పక్క వాటా వాళ్ళతో కబుర్లు చెప్తూండడమో లేక పోతే ఏ ఫస్టు షోకో వెళ్తూండేది. క్రమేపీ అతని నుండి విడిపోయి తన చుట్టూ దుర్భేద్యమయిన పరిధి ఏర్పరచుకొంది.

# ఇ.వేమన.పద్యాలు




దోషకారియైన దూసరికాడైన
పగతుడైన వేద పతితుడైన
వట్టిలేని పేదవానికి తగినవి
ధనికునకు నొసంగ తగదు వేమ

★ ★ ★ ★ ★

"ఇలాగయితే ఎవరయినా ఇంకెలా ప్రవర్తిస్తార్రా ముకుందం" అన్నాడు వెంకూ.

అంటే చిన్నప్పుడెప్పుడో తెలియక చేసిన తప్పుకి ఇంత శిక్షా. ఈ వృద్ధాప్యంలో ఒంటరిని చేసి బాధించడమా" ఆవేదనగా అన్నాడు ముకుందం.

"అని నువ్వనుకుంటున్నావు. కానీ అప్పుడు సావిత్రి కూడా అదే వంటరితనంతో బాధపడిందిగా. అయినా నీకు వాళ్ళేదో కావాలని నీకు కల్పించిన వంటరితనం కాదు కదా. నీ చుట్టూరా నువ్వే ఓ పరిధి గీసుకుని కూర్చున్నావు. స్నేహితులనీ, అదనీ, ఇదనీ. వాళ్ళు అది దాటి రాలేక బైటే ఉండిపోయారంతే. గదిలోకి మూసి తరిమికొడ్తే పిల్లి ఏం చేస్తుందో అదే చేసారు. అది నీమీద అలా పనిచేసింది కాని వాళ్ళు కూడా వాళ్ళ చుట్టూ ఓ ప్రపంచాన్ని ఏర్పరుచు కున్నారంతే".

"అవును నిజమే. వాళ్ళెంత బాధపడి నా నుండి వేరయారో. తలచుకుంటే నాకిప్పుడన్పిస్తుంది. నా కోసమెంతగా ఎదురు చూసేదో సావిత్రి. కానీ ఆమెని నేనెప్పుడూ గమనించనే లేదు.

ఆమె నోరు తెరచి అడిగినా కూడా ఏ చిన్న కోరికా కూడా తీర్చలేకపోయాను. కలిసి సంసారం చేయడం తప్ప ఇంకేమీ చెయ్యలేదు. ఇప్పుడన్పిస్తోంది. ఈ జీవితం మళ్ళీ మొదలయితే ఎంత బాగుండేదని. కనీసం మళ్ళీ మొదలవ్వక పోయినా మళ్ళీ పుట్టి మంచి జీవితాన్ననుభవించడం కోసమేనా తొందరగా చచ్చిపోతే బాగుండునన్పిస్తోందిరా వెంకూ! అన్నాడు ముకుందం ఆ జీవిత మాధుర్యాన్ని తలపోస్తూ. ☐







# భారతి

సాహిత్య మాసపత్రిక

కొన్ని అనివార్య కారణాల వలన భారతి సాహిత్య మాసపత్రిక ప్రచురణని తాత్కాలికంగా నిలిపి వెయ్యటం జరిగింది కాని–

సాహిత్యాభిమానుల కోరికపై

జనవరి నుండి
సాహిత్య మాసపత్రిక

## భారతిని

తిరిగి వెలువరించటానికి ఏర్పాట్లు చేస్తున్నాము!

★ ఎప్పటిలాగే భారతి సాహిత్యానికి ప్రాధాన్యం ఇస్తుంది!

★ కవిత్వం, కథలు, చారిత్రక. పరిశోధన, విమర్శనము, భాషా శాస్త్రం, చర్చ– అన్నిటికీ భారతి చక్కటి అవకాశాలు కల్పిస్తూనే ఉంటుంది!

★ ఒక్క మాటలో చెప్పాలంటే భారతి తెలుగు వారి సంస్కృతికి (భారతీయులుగా, ఆధునిక ప్రపంచపు పౌరులుగా) ప్రతిబింబంగా ఉంటుంది.

సాహిత్యాభిమానులు చందాదారులుగా చేరి భారతి ప్రచురణకి తగిన ప్రోత్సాహం ఇవ్వాలని కోరుతున్నాము.

చందాదారులుగా చేరే వారి సౌకర్యం కోసం ముందుగానే ఒకేసారి 12 సంచికల చందా కట్టేవారికి రు. 15/–ల ముదరా ఏర్పాటు చేస్తున్నాము.

అంటే సంవత్సర చందా నెలకి రు. 5/–చొప్పున. రు. 60/– అవుతుంది. కాని ముందుగా చందా దారులు కావాలనుకున్న వారు రు. 45/– పంపితే చాలునన్నమాట!

## జనవరి నుండి వెలువడుతోంది!

ఆంధ్ర పత్రిక ఏజెంటు ఉన్న చోట సరఫరా ఏజెంటుద్వారా జరుగుతుంది.

ఏజెంటు లేని చోట ఉన్న వారికి భారతిని పోస్టు ద్వారా పంపగలము.

ఈ ప్రకటనలో పొందుపరిచి ఉన్న కూపనుని నింపి మీ చందా మొత్తంతో నేడే పంపగోరు తున్నాము.

చందాదారులుగా చేరదలచినవారు భారతి, కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520003. చిరునామాకు మనియార్డరు/ డ్రాఫ్ట్ ద్వారా రూ. 45/– చెల్లించాలి. మనియార్డరు రసీదు/ డ్రాఫ్టుతో బాటు ఈ క్రింది కూపన్ జతచేర్చి పంపాలి.

మనియార్డరు కూపన్‌లో భారతి సంవత్సర చందా నిమిత్తం రు. 45/– పంపుతున్నట్టు రాస్తూ, తమ పోస్టలు చిరునామాను స్పష్టంగా రాయాలి.

### భారతి చందా కూపను

నేను భారతి మాసపత్రికకు చందా దారునిగా చేరదలుచుకున్నాను. సంవత్సర చందా సైకము రు. 45/-(25 శాతం ముదరా పోను) డి. డి/ ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : ....................................................

చిరునామా : ....................................................

....................................................

.......................... పిన్‌కోడ్ : ..........................

చందాదారుని సంతకం

# షేర్ మార్కెట్‌లలో పెట్టుబడులు



–యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

నవంబరు 27 సంచికతో ప్రారంభమైన నా వ్యాసాలు అదిలోనే చాలా సంచలనం రేకెత్తించాయి అని చెప్పాలి. పాఠకులు కొందరు మెచ్చుకున్నారు. కొందరు మాత్రం మీ అర్టికల్స్‌కి పెట్టిన టైటిల్ ఏమి సబబుగాలేదు. మన దేశంలో చట్టాలు సరిగా లేవు కాబట్టి సరిపోయింది లేకుంటే మీరు పెట్టిన టైటిల్‌లో 'వద్దంటే డబ్బు' అన్న పదం మీద కోర్టులో కేసు పెట్టే పని అని అన్నారు. వీరి యొక్క విమర్శనా దృష్టికి నా హృదయపూర్వక అభినందనలు. ఈ టైటిల్ సబబే అని నిరూపించే సంఘటన ఒకటి వివరిస్తాను.

గుడివాడలో నాకు ఒక మంచి క్లయింట్ చౌదరి అనే ఆయన వున్నాడు. మేమంతా సిల్క్ స్మిత అభిమానులం కావటం మూలంగా ముద్దుగా అతన్ని సిల్కు చౌదరి అని అంటాము. కొంత కాలం క్రితం 'బేరర్ బాండ్స్' ప్రభుత్వం ప్రకటించినప్పుడు ఆయన చేత కొనిపించటం జరిగింది. వీటిని ప్రజల వద్ద వున్న లెక్కకిరాని డబ్బుని వెలికి తీయటానికి ప్రభుత్వం చేపట్టిన ఒక మార్గం. ఒక్కొక్క బాండ్ పదివేల రూపాయలవి వుంటాయి. ఈవి ఈ రోజున ఢిల్లీ దగ్గరివి అయితే 8500 రూపాయల ప్రీమియం మీద అమ్ముడు పోతూ వుంటే కలకత్తావి 3,500 రూపాయిల ప్రీమియం కల్గివున్నాయి. అతనివద్ద వున్నవి ఢిల్లీలో అమ్మివేసి, కలకత్తావి కొనటం ద్వారా మరల సుమారు 25% లాభం చేకూరింది. దీన్నే అంటారేమో కదా వద్దంటే డబ్బు అని! ఇక మరి మన విషయంలో కి వద్దామా?

మామూలు షేర్లను ఈక్విటీ షేర్లు అంటారు. ఇవికాక ప్రిఫరెన్స్ షేర్లు అనేవి ఇంకొక రకంవి వుంటాయి. వీటి మీద ఒక నిర్ణీత డివిడెండ్‌ని కంపెనీ ముందే హామి ఇస్తుంది. (డివిడెండ్ అంటే లాభశాతం? వీటిని సాధారణంగా అర్థిక సంస్థలు ఎల్. ఐ. సి; ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, ది ఇండస్ట్రియల్ క్రెడిట్ అండ్ ఇన్‌వెస్ట్‌మెంట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ మొదలైనవి తీసుకుంటూ వుంటాయి. ఇవి అమ్మటానికి వీలుకాదు కాని వీటి మీద వచ్చే బోనస్ షేర్స్, రైట్ షేర్స్ మాత్రం ఎంచక్కా స్టాక్ మార్కెట్‌లలో అమ్మవచ్చు.

ఇంక ఈ వారం మనం ట్రాన్స్‌ఫర్ డీడ్‌లని గూర్చి తెలుసుకొందాము. ట్రాన్స్‌ఫర్ డీడ్ పై భాగం మీద ఏ స్టాక్ ఎక్స్‌ఛేంజ్ నుంచి విడుదలైనదీ, ఏ రోజున విడుదలైనదీ వివరించే ముద్ర వుంటుంది. తరువాత కంపెనీ పూర్తి పేరు అని వున్న చోట మనం ఏ కంపెనీ షేర్స్‌ని ట్రాన్స్‌ఫర్ కోసం పంపుతామో, ఆ కంపెనీ పేరు పూర్తిగా వ్రాయాలి. తరువాత సంఖ్య, షేర్ల పూర్తి వివరణ అని వున్న బాక్స్‌లో ఒక సబ్‌బాక్స్‌లో అంకెలలో సంఖ్య అని వున్న చోట ఎన్ని షేర్లు పంపుతున్నామో అనేది అంకెలలో వ్రాయాలి. మాటలలో సంఖ్య అని వున్న చోట అక్షరాలలో ఎన్ని షేర్లో వ్రాయాలి. తరువాత వివరణ ఈక్విటీ ప్రిఫరెన్స్ షేర్స్ అని వున్న చోట ఏవి అయితే వాటిని వుంచి మిగతావి కొట్టివెయ్యాలి. ఇవి రెండూ కాక డిబెంచర్‌లు అయితే డి.ఇ.బి. అని వ్రాస్తే సరిపోతుంది. తరువాత డిస్టింక్టివ్ నంబర్స్ అని వున్న చోట కంపెనీ షేర్ సర్టిఫికెట్ మీద వున్నటువంటి డి. నెం.లు వ్రాయాలి. ఆ షేర్లు గుర్తింపబడిన స్టాక్ ఎక్స్‌ఛేంజ్ ద్వారా వచ్చినవా లేదా అన్న దానికి సమాధానం అవును అయితే స్టాక్ ఎక్స్‌ఛేంజ్ పేరు రాయాలి అని వున్న చోట, అవును అని వ్రాసి అది ఏ స్టాక్ ఎక్స్ ఛేంజో దాని పేరు వ్రాస్తే సరిపోతుంది. తరువాత ట్రాన్స్‌ఫర్ ఫ్రమ్ అని వున్న బాక్స్‌లో ఎవ్వరి వద్దనుంచి కొన్నామో వారి పేరు



వ్రాయాలి. ఈ పేరు షేర్ సర్టిఫికెట్ ముందు భాగంలో కానీ, లేక దాని వెనక భాగంలో కానీ వుంటుంది.

మిగతా భాగం వచ్చే వారం అందిస్తాను. మీ వద్ద సెలవు తీసుకొనే ముందు ఒక చిన్న ప్రశ్న. ఈ రోజు స్టాక్ మార్కెట్స్‌కి రైతులకూ కావలసిన ఒకే వస్తువు ఏమిటో చెప్పండి??.... మా రత్నంగారు అంటున్నారు ఇద్దరికీ కావలసినవి బుల్స్ (ఎద్దులు) సహకారం. ఎంతైనా రైతుబిడ్డ మాట కదండి అది వరాల మూటే. □

## సరైన సూచనలకు రు. 100/- బహుమానం

ఈ శీర్షిక ఇంకా వివరంగా మీకు తెలియాలి అంటే ఎలా? మీలో కొంతరు ఇన్వెస్టర్‌లు వుండే వుంటారు కాబట్టి మీకు ఏవి టాపిక్స్ మీద వివరంగా కావాలంటే వాటి మీద వ్రాయటానికి నాకు అవకాశం వుంటుంది. అంతేగాక సరైన సూచనలు ఇచ్చిన వారికి 100 రూపాయల బహుమానాన్ని సదరన్ కన్సల్టెన్సీ సర్వీసెస్, శీతమ్మధార బ్రాంచి, విశాఖపట్నం వారు ప్రకటిస్తారు. మీ అడ్రస్ తెలుపగోరుతున్నాను.

–యన్. రామ్‌జీ



సీరియల్

# మంత్రనాగం

గంధం

## కాశ్వినాతల సువర్ణకన్నన్

(గత సంచిక తరువాయి)

అరవింద్, భట్టులకి స్పృహ వచ్చేసరికి సూర్యుడు పశ్చిమాద్రికి చేరుకుంటున్నాడు

తలంతా దిమ్ముగా వుండి కొన్ని క్షణాలు అలాగే వుండి పోయారు అయోమయంగా

క్రమేపీ జరిగింది గుర్తొచ్చింది

చటుక్కున లేచి కూర్చున్నాడు అరవింద్

అతని మొహం ఎర్రబడి పోయింది భయం, కోపం కలిసి అతని శరీరాన్ని అదోలా ఒణికించేశాయి కాళ్ళు శక్తిని కోల్పోయినట్టయ్యాయి

భట్టూ!" అన్నాడు అరిచినట్టు

అతనూ లేచి కూర్చున్నాడు

"భట్టూ! కాంతి ' అతనికి దుఃఖం వచ్చేస్తోంది

భట్టు మొహంలో కూడా భీతి కనిపించింది

"భట్టూ! వాళ్ళు కాంతినేం చేస్తారు? పసివాడిలా అడిగాడు అరవింద్

భట్టు మాట్లాడలేదు

అతని మౌనం మరీ భయాన్ని కలిగించింది అరవింద్‌కి రెండు చేతుల్లో మొహం దాచుకుని వలవల ఏడవసాగాడు

"ఛ! ఛ! ఏమిటి సర్! పసిపిల్లాడిలా!" అతని చేతుల్ని తొలగించి కళ్ళు కండువాతో అద్దుతూ అన్నాడు భట్టు

బట్టూ! ఇప్పుడేం చెయ్యాలి? కాంతి లేకుండా ఇంటికి తిరిగి ఎలా వెళ్ళాలి? ... జయదేవ్‌గారి కేం చెప్పాలి? ఏడుస్తూనే అన్నాడు అరవింద్

అతని దుఃఖాన్ని చూసిన భట్టు చలించిపోయాడు తన భయాన్ని అవతలికి నెట్టి అతన్ని పూరడించాడు.

"సర్! ఇలాంటి టైమ్‌లోనే మనం ధైర్యం తెచ్చుకోవాలి ఒకళ్ళ కిద్దరం వున్నాం!.... అదీగాక అమ్మాయిగారు సామాన్యురాలు కాదు మనకన్నా ధైర్య సాహసాలు, సమయస్ఫూర్తీ వున్నాయామెకి " అన్నాడు

అరవింద్ మొహంలోకి కాస్త కాంతి వచ్చింది

"కాంతి దొరుకుతుందంటావా భట్టూ! అన్నాడు బేలగా.

"తప్పకుండా దొరుకుతుంది! అంతగా దొరక లేదంటే మనం కూడా ఈ అడవిలోనే వుండి పోదాం! ఆ మనుష్యుల్ని నాశనం చేద్దాం గంభీరంగా అన్నాడు భట్టు.

మెల్లగా లేచాడు అరవింద్.

భట్టు మాటలతో కాస్త ధైర్యం వచ్చిందతనికి

"పద!.... ముందు ఏటికెళ్ళి కాస్త మొహం కడుక్కుందాం' అన్నాడు

"ఇద్దరూ మెల్లగా ఏటికేసి నడిచారు.

కాళ్ళు తడబడుతున్నాయి ఇద్దరికీ.

అక్కడ తాము పోరాడిన ఛాయలు, కాంతి కాలినించి స్రవించిన రక్తం తాలూకు ఎండి పోయిన మరకలు స్పష్టంగా కనిపిస్తున్నాయి..

మళ్ళీ జరిగిందంతా కళ్ళకి కట్టినట్టు కనిపించింది ఇద్దరికీ భట్టు తమాయించుకున్నా అరవింద్ మాత్రం తమాయించుకో లేక పోయాడు

మళ్ళీ బావురుమన్నాడు.

అతన్ని ఓదార్చడం సాధ్యం కావడం లేదు భట్టుకి

"లేవండి సర్! మనం ఇలా ఆలస్యం చేస్తే అక్కడ అమ్మాయి గారికి మరింత ప్రమాదం!... ముందు మొహం కడుక్కోండి ' అంటూ అరవింద్ చెయ్యి పట్టుకుని రేవులో కెళ్ళాడు.

నీళ్ళలో బాగా దిక్కుండానే అతి జాగ్రత్తగా చూస్తూ మొహాలు కడుక్కున్నారిద్దరూ. కడుపు నిండా ఇన్ని నీళ్ళు తాగారు

కాళీ కడుపులో నీళ్ళు పడేసరికి.... అదోలా కడుపులో తిప్పింది ఇద్దరికీ.

మెల్లగా అలాగే ఒడ్డెక్కారు.

జరిగిన కథ – 22 : శవపేటిక, గ్రంథం మాయం కాగా, సింహాలు, స్త్రీల ఆర్తనాదాలు, గుర్రపు డెక్కల చప్పుడు, పిశాచాలు వంటి విచిత్ర పరిస్థితుల మధ్య పట్టుదలతో ఉంటారు అరవింద్, కాంతి, భట్టు. వెళ్ళిపోవడానికి నిశ్చయించుకుని, చివరిక్షణంలో ఏటిలో దిగిన కాంతిని మొసలి పట్టుకుంటుంది మొసలి నుంచి తప్పించిన కొండజాతి వాళ్ళు ముగ్గుర్నీ బందిస్తారు. కాంతిపై వాళ్ళ నాయకుడు మనసు పడతాడు.



ఏ అడివి పళ్ళయినా దొరికితే బావుండు' అరవింద్ మొహం చూసిన భట్టు అన్నాడు

"ఊఁహూఁ!... ఏం వద్దు! ముందు మనం కాంతిని రక్షించుకోవాలి! పద" ఓసారి తల విదిలించి అన్నాడు అరవింద్

"ఎటుకేసి వెళ్దాం?" ఏదో ఆలోచిస్తూ అన్నాడు భట్టు

"అటవికులు అట్నుంచి కదా వచ్చింది బహుశా అటే తీసికెళ్ళుంటారు కాంతిని" అన్నాడు అరవింద్

ఇద్దరూ అటుగా నడవసాగారు

చెట్లు, చేమలూ, పుట్టలూ గట్టులూ, పొదలూ ఏరులూ దాటుకుంటూ నడుస్తున్నారు.

కాళ్ళలోని సత్తువ క్షీణించి పోయింది

ఆకలనిపించినప్పుడల్లా ఏటినీళ్ళు తాగుతున్నారు అవి కడుపులో తిప్పితే కూలబడి పదినిమిషాల పాటు విశ్రాంతి తీసుకుని మళ్ళీ నడక సాగించారు.

క్షణక్షణానికీ కాంతి దొరుకుతుందన్న ఆశ సన్నగిల్లుతోంది దాంతో నీరసం నిర్దయగా మరింత కృంగదీస్తోంది.

అలా అతి సాహసోపేతమైన ప్రయాణం చేస్తూ, ఎన్నో ప్రమాదాల్ని ఎదుర్కొంటూ, మంచినీటితో కడుపులు నింపుకుంటూ చాలా చోట్ల తిరిగారు.

అలనాడు శ్రీరాముడు సీతమ్మ జాడకోసం వానర మూకతో వెతుకుతుంటే ఈనాడు అరవింద్ భట్టు సాయంతో కాంతిని వెతుకుతున్నాడు.

అలా అలా వెతుకుతూనే వున్నారు ఇద్దరూ

హఠాత్తుగా ఓ చోట ఆగి పోయారు

వాళ్ళిద్దరి కళ్ళు తళుక్కుమన్నాయి

దూరంగా ఏదో సన్నని వెలుగు!

"భట్టూ! అక్కడేదో గూడెం వున్నట్టుంది కదూ!" వుత్సాహంగా అన్నాడు అరవింద్

భట్టు కూడా నీరసం పోయి వుత్సాహం వచ్చింది.

"అవునుసర్! అక్కడే అమ్మాయిగార్ని దాచుండచ్చు' అన్నాడు వెలుగు కనిపించిన వైపు చూస్తూ.

ఇద్దరూ అటు కేసి అడుగులు వేశారు

మరి కాస్త దూరం వెళ్ళే సరికి ఆ వెలుగు ఏవో కాగడాలుగా కనిపించాయి.

"సర్ మనం సరాసరి అక్కడికి వెళ్ళడం అంత క్షేమం కాదు అటవికులు

# మంజీరనాదం

బలవంతులు ఒక వేళ వాళ్ళే మన అమ్మాయి గార్ని దొంగిలించిన వాళ్ళయితే మనల్ని ప్రాణాలతో వుండనివ్వరు జంతువుల్ని చంపినట్టు చంపేస్తారు!" హెచ్చరిస్తున్నట్టు అన్నాడు భట్టు

'అక్కడి కెళ్ళద్దు చాటున దాగుతూ మెల్లగా అక్కడికి చేరుకుందాం వాళ్ళ కంట పడకుండా కాంతి కనిపిస్తుందేమో చూద్దాం తెల్లారితే మరి కష్టంకదా అన్నాడు అరవింద్ భట్టుకూడా అదే మంచిదనిపించింది

"పదండి" అన్నాడు అడుగులు వేస్తూ

ఇద్దరూ శబ్దం కాకుండా గూడెం వైపుకి నడిచారు

గూడెమంతా గాఢ నిద్రలో వుంది

అక్కడక్కడ మట్టి దిమ్మలున్నాయి ఆదిమ్మల మీద కాగడాలు వెలుగుతున్నాయి ఆపక్కనే కటిక నేలమీద పడుకుని గొడ్లలా పడి నిద్ర పోతున్నారు ఆటవికులు జంతు చర్మాలు పరుచుకుని పడుకున్నారు మరి కొందరు

అరవింద్‌కి ఆ సీన్ చూస్తుంటే ఓ ఇంగ్లీష్ సినిమా చూస్తున్నట్టుంది అతనికి కాంతి దూరం కాక పోతే ఎంతో ఎంజాయ్ చేసేవాడు అంత ఘోరారణ్యంలో మనుష్యులు కనిపించినందుకు ఎగిరి గంతేసే వాడు భట్టుకూడా అలాగే అనిపించింది

క్షణం ఆగి కళ్ళతో నే సైగలు చేసుకున్నారు ముందుకు సాగుదామని

అలా శబ్దం కాకుండా అడుగులో అడుగు వేస్తున్నట్లు, వాళ్ళందర్ని దాటుకుంటూ కొంత దూరం నడిచారు వారిలో కాంతి వుందేమో అని మధ్య మధ్య పరికిస్తున్నారు అలా ఆరుబైట కటిక నేల మీద వుండదన్న నమ్మకం వున్నా

అలా కొంతదూరం నడిచి గూడెం మధ్యగా వెళ్ళారు

అక్కడ క్షణం ఆగారు

కారణం అక్కడ విశాలమైన ఆవరణలో అందమైన కుటీరం వుంది ఆకుటీరం చుట్టూ మరింత అందమైన పూలతోట వుంది వాటిలో ఎక్కువగా గులాబీలు పెంచబడి వున్నాయి

ఆ కాగడాల కాంతిలో నే రంగురంగుల గులాబీలు చిరుగాలికి తలలూపుతూ కనిపించాయి

ఇంత కారడివిలో ఈ గులాబీలు చిత్రంగా వుందికదూ! మెల్లగా అన్నాడు భట్టు

అవును!" అన్నట్టు తలూపాడు అరవింద్ "అమ్మాయిగారిని ఇక్కడుంచారేమో!' ఆశగా అన్నాడు భట్టు

నా అనుమానమూ అదే!

మెల్లగా తోటలోంచి కొంత దూరం నడిచి క్షణం ఆగారు




ఆ ఇంటి ముందు అలంకరణ, మొక్కలు పెంచిన తీరూ చూస్తుంటే అది కేవలం ఆటవికుల పరిజ్ఞానం కాదని పించింది ఇద్దరికీ

ఓసారి తలెత్తి కుటీరం కేసి చూశారు

కుటీరం పైన కూడా ఏదో క్రీపర్ పాకి చుట్టూ అందంగా హేంగ్ అవుతోంది

అమ్మాయిగారు కచ్చితంగా ఇక్కడే వుండి వుంటారు మరింత నమ్మకంగా అన్నాడు భట్టు

క్షణం అలాగే నిల్చుని చుట్టూ చూశాడు అరవింద్

అతనికీ కాంతి ఇక్కడే వుంటుందన్న నమ్మకం స్ఫురపడింది

లోని కెలా వెళ్ళడమా అన్నటు గుమ్మం కేసి చూశారు

వాళ్ళ గుండెలు జల్లు మన్నాయి

గుమ్మానికి ఇటు అటు యమకింకరుల్లాంటి ఆటవికులు ఇద్దరు పడ నిద్రపోతున్నారు

వూపిరి తీస్తే వారికి వినిపిస్తుందేమో అన్నట్టు నిశ్శబ్దంగా వుండి పోయారు అరవింద్ భట్టులు

"ఏం చేద్దాం?" అన్నట్టు చూశాడు బట్టు

లోని కెళ్దాం అన్నాడు అరవింద్ సైగలతో నే

మెల్లగా గుమ్మం దగ్గరున్న వాళ్ళని తప్పించుకుని లోని కొచ్చారు ఇద్దరూ

అక్కడి అలంకరణని చూసి మరింత తెల్ల బోయారు లోపలి దివ్వెలు వెలుగుతూనే వున్నాయి సోఫాలు, కుర్చీలు లాంటివే గాక ఫ్లవర్ వాజ్‌ల్లాంటివి కూడా వున్నాయి

బైటకది ఓ మాదిరి కుటీరంలా కనిపిస్తున్నా లోపల మాత్రం చాలా గదులతో విశాలంగా వుంది

అన్ని గదుల్లో కాంతి ఎక్కడున్నట్టు? అనుకున్న వాళ్ళిద్దరికీ నీరసం వచ్చేసింది అయినా ధైర్యం తెచ్చుకుని చుట్టూ వరండాలా వున్న చోట్నుంచి కాంతి జాడ ఏమైనా తెలుస్తుందేమో అన్నట్టు వెతుక్కుంటూ నడుస్తున్న వారికి ఓగదిలోంచి సన్నగా మాటలు వినిపించి టక్కున ఆగిపోయారు

ఒక మగగొంతు, ఒక ఆడగొంతు ఏదో తీవ్రంగా వాదించుకుంటున్నాయి అయితే స్పష్టంగా అర్థం కావడం లేదు

మరి రెండు నిమిషాలకి–

పటప్! అండ్ గెటవుట్!" అంటూ పెద్దగా అరిచిందా స్త్రీ గొంతు

తృళ్ళి పడ్డారు అరవింద్, భట్టు

అది కాంతి గొంతు!

ఇద్దరి గుండెలు అతి వేగంగా కొట్టుకున్నాయి కాంతి ఉనికి తెలిసిందని ఆనందంగా ఉన్నా, ఆమెని రక్షించడం ఎలాగో మాత్రం అర్థం కాలేదు వాళ్ళకి

"ఓ సారి కిటికీలోంచి చూసి ఆ తరువాత సంగతి ఆలోచిద్దాం! గుసగుసగా అన్నాడు భట్టు

'అలాగే! " అన్నట్టు తల ఊపాడు అరవింద్

భట్టు చూసి–

అమ్మాయిగారేం బంధించి లేరు మరో నడి వయస్కుడు ఉన్నాడు! అన్నాడు మెల్లిగా

అరవింద్ కూడా తొంగి చూశాడు

అంతే! కొయ్యబారి పోయాడు

కాంతిని చూసికాదు

అక్కడున్న వ్యక్తిని చూసి!

ఆ వ్యక్తి అనాడు ట్రైన్‌లో తనని చూసి అకారణంగా మండి పడిన సింగ్!

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

"ఎవరు మీరు?' అంది కాంతి ఆ నాగరికుడితో

'నా పేరు ఉదయసింగ్' చిన్నగా నవ్వుతూ తనని తాను పరిచయం

## మంజీరనాదం

చేసుకున్నాడతను

'నన్నెందుకు తీసుకొచ్చారు?" సీరియస్‌గా అంది కాంతి

'ముందు నాకు ధ్యాంక్స్ చెప్పాలి!" నవ్వాడతను.

"థాంక్సా? ఎందుకు?" మొహం చిట్లించింది కాంతి

'మీ ప్రాణాలు కాపాడినందుకు' .. అదే మొసలి బారి నుంచి!.... ."

ఓ! అదా అయినా మీరు కాపాడ లేదు!'

"నేను కాపాడినా నా మనుష్యులు కాపాడినా ఒకటే!' పదునుగా అన్నాడు సింగ్

"అయితే ఇప్పుడేమంటారు? "

ఏం అనను గానీ ఇప్పుడు మీరేం చెయ్యాలో తెలుసా?" అతనూ మర్యాదగానే సంబోధించాడు

"చెప్పండి'

"రసన్ శవం నాక్కావ్వాలి' తెచ్చుకున్నాను. . 'ప్రేమకి మరణం లేదు' గ్రంధం స్వంతం చేసుకోవాలనుకున్నాను అదీ అయింది మిమ్మల్నీ అడవినుంచి పంపేద్దామనుకున్నాను కానీ అది మాత్రం నా వల్ల కాలేదు..."

'అంటే?

ఈ అడవి నాకెన్నాళ్ళనుంచో సుపరిచితం' ఇక్కడి వాళ్ళు నా సేవకులు, స్నేహితులు ఇక్కడి క్రూరమృగాలు సైతం నా కనుసన్నల్లో మెలుగుతాయి. ఇక్కడి నిధులన్నింటికి నేనే ఏకైక వారసుణ్ని!. నాతో మరొకళ్ళు పాలు పంచుకోవడం నేను సహించను!" కఠినంగా అన్నాడతను.

"ఏం? ఆ నిధులన్నీ మీ పెద్దలు మీకు రాసి పోయారా?" వ్యంగ్యంగా అంది కాంతి.

"అలాగే అనుకోండి!. "

"అది సరే!. ఇంతకీ నన్నెంధుకు తెచ్చారో చెప్పనే లేదు!. ." కాస్త ధైర్యంగానే అంది కాంతి.

"మీ వాళ్ళకి పనిష్మెంట్!"

"అదేమిటి?" వింతగా చూసింది కాంతి

"అవును! మీరన్నట్టు ఈ నిధులకి నేనే వారసుణ్ణని ఇక్కడి పెద్దలు రాసి పోకపోయినా.. ఆ దేవుడు రాశాడు. అలాంటిది ఇప్పుడు హటాత్తుగా మీరొచ్చి.. ఆ నిధుల విషయంలో తల దూర్చారు! నయానా భయానా ఎన్నో విధాల హెచ్చరించాను... విన్లేదు . ."

"అంటే? . మమ్మల్నెలా భయపెట్టావ్?" తెల్లబోతూ అడిగింది కాంతి

"చాలా రకాలుగా.. !...




"శవాన్ని దాచేస్తే .. హడిలి పారిపోతారనుకొని దాచేశాను. సింహాల్ని, పులులని ఉసికొల్పాను. పాముల్ని గంపలతో తెచ్చి పడేయించాను... తిండి, నీళ్ళూ లేకుండా చేశాను! షెల్టర్ ధ్వంసం చేయించాను. అయినా... మీరు వెళ్ళిపోలేదు.

చివరికి దెయ్యాల్ని సృష్టించాను కానీ... అరవింద్ అసాధ్యుడు' అవి దెయ్యాలు కావని ఇట్టే గ్రహించాడు

"అంటే. అవి నిజంగా దెయ్యాలు కాదా?" ఆశ్చర్యంగా అంది కాంతి. అతని మాట పూర్తి కాకుండానే.

పెద్దగా నవ్వాడతను.

"ఈ రోజుల్లో దెయ్యాలా?".. అంటూ

"మరైతే... ఆ నెత్తురు. .."

"అదంతా జంతు రక్తం! .."

"మరి. . రివాల్వర్ బులెట్స్ సంగతి?"

వాళ్ళు ఆయిదుగురు బులెట్ ప్రూఫ్స్ ధరించారు" విలాసంగా నవ్వాడతను.

"మైగాడ్" అప్రయత్నంగా అరిచింది కాంతి.

"చూశారా? సాహసం అన్నప్పుడూ అచ్చిరాదు నేనెన్ని చేసినా మీరు భయపడి పారిపోలేదు. నాకు పిచ్చ కోపం వచ్చింది వెంటనే మిమ్మల్ని తీసుకు రమ్మని పంపాను.

ఆ తర్వాత మిమ్మల్నెలా తెచ్చారో మీకు తెలుసుగా?" అన్నాడు సింగ్.

"అసలు మేం ఇక్కడికొస్తామని మీకెలా తెలుసు? మేం బైటి వారికెవరికీ ఈ విషయం చెప్పలేదే!..." అంది కాంతి.

అతను మళ్ళీ నవ్వాడు.

"ఆ రోజు . అరవింద్. ఒంటరిగా . మెటల్ డిటెక్టర్‌తో అడవికి వెళ్ళినప్పుడు నేనూ ఆ ట్రైన్‌లో ఉన్నాను నన్ను కూడా రమ్మని పిల్చాడతను అయితే . అతనా ప్రాంతాలు చూడ్డం ఇష్టం లేని నేను . నేను వెళ్ళలేదు సరికదా అతన్ని కూడా భయపెట్టాను అయితే నా మాటలకి అతను భయపడలేదు . పెద్ద హీరోలా వెళ్ళాడు.

చాలా సేపు తర్వాత వచ్చాడు

అతనేదో విషయం దాస్తున్నాడని గ్రహించాను అయితే అది శవాన్ని గురించిన చోటని కాదు. నేను భయపడింది అసలా శవపేటిక ఉందన్న సంగతే నాకు తెలియదు

ఆ ప్రాంతాల్లోనే మరో నిధి, ఇంకాస్త ముందు కొస్తే ఈ స్థావరాలు అతని కంట పడతాయని భయపడ్డాను

నేననుకున్నంతా అయింది అతను మళ్ళీ సరంజామాతో దిగాడు

నాకు తిక్క రేగింది

ఎన్నో విధాల మిమ్మల్ని పంపెయ్యాలని చూసి ఓడిపోయాను. చివరికి మీ ముగ్గుర్నీ చంపెయ్యమని కూడా చెప్పాను... కానీ. .

"ఊ! కానీ. ?'

"ఎందుకో నీ మీద నాకు ప్రేమ కలిగింది. అందుకే నిన్ను తెప్పించుకున్నాను. వాళ్ళని తరిమెయ్యమన్నాను ఆ అరవింద్ నిన్ను ప్రేమించాడని నాకు బాగా తెలుసు!... అందుకే.. నిన్ను నేను పెళ్ళాడ బోతున్నాను. అదే అతనికి తగిన పనిష్మెంట్!" అతని కళ్ళు ఎర్రబడ్డాయి. బహువచనంలోంచి ఏక వచనంలోకి మారింది సంబోధన

అంతవరకు లేని భయం ఒక్కపెట్టున దాడి చేసి ఒణికించేసింది కాంతిని. తన తండ్రి ఈడువాడు. అలా అనేసరికి అసహ్యంతో ఒళ్ళు జలదరించింది. తెచ్చిపెట్టుకున్న సౌమ్యం ఎగిరిపోయింది.

"మిస్టర్!... అరవింద్‌ని అంత తేలిగ్గా అంచనా వెయ్యకు. తన నుంచి నన్ను దూరం చేసినందుకు నీ మీద అంతకి అంత పగా తీర్చుకుంటాడు" అంది ఆవేశంగా

# రచయిత్రి జవాబులు



పి. శ్రీదేవీ ప్రసాద్, ములకలూరు

ప్ర : ఆంటీ! నాకు చిన్నప్పట్నించీ నవలలు రాయాలనుంది. ఎన్నో కథలు రాశాను. నా మనసులో ఎన్నో భావాలు మెదులుతుంటాయి. అన్నీ పేపర్ మీద పెట్టాలనుంటుంది. కానీ ఏం లాభం. వాటిని పత్రికలకెలా పంపాలో తెలియదు. అందుకే దయచేసి వాటి వివరాలు తెలియజెయ్యరూ?

జ : శ్రీదేవీ! మీ సుదీర్ఘ లేఖ చదివాను. మీ ఆరాటం అర్థం అయింది. ప్రతి పత్రికలోనూ వాళ్ళ అడ్రస్ వుంటుంది. ఆ అడ్రస్‌కి మీ రచనలు తెల్ల కాగితాల మీద ఒకే వైపు నీట్‌గా రాసి పంపండి: అవి ప్రచురణార్హం అయితే మీకు తెలియపరుస్తారు, సంపాదకులు. వాళ్ళకి మీరేం డబ్బివ్వక్కర లేదు. వాళ్ళే మీ రచన ప్రచురిస్తే పారితోషికం పంపుతారు. ఇంక మొదలుపెట్టండి. విష్ యు బెస్టాఫ్ లక్.

ఆర్. సీత, ఆర్. రామేశ్వరి, బాలమ్మ, మిర్యాలగూడా

ప్ర : సూపర్ రైటర్‌గారూ! మీ "క్లిక్ - క్లిక్- క్లిక్" సినిమాగా తీస్తున్నారన్నారు. ఏమయిందండీ? మాకు ఆ నవలంటే చచ్చే ఇష్టం. దాన్ని సినిమాగా చూడాలని మహా ఆత్రంగా వుంది.

జ : మీకా సంగతి ఇంకా గుర్తుందా ఫ్రెండ్స్! నేనెప్పుడో మర్చిపోయాను. మీకు ఆ నవల నచ్చినందుకు కృతజ్ఞతలు.

కె. రవీంద్ర, హైదరాబాద్

ప్ర : సూపర్ రైటర్‌గారూ! మీరు మధురంగా పాడగలరని విన్నాను. మీ తియ్యని గానాన్ని ఓసారి మా అందరికీ వినిపించరూ?

జ : మీ అభిమానానికి థాంక్స్! నేను పాడగలను గానీ మధురంగా అనడానికి వీల్లేదు. ఇప్పుడు మరీను. ఎందుకంటే ఈ రచనా వ్యాసంగం చేపట్టాక సంగీతలక్ష్మి అలిగింది నామీద.

## ఉత్తమ ప్రశ్న

సి. హెచ్. సీతా సాంబశివరావు, పెదపూడి

ప్ర: సువర్ణాకన్నన్ గారూ! భార్య భర్త పేరును తన పేరుతో కలుపు కోవడం, ఆమె వ్యక్తిత్వానికి, స్వాతంత్ర్యానికి ఎఘాతం అంటారు కొందరు. అలాంటి వారిని, భార్యా భర్తల మధ్య నుండే ఆత్మీయత, అనుబంధం తెలియని వారనాలా! అనుభూతు లందుకోలేని హృదయాలను కోవాలా?

జ: మీరేం అనుకో వద్దు. వాళ్ళ మానాన వాళ్ళ నుండ నివ్వండి. నా మటుకు నాకు భర్త పేరు భార్య పేరుతో కలిపి పెట్టుకుంటే వారిద్దరూ మరింత సన్నిహితు లవుతారని పిస్తుంది. నా వ్యక్తిత్వానికి, నా స్వాతంత్ర్యానికీ మా వారుగానీ, మా పిల్లలు గానీ ఏనాడూ అడ్డురారు. కమలానెహ్రూ, సరోజినీ నాయుడు, ఇందిరా గాంధీ లాంటి స్త్రీల వ్యక్తిత్వానిగ్గానీ, స్వాతంత్ర్యానిగ్గానీ ఏం లోటొచ్చిందట! అందుకే అలాంటి వాళ్ళ మాటలు పట్టించు కోకండి. ఎవరిష్టాలు వాళ్ళవి.

గోగినేని నాగ సూర్యప్రకాశరావు, కరీమ్‌నగర్

ప్ర: సువర్ణాకన్నన్‌గారూ! మా యువకులంతా కలిసి మిమ్మల్ని ఇక్కడికి రప్పించి, సన్మానం చెయ్యానుకుంటున్నాం. కాదనరుగా?

జ : అయ్యబాబోయ్! ఎందుకు తమ్ముడూ నామీదంత కోపం?!

పోలోజు వెంకటాచారి, హైదరాబాద్

ప్ర: మీరు నా అభిమాన రచయిత్రి. రసన్, చందనల ప్రేమ గురించి చదువు తున్నంత సేపూ నన్ను నేనే మరిచి పోయాను. మీ కలంలోని బలానికి నా అభినందనలు.

1. ఒకటిన్నర శతాబ్దం తర్వాత మళ్ళీ సతీ సహగమనం జరగడం గురించి రచయిత్రిగా, ఓ స్త్రీగా మీ అభిప్రాయం తెల్పండి!

2. వరకట్నానికి మగాడే కారణ మంటారు కదా. కానీ ఈ దురాచారం సమసి పోవాలంటే ముందు స్త్రీలు మారా లంటాను. స్త్రీగా ఆలోచించక ఓ ప్రముఖ రచయిత్రిగా మీ అభిప్రాయం తెల్పండి.

జ: ముందు, మీకు నా మీదున్న అభిమానానికి నా కృతజ్ఞత లందుకోండి.

1. మనం మళ్ళీ ఆదిమానవుల కాలం కేసి పయనిస్తున్నామనీ, మానవత్వాన్ని మంట గలిపి, దానవత్వానికి పట్టం కడుతున్నామనీ అనిపిస్తుంది.

2. మీ అభిప్రాయంతో చాలావరకు ఏకీభవిస్తాను. 

---

అతను భయంకరంగా నవ్వాడు.

"అరవింద్ ఈ చోటికి రాలేడు. ఒకవేళ వచ్చినా ప్రాణాలతో తిరిగి పోలేడు" అన్నాడు.

అలా అనుకుంటున్నావ్! కానీ అతను ఇక్కడికే కాదు. అవసరం అయితే ఆ స్వర్గానికైనా రాగలడు! బింకంగా అంది కాంతి.

అతను మళ్ళీ నవ్వాడు.

ఆ నవ్వుకి ఒళ్ళు అదోలా ఒణికింది కాంతికి.

"ఈ ... మాట్లకేం గానీ... రేపు రాత్రి మన పెళ్ళి. మా వాళ్ళొచ్చి నిన్ను అలంకరిస్తారు. అంతగా కావాలనుకుంటే ఈ రాత్రంతా నీ అరవింద్‌ని తల్చుకుంటూ పడుకో! కనీసం అతను కల్లోకైనా వస్తాడు!" అన్నాడతను.

ఆమె నీరసించి పోయింది. అతన్ని చూస్తుంటే అరవింద్‌ని బతకనిచ్చేలా లేడు. తన కోసం అరవింద్ రాకుండానూ వుండడు.

"ఎలా?... ఈ దుర్మార్గుడి బారి నించి అరవింద్‌ని కాపాడేదెలా?" అన్న వూహలు ఆమెని ఒణికించేస్తున్నాయి. ఆవేశం దాచుకుని, మళ్ళీ అతన్ని వేడుకుంది.

"అరవింద్ చాలా మంచివాడు. మేమిద్దరం ప్రేమించుకున్నాం! దయచేసి నన్నొదిలెయ్!" అంది చేతులు రెండు జోడించి.

అతను ఆమె మాట వినిపించుకోలేదు.

"అనవసరంగా కంఠ శోష ఎందుకు డార్లింగ్. నువ్వెంత మొర పెట్టుకున్నా నా నిర్ణయం మారదు. నువ్విక్కణ్నించి తప్పించుకుపోనూ లేవు!" అన్నాడతను విలాసంగా.

కాంతి కేం చెయ్యాలో తోచలేదు.

"అన్నట్టు నీ పేరు కాంతి కదూ?... నిజంగానే కాంతిలా వున్నావ్ సుమా! వట్టి కాంతి కాదు! చల్లని చంద్రకాంతిలా!... ఓహ్! నేను అదృష్టవంతుణ్ని!" తన్మయత్వంగా అన్నాడతను.

ఆమెకి పిచ్చ కోపం వచ్చింది.

"ఛ! సిగ్గులేని మనిషి!" అంది పళ్ళు నూరుతూ.

"నిజమే డియర్... నిన్ను చూశాక ఒక్క సిగ్గేం కర్మ నా మతి కూడా పోయింది!" వెకిలిగా అన్నాడతను.

"షటప్! అండ్ గెటవుట్!" అరిచింది కాంతి. (ఇంకా ఉంది)

# ఏ జంటకైనా అనురాగమొకటే

శంభువరం సరోజా సింధూరి

సర్వ లోకాలూ కోల్పోయిన సామ్రాజ్ఞిలా కూర్చుని వుంది మామిడి చెట్టు కొమ్మ మీద ఓ గువ్వ. గుబులుగుబులుగా చుట్టూ చూసి....... దిగులుగా దీనంగా ఓసారి అరిచి ఆ కొమ్మ నుండి మరో కొమ్మ మీదకు గెంతింది.

పార్వతమ్మ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి చూసింది. కొమ్మకొమ్మనూ....... రెమ్మరెమ్మనూ చూపులతో స్పృశిస్తూ మౌనంగా అనుకుంది "దీని జంటగువ్వ ఏమైపోయిందబ్బా? ఏనాడూ ఇలా ఒంటిగా రాలేదే!"

కొమ్మ మీది గువ్వ మళ్ళీ జాలిగా అరిచి పార్వతమ్మ ముందు వాలింది. గుప్పెట్లో వున్న బియ్యాన్ని దాని ముందు చల్లిందామె. వంగి ముక్కుతో ఓ గింజను అందుకోబోయి చప్పున ఆగిపోయిందది. మరి దాని గుండె లోతుల్లో ఏ జ్ఞాపకం మెదిలిందో! ఓ రెండు నిముషాలపాటు పిచ్చిదానిలా అక్కడక్కడే అటూయిటూ తిరిగి ఒక్క గింజయినా ముట్టకనే రివ్వున ఎగిరిపోయింది.

"పాపం..... దీని జత గువ్వ ఏ వేటగాడి బాణం దెబ్బతిని అసువులుబాసిందో? ఏ వానజడికి రెక్కలు చిరిగి నేలకు ఒరిగిందో! లేక..... ఏ తెలియని దిక్కుకు ఎగిరి దిక్కుతోచక దారితప్పిందో" నిశ్శబ్దంగా జాలిపడింది.

మూసుకున్న ఆమె కంటి కొసల నుండి ఓ అశ్రుబిందువు.

మామిడి కొమ్మలమీదుగా పయనించి పార్వతమ్మ చెంపలను మెత్తగా స్పృశించి ఏ దిక్కుకో సాగిపోయింది ఓ పిల్లతెమ్మెర!

కనురెప్పలు చప్పున విప్పిందామె. "ఆబ్బ ఎంత హాయిగా వుందీ స్పర్శ! అచ్చం.... అచ్చం ఆయన చేతి స్పర్శలా. ఎప్పుడైనా తన కంట నీరునిండితే ఆయనా యిలాగే ఓదారుస్తారు. అయినా తన పిచ్చిగాని ఆయన తన ఎదుట కొండంత అండగా నిలబడి వుండగా ఎన్నడైనా తన కంట నీరు నిండిందా? కానీ..... యిప్పుడో....... అనుక్షణం తన కంట కన్నీరే. తుడిచేందుకు ఏదీ.... ఆ అమృతహస్తం? తను ఆ హస్తాన్ని అందుకోగలదు. కానీ..... అందుకోనివ్వదు విధి..... పాడు విధి" నిట్టూర్పులూ, కన్నీళ్ళూ. పోటీ పడుతూ జారుతున్నాయి ఆమె కనులవెంట.

"అత్తయ్యా! మీ అబ్బాయిగారు పిలుస్తున్నారు. ఓ సారిలారండి."

కోడలు రేవతి పిలిచింది.

తడి కళ్ళను పైటకొంగుతో అద్దుకుని ముఖం మీదకు ఓ జీవంలేని నవ్వు తెచ్చుకుని కొడుకు గదివైపు వెళ్ళింది.

"కూర్చోమ్మా" గౌరీనాధ్ చెప్పాడు.

ఒక్కసారి కొడుకు కళ్ళలోకి పరిశీలనగా చూసి కూర్చుందామె. కోడలు రేవతి వచ్చి గుమ్మానికి ఆనుకుని నిలబడింది.

"మీ కోడలికి మళ్ళీ నెల తప్పింది" తల వంచుకుని చెప్పాడు గౌరీనాధ్.

"నా కెందుకు తెలియదురా. రెండో నెల కదమ్మా రేవతీ?" అత్తగారి ప్రశ్నకు ఆమె అవునన్నట్టు తలవూపింది.

"ఏప్రిల్ ఏడవతేదీ ఎల్లుండేనమ్మా. నిన్నొకమాట అడిగి అన్నయ్యకు ఉత్తరం రాద్దామనుకుంటున్నా.



రేవతి పట్టిమనిషి కాదని నీకు తెలుసు. ఇంటిడు చాకిరీ ఒక్కటే చేసుకోవాలంటే కష్టం. కనుక నాన్నని ఈ సంవత్సరం కూడా అక్కడేవుండనిచ్చి..... నిన్ను నేను వుంచేసుకుంటాను. నువ్వయితే దానికి సాయంగా వుంటావు. నాన్నకయితే యిదే చేయాల్సి వస్తుంది."

పార్వతమ్మ ఓ నిముషంపాటు మాట్లాడ లేదు. ఏప్రిల్ ఏడవతేదీ...... ఆ తేదీకోసం ప్రాణాలన్నింటినీ కళ్ళలోపెట్టుకుని ఎదురుచూస్తుంది. కొడుకు లిద్దరూ తమ బంధాన్ని రెండుముక్కలుగా నరికి చెరో ముక్కను పంచుకొన్నాక...... తాత్కాలికంగా కొన్ని గంటలపాటు ఆ బంధాన్ని తిరిగీ అతికేది ఆ ఏప్రిల్ ఏడవతేదీ. సంవత్సరమంతా ఆ కొడుకు దగ్గర గడిపి సరిగ్గా ఏడవ తేదీనాడు ఈ కొడుకును చేరుకుంటాడాయన. ఆ మరుసటి రోజు పార్వతమ్మ ఈ కొడుకును వదిలి ఆ కొడుకు పంచ చేరుతుంది. మళ్ళీ తిరిగి ఏప్రిల్ నెల వచ్చే దాకా ఒకర్నొకరు చూసుకోవడం కుదరదు. తీరా వచ్చేక మళ్ళీ ఆ కొడుకు దగ్గర కీమె, ఈ కొడుకుదగ్గర కాయన.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావ్?" గిరీనాథ్ నొసలు కాస్తంత ముడివడింది.

పార్వతమ్మ ఒక్షణం కోడలువంక చూసింది. 'నిజమే. తను ఈ సమయంలో కోడల్ని వదలటం ఎంతమాత్రం సమంజసం కాదు' మనసులో అనుకుని తిరిగి కొడుకుతో అంది "అలాగేరా.... అలాగేవుంటాను. కానీ.... కానీ...."

"ఏమిటో చెప్పు."

"మీ నాన్నని చూసి సంవత్సరం నిండుతోందిరా. ఇంకెలాగూ ఈ సంవత్సరం నేనిక్కడ వుండిపోవాలిగదా! అందుకని..... అందుకనీ... ఒక్కసారి వెళ్ళి ఆయన్ని చూసివస్తాను."

గిరీనాథ్ ముఖంలో అసహనం పొగలా కమ్ముకుంది. "అమ్మా! నీ కేమైనా తెలివి వుండే మాట్లాడుతున్నావా? పోనూరానూ చార్జీలకే రెండొందలు అవుతాయి. పై ఖర్చులు ఎంతలేదన్నా మరో వంద. దాదాపు నా జీతంలో సగం. సంవత్సరానికి ఓ వంద నీకిచ్చి ఆ ఊరు పంపడానికే నానా అవస్థలూ పడుతున్నాను. ఇలాంటి గొంతెమ్మకోరికలు కోరడానికి నీకు మనసెలా వస్తుంది? మీరేమైనా ఆస్తులు సంపాదించి నాకూ అన్నయ్యకూ చెరో మూటా యిచ్చారా? మీరు చెప్పించిన వానాకాలపు చదువులకు ఏదో గుమాస్తా వుద్యోగం సంపాదించి ఈదలేక ఈదుస్తున్నాం బ్రతుకుల్ని. మమ్మల్నిలా బ్రతకనివ్వండి."

పార్వతమ్మ గుండె పట్టినట్టుగా చూసింది కొడుకువైపు. కళ్ళ నుండి ఉరకబోయిన కన్నీటిని బలవంతంగా ఆపుకుంది.

"ఏదో లేరా..... చూసి చాన్నాళ్ళయితేనూ....."

"నలభై ఏళ్ళపాటు చూసుకున్నారుగా ఒకరి ముఖాలొకరు. ఈ ముసలిముప్పున చూసుకోకపోతే కొంపలేం మునిగిపోవులే."

రేవతి నోటి దురుసు మనిషి అని పార్వతమ్మకు ఏనాడో తెలుసుగాని...... మరీ యింత ఘోరంగా మాటాడగలదని ఈక్షణమే గ్రహించిందామె. నిశ్శబ్దంగా లేచి పెరటివైపు నడిచింది. గుమ్మానికి ఆనుకుని మామిడికొమ్మలకేసి చూసింది.

చిట్టచివరి కొమ్మ మీద నిలబడి ఎనిమిది దిక్కులవంకా వెర్రిగా చూస్తూ..... జాలిగా పిలుస్తోంది ఆ గువ్వ..... తన జత గువ్వను.

"అమ్మా! అమ్మా!" కప్పులెగిరిపోయేలా పిలిచాడు గిరీనాథ్.

కొన్నాళ్ళు తన కడుపులో..... మరికొన్నాళ్ళు తన గుండెల్లో..... యింకొన్నాళ్ళు తనవడిలో తలదాచుకున్న కొడుకు ముందు తలవంచుకుని నిలబడింది పార్వతమ్మ.

"నీకు బుద్ధుందా?"

సకల భూ భారాన్నీ మోస్తున్న భూమాత వంకకు చూస్తూ తన అవమానభారాన్ని భరించింది ఆమె.

"లేదు. లేనేలేదు. అదేవుంటే నువ్విలా అన్నయ్యకు ఉత్తరం రాయవు."

పార్వతమ్మ మనసంతా చేదుగా అయింది. అవును..... నిజమే. తనకు బుద్ధిలేదు. లేకపోతే "బాబూ...... మీ నాన్నను చూడాలనివుందిరా." అని ఒక తల్లిగా కన్నబిడ్డను దేబిరిస్తుందా?

పార్వతమ్మ మౌనం గిరీనాథ్‌ని మరీమరీ రెచ్చగొట్టింది. "ఒరే కన్నా! మీ నాన్న నోసారి పంపరా" అని నీ పెద్దకొడుక్కి ప్రేమగా ఉత్తరం వ్రాసుకున్నావుగా. చూడు..... చూడు వాడేం వ్రాశాడో. ఛార్జీలు నేను పెట్టుకునేట్టయితే పంపిస్తాట్ట. అంతేకాదు..... ఈ ముసలాయనకు



సేవచేయలేక మీ వదిన చస్తోంది . అమ్మనే పంపి పుణ్యంకట్టుకో అని వ్రాశాడు. ఈ గొడవంతా నీ ఉత్తరం మూలంగానే నీకు మేమేం తక్కువ చేస్తున్నాం? నీ ఉత్తరం చూసి ఆ ముసలాయన ఒకటే గోలట అన్నం నీళ్ళూ మానేసి అన్నయ్య ప్రాణాలు తోడేస్తున్నాడట."

ఎన్నిమాటలన్నా పెదవి విప్పని పార్వతమ్మ అప్పుడు పెదవి విప్పింది. "అన్నం, నీళ్ళూ మానేస్తున్నారా ఆయన?"

"ఆ(.... ఒకపూట మానేసినా, రెండోపూట అంతకంతా లాగిస్తాడ్లే. నువ్వేం బెంగపెట్టుకోకు."

ఈ భూమి బ్రద్దలై నన్ను తనలో ఇముడ్చుకోకూడదా అనుకుంది గుండె బ్రద్దలైన పార్వతమ్మ

"ఛీ...ఛీ పెద్దలన్నాక పిల్లల అవస్థలు అర్థం చేసుకోవాలి గాని వాళ్ళే పిల్లలై మారాం చేస్తూ అదీ ఇదీ కావాలని అల్లరి పెడుతుంటే ఏమైపోవాలి నాలాంటి వాళ్ళ సంసారాలు!' గౌరీనాథ్ చరచరలాడుతూ వెళ్ళిపోయాడు

"ఏది కావాలని అల్లరి పెట్టాను?" ఆలోచించుకుంటూ ఆకాశం వంక చూస్తున్న పార్వతమ్మ తన కాళ్ళ ముందు ఏదో పడినట్టయి ఉలిక్కిపడి నేలవంక చూసింది

మామిడి కొమ్మల్లోంచి జారి నేల కొరిగింది చిక్కిశల్యమైన గువ్వపిట్ట కొన వూపిరితో వున్నట్టూ దాని ఉచ్ఛ్వాస నిశ్వాసలే చెబుతున్నాయి.

పార్వతమ్మ చటుక్కున దాన్ని దోసిట్లోకి తీసుకుని గుండెల కదుముకుంది "గువ్వా! ఏమైందమ్మా" ఆమె కంటి నుండి జారిన నీటి చుక్క అడిగింది.

"నా చెలికాడెందుకో నను వీడి వెళ్ళాడు. ఎదురు చూపుల తోటి నా ఎదలెండి పోతున్నా అతడు మరలి రాలేదు. అందుకే అతడి అడుగు జాడలు పట్టుకునీ నేనే వెళుతున్నా" ఆ గువ్వ ఆర్తిగా పార్వతమ్మ కళ్ళలోకి చూసి మెల్లగా కనురెప్పలు మూసుకుంది.

ఓ రెండు క్షణాలు నిశ్శబ్దంగా గడిచాక... పార్వతమ్మ ఆ గువ్వను తన గుండె నుండి వేరు చేసి దాని గుండెను చెవికి ఆనించుకుంది. ఏ చప్పుళ్ళూ ఆమె చెవికి చేరలేదు.

పుల్లతో గొయ్యి తీసి దాన్ని అందులో వేసి మట్టి కప్పేసింది. "ఎంత నిశ్శబ్దంగా చేరుకున్నావ్ నీ ప్రియుడి లోకాన్ని" ఆమె గుండె పగలగా రాలిన అశ్రువులు ఆ మట్టిని తడిపేశాయి.

ఆ తడిసిన మట్టినే తదేకంగా చూస్తున్న పార్వతమ్మ కళ్ళలో ఛమక్ మంటూ మెరిసిందో మెరుపు.

"నేనూ ఈ గువ్వలా చచ్చిపోతే తప్పకుండా .. తప్పకుండా నన్ను చూడటానికి ఆయన వస్తారు కదూ. అప్పుడైతే కొడుకులు అప్పైనా చేసి ఆయన్ను తీసుకు వస్తారు కదూ." ఉత్సాహంగా ఆలోచిస్తున్న పార్వతమ్మ చప్పున ఆగిపోయింది.

"ఆయన వచ్చీ ఏం లాభం? ఆయన్ను చూడటానికి తను వుండదుగా? మరెలా? ఈ జన్మకు ఆయన్ను చూసే అదృష్టం లేదా! ఎందుకు చూడదూ!... ఈ సంవత్సరం గడిచాక మళ్ళీ ఏప్రిల్ ఏదో తేదీ వస్తుందిగా. అమ్మో!.. సంవత్సరం అంటే మాటలా? పన్నెండు నెలలు– మూడు వందల అరవై అయిదు రోజులు, ఇన్ని రోజులు గడిచేలోగా ఎవరం వుంటామో ఎవరం పోతామో! అసలప్పుడైనా ఈ కొడుకులు తమని ఒకర్ని ఒకరిని చూసుకోనిస్తారా? ఎలా .. మరెలా ఆయన్ను చూడటం? చచ్చిపోతేనే. .. తను చచ్చిపోతేనే అది సాధ్యం."

గబగబ నాలుగడుగులు వేసిన పార్వతమ్మ పక్కింటావిడతో మాట్లాడుతున్న కోడల్ని... కాదు.. కాదు ఆమె మాటల్ని విని చివుక్కున ఆగిపోయింది

"మన పై వీధిలో కాంతం లేదూ పిన్నిగారూ. ఆవిడ ... వాళ్ళన్నయ్య చనిపోయాడని లబోదిబో మంటూ వెళ్ళిందా... అంతా వచ్చేదే ఆయన నిక్షేపంలా వున్నాట్ట. ఏదో కాకి శోకమట. కాకులు జత కట్టేప్పుడు ఆ మహానుభావుడు చూశాడట. అది దోషమనీ అందరికీ ఆయన పోయినట్టు ఉత్తరాలు వేయించారు. పాపం ... కాంతం అనవసరపు ఖర్చంటూ నెత్తీ నోరు బాదుకుంది అయినా అన్నయ్య చీరెలూ సారెలూ పెట్టే పంపేడటలెండి "

పార్వతమ్మ గుండెల్లో కోటి కోకిలలు ఒక్కసారిగా అరిచినట్టు అనిపించింది. "అవును తను చచ్చిపోయినట్టు పెద్దాడికి టెలిగ్రాం ఇస్తుంది. దాంతో వాడు చచ్చినట్టూ ఆయన్ను తీసుకు వస్తాడు. కొడుకులు తిడతారా. తిట్టనీ కొడతారా.. కొట్టనీ. అసలిక్కడ వీళ్ళ కొంపల్లో వుండబోయే దెవరు? తనూ ఆయనా కలిసి దూరంగా వెళ్ళిపోతారు బ్రతకడం చేతకాకపోదు కాకపోయినా పర్లేదు" ఆమె గట్టిగా ఓ నిశ్వయానికి వచ్చింది.

పార్వతమ్మ కోడల్ని కేకేసి చెప్పింది "రేవతీ! గుడి దాకా వెళ్ళొస్తాను మనసేం బాగోలేదు."

రేవతి ఏ కళ నుందో వద్దని అన్లేదు. పార్వతమ్మ కాళ్ళు వేగంగా పోస్టాఫీస్ వైపు నడిచాయి. టెలిగ్రామ్సు విభాగం దగ్గిర ఆగి చెప్పిందామె ఒక వ్యక్తితో "బాబూ! పార్వతమ్మ అనే ఆవిడ చచ్చిపోయింది. ఇదో ఈ అడ్రస్‌కు టెలిగ్రామ్ ఇవ్వు నాయనా "

* * *

ఒకరోజు గడిచింది ఒక యుగంలా

ఆశతో.. ఆనందంతో.. భయంతో.

ఆందోళనతో వూగి పోతోంది పార్వతమ్మ మనసు.

"పార్వతీ! రెక్కలు ముక్కలు చేసుకునీ బిడ్డల్ని సాకాం. వాళ్ళ సంసారాలు వాళ్ళకు ఏర్పడ్డాయి ఇద్దరం ఒక చోటుంటే వాళ్ళకీ భారమే. తలో చోటా బ్రతకాలంటే మనకీ బాధాకరమే అందుకే పార్వతీ... మనం మన దారి చూసుకుందాం. వయసు పండిన ఆశలనూ పూసులను కలబోసుకుంటూ బ్రతుకుదాం. భర్తగా నిన్ను బ్రతికించుకోలేక పోలేను.

ఎవరంటున్నారలా?

ఆమె చుట్టూ చూసింది. ఛ్. ఎవరూ లేరు అయినా ఎంత కమ్మని అనుభూతి! ఇదే నిజమైతే!

మరో రోజు గడిచింది మరో యుగంలా.

"డబ్బు యావలో పడి మీరూ మనుష్యులేననీ... మీకూ అభిమానాలూ .. అనురాగాలూ వుంటాయనీ గుర్తించలేక పోయాం. మమ్మల్ని క్షమించండి నాన్నా'

ఎంత తీయని దృశ్యం!... ఇది కల కాకుంటే!

ఇంకో రోజు గడిచింది.... ఇంకో యుగంలా...



కలలూ... వూహలూ మరిచి వాస్తవలోకంలో నిలబడి నిరీక్షిస్తోంది పార్వతమ్మ.

ఏ రిక్షా సవ్వడి విన్నా ఉలిక్కిపడుతుంది. ఏ పాదాల అలికిడి అయినా తత్తరపాటుతో లేస్తుంది.

"ఏమిటీ? నేను చచ్చిపోయానని వ్రాసినా ఆయన రాలేదు. ఇంత కఠినుడా తన కొడుకు?" కదిలీకదలని ఆమె పెదవులలో వందసార్లు దొర్లాయా మాటలు.

సరిగ్గా నాలుగో రోజు ఉదయం పది గంటలకు పోస్ట్‌మేన్ 'పోస్ట్' అంటూ కేకవేసి కేకతో పాటూ ఓ ఉత్తరాన్ని గిరాటేశాడు.

పార్వతమ్మ చప్పున ఆ ఉత్తరాన్ని అందుకుని అటూ ఇటూ చూసి తన గదిలోకి వెళ్ళి తలుపు మూసుకుంది ఎడ్రస్ వంక పరిశీలనగా చూసి అది తన పెద్దకొడుకు వ్రాతేనని అర్థం చేసుకుంది.

'ఏం రాశాడో ఏం పాడో.. ఇది చిన్నకొడుకు కళ్ళ పడక పోవడమే మంచిది' మౌనంగా అనుకుని చింపబోయింది.

"అత్తయ్యా" రేవతి వంట గదిలోంచి పిలిచింది.

"వస్తున్నానమ్మా" పార్వతమ్మ ఆ ఉత్తరాన్ని జాగ్రత్తగా బొడ్లో దోపుకుని వంటింటి వైపెళ్ళింది.

"పోస్ట్ అని కేక పెట్టాడు... ఏదైనా ఉత్తరం వచ్చిందా?" అడిగింది రేవతి.

"లేదమ్మా.. పక్కింటి గుమ్మంలోనమ్మా అతడరిచింది."

"సర్లే .. బెండకాయలు తరగండి."

పార్వతమ్మ పనిలో మునిగిపోయింది. సాయంత్రం నాలుగ్గంటల వేళ రేవతి స్నానానికి వెళ్ళింది. కొడుకు ఆఫీసు నుండి రావడానికి ఇంకా రెండు గంటల టైముంది.

మెల్లగా ఉత్తరాన్ని తీసింది. కళ్ళకున్న అద్దాలు సవరించుకుని చదవడం మొదలెట్టింది.

"ప్రియమైన తమ్ముడు గౌరీనాథ్‌కి మీ అన్నయ్య రఘునాథ్ వ్రాస్తున్న ఉత్తరం.

తమ్ముడూ! ఇంత దురదృష్టకరమైన సంఘటన బహుశా ఎవరి జీవితాల్లో జరిగి వుండదేమో! నిజంగా విధి వ్రాత ఒక్కొక్కరి పట్ల ఎంత విచిత్రంగా వుంటుందో నా కిప్పుడే తెలిసింది. అమ్మ పోయినట్టు నువ్వు టెలిగ్రామ్ ఇచ్చావు. అది నాన్న చేతికే చేరింది ఆ వార్త చదివిన వెంటనే ఆయన గుండె ఆగి మరణించారు. అటు తల్లి మరణం... ఇటు తండ్రి మరణం. దిక్కు తోచక విలవిలలాడి పోయాను. కొందరు శ్రేయోభిలాషులు ఈ విషయాన్ని... ముందే అమ్మ మరణంతో కృంగి వున్న నీకు తెలపటం అంత మంచిది కాదన్నారు. ఎటూ అమ్మ కర్మకాండ నువ్వు పూర్తి చేస్తావు ఇక్కడ నాన్న కర్మకాండ నేను చేస్తాను అనే వుద్దేశ్యంతో నీకు టెలిగ్రామ్ ఇవ్వలేదు ఎందుకోరా నాకు చాలా బాధగా భరించ లేనంత గుండె కోతగా వుంది. అమ్మ కోర్కెను మన్నించి నాన్నను అక్కడికి పంపినా బావుండేదేమో! ఏది ఏమైనప్పటికీ ఇద్దరూ మనల్ని వదిలి వెళ్ళారు కొడుకులుగా వారికి న్యాయమే చేశామో... అన్యాయమే చేశామో గాని వాళ్ళిద్దరూ మనల్ని అన్యాయం చేసి ఒక్కసారిగా రెక్కలు కట్టుకు ఎగిరిపోయారు. నాన్న మరణవార్త నీకు తెలపనందుకు నన్ను క్షమించు. అమ్మ శవాన్ని ప్రక్కనుంచుకుని ఏడుస్తున్న నువ్వు ఈ వార్త భరించ లేవనే తెలపలేదు. మరో వుద్దేశ్యం ఏమీ లేదు. త్వరలో మీ వూరు వచ్చి ముఖాముఖి మాట్లాడతాను.

ఇట్లు
మీ అన్నయ్య – రఘునాథ్

"అమ్మా! ఎక్కడ్నుంచే వుత్తరం?" ఎందుకో ఆ రోజు ఆఫీసు నుండి పెందలాడే వచ్చిన గౌరీనాథ్ అడిగాడు కుర్చీలో కూర్చుంటూ. "పొద్దున నేనడిగితే ఉత్తరమే రాలేదన్నారే అత్తయ్యా" స్నానం చేసి చీర కట్టుకుని తలార్చుకుంటూ వచ్చింది రేవతి

పార్వతమ్మ చూపులు నిస్తేజంగా... నిర్వేదంగా ఏ దూర తీరాల్లోకో చొచ్చుకుని పోతున్నాయి.

స్వర్గంలో ఒక మనోజ్ఞమైన తోట. అందులో వృక్షాలన్నీ అపరంజి వృక్షాలే. రత్నాలూ . ముత్యాల పూలు .. పచ్చలు ఆకులు. . మాణిక్యాలు ఫలాలు అలాంటి అద్భుతమైన చెట్టు కొమ్మ మీద కూర్చుని కువకువ లాడుతోంది ఓ గువ్వల జంట

ఆ చెట్టు క్రింద ఎదురెదురుగా కూర్చుని తలలెత్తి మురిసి పోతూ చూస్తున్నారు ఆ గువ్వల కేసి పార్వతమ్మా . ఆమె భర్త.

"అమ్మా! మతి పోయిందేమిటి? ఉత్తర మెక్కడ నుండే అంటే పలకవు"

గౌరీనాథ్ చివుక్కున లేచి పార్వతమ్మ చేతుల్లోంచి ఉత్తరాన్ని లాక్కున్నట్టుగా తీసుకున్నాడు

అంతే ఒక గాలి వూపుకి పండుటాకు నేల రాలినట్టూ... ఒక నీటి కెరటం తాపుకి ఇసుక మేడ కూలిపోయినట్టూ.. నిశ్శబ్దంగా ప్రక్కకు ఒరిగిపోయింది పార్వతమ్మ తల ☐



# న్యాయపీఠం



బి.బి.రావు. ఎమ్.ఏ.ఎల్ఎల్.బి.

## విదేశాలపై దావా వెయ్యవచ్చు

హర్‌భజన్‌సింగ్ థల్లా 1976లో ఢిల్లీలో ఉన్న అల్జీరియా రాయబారి భవనాలకు మరమ్మత్తు పనులు చేసాడు. రు. 29,000 లకు బిల్లు ఇచ్చాడు. కాని అల్జీరియా రాయబారి బిల్లు మొత్తం చెల్లించి వేసినట్లు భారత ప్రభుత్వానికి తెలియజేశాడు కాని థల్లా మొత్తం బిల్లు చెల్లించలేదని వడ్డీతో కలిపి 27,000 రూపాయలకు అల్జీరియా దేశంపై దావా వెయ్యడానికి భారత ప్రభుత్వానికి పిటిషన్ పెట్టుకున్నాడు. కాని భారత ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు. థల్లా సుప్రీమ్ కోర్టులో రిట్ పిటిషన్ వేశాడు. సివిల్ ప్రొసీజర్ కోడ్‌లో 86 సెక్షన్ క్రింద అనుమతి ఇవ్వవలెనని సుప్రీమ్ కోర్టుకు విన్నవించుకున్నాడు భారత ప్రభుత్వం తన కౌంటర్ ఎఫిడవిట్‌లో థల్లా పిటిషన్‌లో కొన్ని వివాదగ్రస్తమైన వాస్తవాలున్నాయని, వాటిమీద చర్య తీసుకోనవసరం లేదని సుప్రీమ్ కోర్టుకు తెలియపర్చారు. సుప్రీమ్ కోర్టువారు ఈ వాదనతో ఏకీభవించలేదు. థల్లా అల్జీరియా రాయబారి కార్యాలయానికి మరమ్మత్తులు చేశాడు. అతనికి న్యాయంగా రావలసిన డబ్బు చెల్లించక తప్పదు. వివాదాస్పదమైన లెక్కలు ఉండవచ్చును. అవి న్యాయంగా పరిష్కరించుకోవాలి. అంతేకాని భారత ప్రభుత్వం తనకు తోచిన రీతిలో తిరస్కరించడానికి వీలులేదు. 1983వ సంవత్సరం నవంబర్ 26వ తేదీన రాజకీయ కారణాలవలన అల్జీరియా ప్రభుత్వంపై దావా వెయ్యడానికి అనుమతి నిరాకరించడం జరిగిందని భారత ప్రభుత్వం థల్లాకు తెలియపర్చారు. కారణాలు తెలుపకుండా పిటిషన్ తిరస్కరించడం న్యాయం కాదని సుప్రీమ్ కోర్టు వారు అభిప్రాయపడ్డారు. దావా వ్యవహారాలు కోర్టులు పరిష్కరించాలి కాని భారత ప్రభుత్వం కాదు. అందుచేత భారత ప్రభుత్వం మరోసారి పరిశీలించి కారణాలు తెలుపుతూ ఆర్డరు జారీ చెయ్యాలి. అల్జీరియా ప్రభుత్వంతో భారత ప్రభుత్వం సమాలోచనలు జరిపి తగువు పరిష్కారానికి మధ్యవర్తిని నియమించవచ్చును. లేదా మరో న్యాయమైన పరిష్కారం చెయ్యవచ్చును అని సుప్రీమ్ కోర్టువారు 1986లో తీర్పు చెప్పారు. ☐

సీరియల్

# డి.ఎస్.పి.విజయ్

ఆమూరి సావిత్రి



## (గత సంచిక తరువాయి)

**అనుమానమే తప్ప ఆ దొంగతనం చెంచులు చేశారన టానికి ఏ ఆధారమూ లేదు. కేసును సరిగ్గా డీల్ చెయ్యగల తెలివి తేటలు లేని జగన్నాధంకు ఇలా ఎవర్నో ఒకర్ని అరెస్ట్ చేసి అర్పాటం చెయ్యటం మామూలే....**

**అనవసరమైన అధికారాన్ని.... నిరంకుశత్వాన్ని ప్రదర్శించటంలో అతనికతనే సాటి. అసలు దొంగలు డబ్బు దస్కంతో అతని నోరు మూసి జారుకుంటూ ఉంటారు.**

**అతని పరిధిలో దొంగతనాలు చెయ్యటం చాలా తేలిక....**

**గురప్ప వెనకాల నిలబడ్డ పదమూడేళ్ళ పిల్లను చూసి మేకను చూసిన పులిలా ఆనందపడి పోతున్నాడు జగన్నాధం.**

యవ్వనంలో అప్పుడప్పుడే అడుగు పెట్టబోతున్న ఆ అమ్మాయి లేత గుండెలు అతనిలో ఒక రకమైన పైశాచికత్వాన్ని ప్రేరేపిస్తున్నాయి

చితిపి పారెయ్యాలి దీన్ని!' బాధ భరించలేక ఆ పిల్ల కెవ్వున వెయ్యబోయే కేకల్ని తలుచుకుంటే తిమ్మిరెక్కి పోతోందతనికి

'రాత్రికి లాకప్‌లో దీన్ని పీల్చి పారెయ్యాలి అనుకుంటున్నాడు

చెదురు మదురుగా ఉండే జగన్నాధం లాంటి నీచుల మూలానే మొత్తం పోలీస్ డిపార్ట్‌మెంట్ ప్రతిష్ఠ దిగజారి పోయి ప్రజల దృష్టిలో పోలీసు లంటే హీనమైన, నీచమైన అభిప్రాయం ఏర్పడటానికి కారణ మవుతోంది

ఎక్కడైనా అల్లర్లు జరిగి ఓ గుంపు గూడినప్పుడు రాళ్ళు రువ్వటం అనేది సాదారణంగా ఎర్ర టోపీల్ని చూశాకనే మొదలవు తుంది రాళ్ళన్నీ ఒక్కుమ్మడిగా పోలీసులకే గురి పెట్టబడతాయి

పోలీసు లంటే ఇంతటి కసి ప్రజల్లో ఏర్పడటానికి ముఖ్య కారకులు జగన్నాదం లాంటి వాళ్ళే

ఇలాంటి వాళ్ళు నూటికి పది మంది వున్నా, మిగిలిన తొంభై మంది విజయ్ లాంటి వాళ్ళ మంచితనం ఒక్క తృటిలో ఎగిరి పోతుంది వాళ్ళ శ్రమ నిజాయితీ బూడిదలో పోసిన పన్నీరులా అవుతుంది

ఆ డిపార్ట్‌మెంటును పట్టి పీడిస్తున్న ఇలాంటి చీడ పురుగుల్ని వదిలించ గలిగితే ప్రజలకు పోలీసు లంటే ఉన్న శతృత్వం చాలా వరకూ సమసి పోతుంది

> జరిగిన కథ –23 : వైజయంతిని పెళ్ళి చేసుకుని వచ్చిన విజయ్‌ని శమంతకమణి వెళ్ళగొడుతుంది వైజయంతిని అవమానిస్తుంది విజయ్‌కి జగదీష్ పరిచయమవుతాడు గోదావరి వరదల్లో మాధవరావు కుటుంబం కొట్టుకు పోతుంది వైజయంతి ఏమయిందో తెలియదు విజయ్‌కి ఊరట కలిగించడానికి జగదీష్ ప్రయత్నిస్తుంటాడు కొత్త సి ఐ. జగన్నాధంకు విజయ్ పట్ల వ్యతిరేకత కలుగుతుంది

ఏరా? చెప్పు మిగతా వాళ్ళెక్కడున్నారు? ఆ సొమ్ము లెక్కడ దాచారు? అంటూ శివ మెత్తిన వాడిలా ఊగిపోతూ గురప్పను మోదేస్తున్నాడు సి ఐ

తండ్రి నాస్థితిలో చూస్తున్న ఆ పిల్ల గోడు గోడున విలపిస్తోంది

దెబ్బల కోర్చుకోలేక కింద పడిపోయిన గురప్ప చేతి వేళ్ళు జగన్నాధం బూట్ల కింద పచ్చడయి పోతున్నాయి

నాకు తెలవదు బోనాలమ్మ తల్లి తోడు నేనెప్పుడూ దొంగతనాల్జెయ్యను నన్నొదలండి సామీ పోనీ నా బిడ్డ నయినా మా గూడానికి పంపెయ్యండి ' అంటూ హీనస్వరంతో బ్రతిమాలు తున్నాడు గురప్ప

పంపిస్తా గూడానికే పంపిస్తా!" అంటూ ఆ పిల్ల వేపు తిరిగి, కీచకుడిలా నవ్వుతూ, "ఏమే? గూడాని కెడతావా? నా చేత శోభనం చేయించుకుని అప్పుడెడుదువుగాని గూడానికి " అంటూ ఆ పిల్ల గుండెల మీద చెయ్యి వేసి నొక్కాడు జగన్నాధం

బాధకు తట్టుకోలేక గిలార్చుకు పోతూ అరుస్తోందా పిల్ల

గురప్ప రక్తం మరిగి పోతోంది

ఆవేశం ఆపుకోలేక కాండ్రించి ఉమ్మేశాడు

అంతే!

అగ్నిపర్వతం భళ్ళున పగిలి లావా వెదజల్లు తున్నట్లు గురప్ప మీద పడ్డాడు జగన్నాధం

నెత్తుటి ముద్దలా మారేవరకూ అతన్ని వాయించి 'వీణ్ణి లాకప్‌లో పారెయ్యండి ఆ ముండని కూడా అన్నాడు

"నేను అన్నం తిని మళ్ళీ వస్తాను వీళ్ళని జాగ్రత్తగా కాపలా కాయండి అని చెప్పి వెళ్ళిపోయాడు జగన్నాధం

జరుగుతున్న తతంగ మంతా ప్రేక్షకుడలా చూస్తున్నాడో యువ కానిస్టేబుల్

అతని పేరు దయానిధి పోస్ట్ గ్రాడ్యుయేట్' కుటుంబ పోషణ భారం తనమీదే ఉండటంతో అనేక రంగాల్లో అతి చిన్న ఉద్యోగాల క్కూడా ప్రయత్నించి విఫలుడై చివరకు కానిస్టేబులయ్యాడు

"విద్యని బట్టి మనిషిని గౌరవించటానికిది రాజుల నాటి కాలం కాదు

ప్రస్తుత నాగరిక ప్రపంచంలో మనిషి చేసే ఉద్యోగాన్ని, హోదాని బట్టి మాత్రమే మనిషికో విలువ ఆపాదించబడుతుంది

దయానిధి పోస్ట్ గ్రాడ్యుయేటయినంత మాత్రాన మిగిలిన వాళ్ళకన్నా ఎక్కువ ఆధిక్యత అతనికేం ఇవ్వరు

పై ఆఫీసర్ బూతులు తిట్టినా హీనంగా చూసినా చచ్చినట్లు పడుండాల్సిందే.

అందరిలాగా యూనియన్లంటూ తమ వాళ్ళను కూడగట్టుకుని పై వాళ్ళమీద తిరగబడటానికా డిపార్ట్‌మెంటులో చాన్సుండదు

పసితనం వీడని ఒక అమాయకురాలైన ఆడపిల్లను తన కళ్ళెదురుగానే సి ఐ అవమానిస్తుంటే నిస్సహాయంగా కళ్ళప్పగించి చూస్తూ ఊరుకోవాల్సి వచ్చిన తన పరిస్థితికి తనే కించపడుతున్నాడు దయానిధి

సి. ఐ. నుద్దేసించి తను పెదవి విప్పి ఒక్క మాటంటే ఏం జరుగుతుందో అతనికి బాగా తెలుసు.

ప్రజలు పోలీసుల్ని కీచకులుగా.... రాక్షసులుగా ఎందుకు అభివర్ణిస్తారో ప్రత్యక్షంగా తెలుస్తోందతనికి.

ఆ పిల్లపట్ల జాలితో నిండిపోతోందతని మనసు. ఎవరైనా హఠాత్తుగా వచ్చి, సి.ఐ. గురప్పను తన్నినట్లు అతన్ని తన్ని, ఆ పిల్ల మీద అఘాయిత్యం చెయ్యబోయిన నేరానికతన్ని సస్పెండ్ చేస్తే బావుండుననిపిస్తోంది.

తమకున్న అసాధారణాధికారాన్నుపయోగించి, అమాయక ప్రజల్ని ఎందులోనో ఇరికించి పట్టుకొచ్చి మానభంగాలు.... ప్రాణ భంగాలు చేసే ఈ జగన్నాధం లాంటి వాళ్ళ విషయం పట్టించుకునే ఓపికా, తీరికా ఎవరికున్నాయి?

రాత్రికి శుభ్రంగా తిని, తాగి దర్జాగా వచ్చి జగన్నాధం ఈ పిల్ల బతుకును సర్వ నాశనం చేస్తాడు.

తన కళ్ళ ఎదురుగానే జరగబోయే ఈ దారుణాన్ని ఎలా ఆపాలి? ప్రవాహ



# నాకు నచ్చిన సన్నివేశం



శీలాన్ని కోల్పోయి బాధపడుతున్న సౌందర్యతో విజయ్ అన్న మాటలు ఆత్మస్థైర్యాన్ని పెంపొందించేటట్టుగా ఉన్నాయి.

"... అలా జరిగిందని నెత్తిన చేతులు పెట్టుకుని ఏడుస్తూ నిరాశతో ఏ మూలో మిగిలిన పచ్చదనాన్ని కూడా నాశనం చేసుకొనే వాళ్ళు నా దృష్టిలో మూర్ఖులు. ఓర్పుతో ఆ లోటును బాగు చేసుకొని తిరిగి అలాంటి పశువులకు అవకాశం ఇవ్వకుండా గడచిన అనుభవం తాలూకు చేదు ఇచ్చిన వివేకంతో మనిషికి, పశువుకి తేడా తెలుసుకొని



జీవితాన్ని గడపగలిగిన వాళ్ళు వివేకవంతులు. మీరు రెండో రకంగా ఉండాలని నా ఆశ".

ఈ మాటలు నిజంగా కళ్ళెదుట దృశ్యాన్ని చూస్తున్నట్టుగా అన్పించింది. మనసుకు హత్తుకు పోయే టట్టుగా ఉన్న రచయిత్రిగారి కథా విధానం నాకు బాగా నచ్చింది.

– సిహెచ్. రాణి, మారుటేరు (ప.గో.)

* * *

లోపల బ్లూఫిలిం తియ్యటానికి కావలసిన అన్నీ ఏర్పాట్లు చెయ్యబడి వున్నాయి. అక్కడ ఆ తతంగం ప్రారంభమవుతుంది.

క్షణాలు లెక్క పెట్టుకుంటూ టెన్షన్‌గా ఎదురు చూస్తోంది సౌందర్య.

ఆతనికి తెలిసిందా?? వస్తున్నాడా?

ఫోను కూడ చెయ్యవద్దన్నాడు!

అసలతనికి గుర్తుందా?

రాకపోతే!

ఊహు అతనలాంటివాడు కాదు. తప్పకుండా వస్తాడు. అన్యమనస్కంగా వాళ్ళు చెప్పినట్లు చేస్తున్న సౌందర్య చెవులు ఏ శబ్దం కోసమో ఆతృతగా ఎదురు చూస్తున్నాయి.

ఆమె పడిన ఆ టెన్షన్ నాకు బాగా



నచ్చిన సన్నివేశం.

– కొండపి లలిత, ఒంగోలు

* * *

తల్లి గూర్చి బాధపడుతున్న నానీ

వీపు మీద డి. ఎస్. పి. విజయ్ ఆప్యాయంగా చెయ్యి వేస్తాడు. ఎందుక కిటికీ వేపు చూసిన విజయ్ అదిరిపడ అమాంతంగానానీతో సహా అవతలి దొర్లి ఆ పక్కనున్న ద్వారం గుండ గేటు వరకూ మెరుపులా పరిగెత్తి ప్రమాదం నుండి భయటపడతాడు. ఇది అచ్చం సినీ స్టయిల్‌గా ఉంది. కనుక ఈ సన్నివేశం నాకు బాగా నచ్చింది.

– పేర్ని మధుసూదనరావు, చల్లపల్లి (కృష్ణా)

* * *

డి. ఎస్. పి. విజయ్ సీరియల్లో విజయ్ గోగినేనిపల్లె వచ్చినప్పటి నుంచి నానీని విడిపించేంత వరకు

## డి. ఎస్. పి. విజయ్

వేగానికి గడ్డి పోచలా కొట్టుకు పోవటం తప్ప, ఈ సి. ఐ. అధికారం ముందు తనేం నిలవ గలడు?

అలా అని.... ముందు జరగబోయే దారుణం గురించి స్పష్టంగా తెలిసుండి కూడా తను మౌనం వహించాల్సిందేనా?

నో! ఎలాగయినా ఆ పిల్లని కాపాడాలి.

ఎలా?




ఎలా?!

గంటలు గడుస్తున్న కొద్దీ దయానిధిలో టెన్షన్ పెరిగి పోతోంది....

హఠాత్తుగా దయానిధి బుర్రలో ఓ మెరుపు మెరిసింది. సన్నగా విజిలెయ్యబోయి ఆగి పోయాడు....

* * * * * *

గుమ్మంలో నిలువెత్తున నిలబడి ఎర్రటి కళ్ళతో చూస్తున్న జగన్నాధాన్ని చూసి కెవ్వున అరిచి గజగజ ఒణికిపోసాగిందా పిల్ల.

ఆమె కళ్ళలో.... మొహంలో స్పష్టంగా కనిపిస్తున్న ఒణుకు.... బెదురు సరదాగా ఉన్నాయి జగన్నాధంకి. తాగిన విస్కీ ఇప్పుడు నిజమైన కిక్కిస్తున్నట్లుంది....

తన స్థానంలో కామ్‌గా కూర్చుని ఉన్నాడు దయానిధి....

లోపలికి ఒక్కొక్క అడుగే వేస్తున్నాడు జగన్నాధం....

ఆ పిల్ల బిక్క చచ్చిపోయి గోడ కంటుకు పోతోంది. ఆమె దగ్గరగా వెళ్ళి ముందుకు ఒంగాడు....

పెద్దగా అరిచిందా పిల్ల. పెదవి చిట్లి రక్తం కారుతుంటే ఆ రక్తాన్ని నాలుకతో అద్దుకుంటున్న జగన్నాధం రక్తం తాగే రాక్షసుడిలా ఉన్నాడు....

జగన్నాధం చేతులా పిల్ల రవిక ముడి లాగి లోపలికి కదిలాయి....

పీక కొద్ది కొద్దిగా తెగుతున్న కోడిపిల్లలా.... బలిపీఠం మీదున్న మేకలా.... ఆపకుండా హృదయ విదారకంగా అరుస్తోందా పిల్ల....

ఆ కేకలకు దయానిధి గుండె లవిసి పోతున్నాయి.

ఆ పిల్ల చచ్చి పోతుందా?!

సీరియల్ టెన్షన్‌తో కూడుకుంది. విజయ్ గడీలో ప్రవేశించి అక్కడ నానీని చూసి అతనిని తన చాకచక్యంతో విడిపించి తప్పించుకొనేదానికి ఏ మార్గము లేక ముందు వెనుకా ఆలో చించకుండా బిలంలో దూకేస్తాడు. ఆ బిలం దుర్గంధభరితమయినది. గజ ఈతగాడైన విజయ్ రకరకాల పాములు, కీటకాలు శరీరాన్ని కుట్టుతున్నా ఆ నొప్పిని పెదవుల మధ్య బిగబట్టి నానీని వీపు నెక్కించుకొని ఎంతో ధైర్య సాహసాలతో గమ్యం చేరతాడు. గగుర్పాటు కలిగించే ఈ సన్నివేశాన్ని రచయిత్రి తన చక్కని శైలితో పాఠకు లను తన్మయత్వంలో ముంచివేశారు. ఈ



సన్నివేశంలో ఒక పోలీసాఫీసరుకు వుండవలసిన ధైర్యసాహసాలు, త్యాగము రచయిత్రిగారు విజయ్ ద్వారా మనకు కన్నులకు కట్టినట్లు చిత్రీకరించారు. ఈ సన్నివేశం ఈ నవలకే ఒక విధమైన క్రేజ్...

– వై. అనీల్, మదనపల్లి

★ ★ ★

ఆడదాని యవ్వనాన్ని ఒక పూతోటలా, మగవాడిని ఆ పూతోటను సంరక్షించే తోటమాలిగా పోల్చిన పోలిక చాలా బాగుంది. తోటమాలే పశువుగా మారి తనలాంటి కొన్ని పశువుల సాయంతో తోటను ధ్వంసం చేస్తే, నిరాశతో ఏ మూలో మిగిలియున్న పచ్చదనాన్ని కూడా నాశనం చేసుకొనే వాళ్ళు మూర్ఖులు, అవివేకులు అని డి. ఎస్. పి. విజయ్, సౌందర్యతో అనడం, 'కాస్త శ్రమపడి ఓర్పుతో ఆ తోటను బాగు చేసుకొని తిరిగి అలాంటి పశువులకు అవకాశం ఇవ్వకుండా, వివేకంతో మనిషికీ, పశువుకీ తేడా తెలుసుకొని జీవితాన్ని గడపగల్గే వాళ్ళే వివేకవంతులనీ, బ్రతకనేర్చిన వాళ్ళనీ' పిరికిగా ఉన్న సౌందర్యకు ఆపద సమయంలో విజయ్ మానవతా దృక్పథంతో ధైర్యం చెప్పే ఈ



సన్నివేశం ఈ సీరియల్‌కో హైలైట్.

ఓ గొప్ప జీవిత సందేశాన్ని పై సన్నివేశం ద్వారా రచయిత్రి పాఠకులకు అందజేశారు. అందుకే ఆ సన్నివేశం అంటే నాకు మరీ మరీ ఇష్టం.

– మరువాడ నాగరాజ, నాగపూర్

★ ★ ★

చాలా అలసటగా ఉన్న విజయ్ వేడినీళ్ళతో స్నానం చేసి వచ్చేసరికి అప్పటికే ఫ్రెష్‌గా తయారయిన నానీ స్వచ్ఛంగా నవ్వుతూ చాక్లెట్ అందిస్తాడు. తెల్లని బట్టలతో దేవదూతలా ఉన్న నానీని చూస్తూ, "ప్రొద్దున్నే చాక్లెట్ ఇచ్చావెందుకు నానీ" అని అడిగితే, "ఈ రోజు నా "బర్త్‌డే" అని చెప్పగానే, విజయ్ "హేపీ బర్త్‌డే" చెపుతాడు. మమ్మి ప్రతి పుట్టిన రోజునాడు తన దగ్గరకు వచ్చేది అని. ఆ రంగారావు మనుషులే మమ్మిని దాచేసి ఉంటారని, మీరు అతన్ని అరెస్ట్ చేసి జైల్లో పారేస్తే నిజం చెపుతాడుగా అని అమాయకంగా నాని అడిగితే, నానీని ఓదార్చి త్వరలోనే మీ మమ్మిని విడిపిస్తానని వాగ్దానం చేస్తాడు.



ఈ సన్నివేశం నాకు చాల బాగా నచ్చినది.

– పి. కనకదుర్గాదేవి, విజయవాడ □

ఇదేమిటిలా జరుగుతోంది?

తన ప్రయత్నం ఫలించ లేదా?

ఓ గాడ్! ఇంకొద్ది సేపట్లో ఆ పిల్ల చచ్చిపోతుంది!

"తమ కళ్ళెదురుగానే నేరం జరిగితే.... దాని గురించి ప్రశ్నిస్తే ప్రజలు సాక్ష్యం చెప్పరు." అని బ్లేమ్ చేస్తుంటారు తమ డిపార్ట్‌మెంట్ వాళ్ళు. తనూ అలాగే అనుకునే వాడు.

కానీ.... ఇప్పుడు తను? ఈ పిల్ల చస్తే.... రేప్పొద్దున తను సాక్ష్య మిస్తాడా?

ఇవ్వడు.

సాక్ష్య మివ్వలేక పోయినందుకు కుళ్ళి కుళ్ళి చస్తాడే గానీ.... ఇవ్వడు గాక ఇవ్వడు.

ఎవరయినా ఇంతే! ఎవరి భయాలు వాళ్ళవి."

తల్లడిల్లి పోతున్నాడు దయానిధి. ఈ అకృత్యాన్నెలా ఆపాలో తెలియటం లేదతనికి....

ఆ పిల్ల ఒంటి మీద బట్టలు లాగేసి మీద పడ్డాడు జగన్నాధం. కాళ్ళు ముడుచు కుంటూ అతన్ని తోసెయ్యటానికి విఫల ప్రయత్నం చేస్తోందా పిల్ల. ప్రాణాలు కడంటి పోయేలాఏడుస్తోంది....

జగన్నాధం చేతులు.... గోళ్ళు.... పళ్ళు యధేచ్ఛగా ఆమె ఒంటి మీద సరిస్తున్నాయి. ఆమె శరీరాన్ని చించేస్తున్నాయి....

గురప్ప చచ్చిపోయిన వాడిలా ఓ మూల పడున్నాడు....

ఇంత చిన్నపిల్ల తన నిన్ని తిప్పలు పెట్టి లొంగకుండా పోట్లాడుతుందా!

బలమంతా ఉపయోగించి ఆ పిల్లని బిగించి పట్టుకుని వంగబోతున్న జగన్నాధాన్ని ఓ హస్తం విసురుగా వెనక్కి లాగింది. అతన్ని సరిగ్గా నిలబెట్టిన ఆ చెయ్యి ఈడ్చి అతని చెంపని బలంగా తాకింది....

ఆ దెబ్బకే సగం దిగిన మత్తు అక్కడ నిలబడ్డ వ్యక్తిని చూడగానే పొంతం దిగి పోయింది.

పక్కలో బాంబు పడ్డట్టు అదిరి పోయాడు జగన్నాధం.



## డి. ఎస్. పి. విజయ్

అతను డి ఎస్ పి విజయ్!

నిప్పులు కురుస్తున్నాయతని కళ్ళు

ఆ పరిస్థితిలో అతన్నక్కడ ఏ మాత్రం ఊహించని జగన్నాథం ఖంగు తిన్నాడు. చేతులు జోడించి ఏదో అనబోయాడు.

అతనివంక అసహ్యంగా చూస్తూ, "నాకేం చెప్పకు. నీ మీద చర్య తీసుకుంటున్నాను " అన్నాడు విజయ్

దయానిధి వచ్చి ఆ పిల్ల బట్టలు ఆమె కిచ్చాడు. వాటిని చుట్ట బెట్టుకుని, నిలబడే ఓపిక లేనట్లు కూచునే రెండు చేతులూ ఎత్తి విజయ్‌కి నమస్కరించిందా పిల్ల.

ఆమె ఒంటి మీద గాయాలూ... ఆ పిల్ల పసి వయసు చూస్తుంటే మనసంతా దేవినట్లయిందివిజయ్‌కి.. .

సి. ఐ ని పురుగును చూసినట్లు చూసి గురప్పుని, ఆ పిల్లని జీప్‌లో హాస్పటల్‌కి పంపించాడతను..

* * * * * * *

"లాభం లేదు అతన్నక్కడ నుంచి కదిలించే వీలు లేదు." అన్నాడు ఎస్. పి.

"తమరే అట్లా అంటే ఎట్లా సార్! నే నాయన కింద పని చెయ్యలేను " వినయంగా అన్నాడు జగన్నాథం

'ఆయన కింద పని చెయ్యటం సంగతి దేము దెరుగు. ముందు నువ్వు మునిగి పోకుండా చూసుకో."

"సార్... సార్!"

'ఎలాగో రిస్క్ తీసుకుని నీ పీకల మీదికి రాకుండా చూస్తాను ఇప్పటి పరిస్థితుల్లో అదే గ్రేట్. నిన్ను అక్కడి నుంచి ట్రాన్స్ఫర్ చేస్తాను." అన్నాడు ఎస్. పి

ఆ రకంగా జగన్నాథం బయటపడ గలిగాడు

"తమ డిపార్ట్‌మెంటు పరువు ప్రతిష్ఠల్ని ఆ దేవుడు కూడా రక్షించలేడు " నిస్పృహగా అనుకున్నాడు విజయ్.

సి. ఐ పెట్టిన కేసును తన పర్యవేక్షణలో డీల్ చెయ్యటం ప్రారంభించాడు.. ఆ దొంగతనం చేసింది ఒక సెటిల్‌మెంటుకు చెందిన ముఠాగా నిరూపణయింది మొత్తం అంతా పట్టుబడ్డారు...

తాము నిర్దోషులుగా బయట పడటం ఇందుకు విజయ్ కారకుడవటం .. అతని దయవల్ల తన కూతురి జీవితం రక్షింపబడటం .. అతని ద్వారానే తమకు సరైన వైద్యం జరగటం . ఇవన్నీ గురప్ప మనసులో విజయ్ పట్ల ఒక పూజ్యభావం ఏర్పడటానికి దోహదం చేశాయి...

చెంచులు ఒక మనిషిని నమ్మితే . ఆ మనిషి కోసం తమ ప్రాణాల్నయినా ధారపోస్తారు.

విజయ్ ఏది చెప్పినా.... ఎందుకు ఏమిటి అని ప్రశ్నించకుండా చేసెయ్య గల నమ్మకం కృతజ్ఞత గురప్పలో ఏర్పడిపోయాయి. .

"మా గూడానికి రా దొరా" అన్నాడు గురప్ప చేతులు జోడించి.

"వస్తాను. త్వరలో నే వచ్చి మీకు అతిథిగా కొన్నాళ్ళుంటాను" చిరునవ్వుతో అన్నాడు విజయ్.

"తప్పకుండా దొరా! ఎన్నాళ్ళయినా నా కొంపలో నే ఉండొచ్చు. ప్రాణంతో సమంగా చూసుకుంటాం. మా గూడెపు పెద్దని నేనే దొరా. ఎవురూ నా మాట కాదన్రు.' భక్తిగా ఆహ్వానించాడు గురప్ప.

* * * * * * *

అవసరమైన ఎక్విప్‌మెంటంతా సర్దుకుని, మురళీధర్రావుకి అన్ని ఇన్‌స్ట్రక్షన్సూ ఇచ్చి, నానీని కూడా వెంట తీసుకుని, బోనాలమ్మ గుడి వరకూ జీప్‌లో వచ్చి, అక్కడ నుంచి గురప్ప చెప్పిన గుర్తుల ప్రకారం చకచకా అడవి గర్భంలోకి బయల్దేరాడు విజయ్ ...

ఆ దారినపోతే... సాధారణంగా క్రూర మృగాలు ఎదురు పడవు....

చీకటి పడేలోగా గూడానికి చేరుకుంటే చాలు. ..

సాలోచనగా నడుస్తున్నాడు విజయ్ ...

అడవి అందాలని ఇంతింత కన్నులతో కుతూహలంగా చూస్తూ విజయ్ వెనకే నడుస్తున్నాడు నానీ...

ముందు నడుస్తున్న విజయ్ ఉలిక్కిపడి నిలబడ్డాడు. "నానీ ముందుకు రాకు." అంటూ.

తను చూసుకోకుండా వచ్చేస్తున్నాడు తన కతి సమీపంలో పడగెత్తి బుస్సున లేచి నిలబడింది గోధుమ వన్నె తాచు ఎండ పొడకు దాని శరీరం మిలమిలా మెరుస్తోంది

మెదడంతా మొద్దుబారి నట్లయిందతనికి.

తను ఎటు కదిలితే అటే కదులుతున్నట్లుందా తాచు...

ఉన్నట్లుండి తల వెనక్కి విరిచి ముందుకు వంగ బోతోందా పాము..

తన పని అయిపోయిం దన్నట్లు కళ్ళు గట్టిగా మూసుకున్నాడు విజయ్...

నానీ కూడా వెనక నించి విజయ్ షర్టు గట్టిగా పట్టుకుని భయంగా నిలబడ్డాడు....

ఎంతకీ పాము తనను కాటెయ్యక పోవటంతో ఆశ్చర్యంగా కళ్ళు తెరిచాడు విజయ్.

దుప్పటి కింద చేరి ఉక్కిరి బిక్కిరవుతోంది పాము.

"ఒక్క సిటి కాలెస్సమైతే అది మిమ్మల్ని కాటందేది దొరా! ఈ ఏరు ముక్క మూలాన అదట్టా పడుంది. నేను మాదుపాక్కోసమొచ్చి దూరాన్నుంచి మిమ్మల్ని చూసి ఇటు పారొస్తున్నా.. ఇంతలో ఇది శివమెత్తిన దానల్లే ఊగటం చూసి ఏరుముక్కా.... దుప్పటీ ఇసిరేశా ఇంకిదేం చెయ్యదు. నీ కాడా . ఈ కూన కాడా కూడా ఏరు ముక్క లుంచుకోవాల్దొరా!" అంటూ పామును చంపి దాన్ని మంటలో వేసి దణ్ణం పెట్టాడు గురప్ప....

నానీని బుజాన ఎక్కించుకుని, విజయ్ చేతిలో నుంచి లగేజ్ అందుకుని ముందు నడుస్తున్నాడు గురప్ప

"మా వాళ్ళంతా చెట్టు.. పుట్ట.. నీరు. నిప్పు వీటిని దేవతల్లా చూసేవారు దొరా. పాముల్ని చంపటం... అగ్గిని పాప కార్యం కోసం వాడటం.... చెట్టు నరకటం.... ఇట్టాంటి పన్లు చేసేవారు కాదు ఇప్పుడు అంత సేటు నియమాల్లేవు. మీదికొచ్చిన పామును సంపటం మొదలెట్టాం.

అసలు మా పెద్దోల్లు పాము కాటును కూడా దేవతిచ్చిన వరంలా భక్తిగా అందుకునే వాల్లు.



## అగ్ని ప్రమాదాలతో ఆస్తి గడించిన ఘనుడు

ఇళ్ళు కాలుతుంటే చలి కాచుకునేవాళ్ళు, చుట్ట ముట్టించుకునేవాళ్ళు, పేలాలు వేయించుకునేవాళ్ళు ఇప్పుడే కాదు. ప్రాచీన కాలంలో కూడా ఉన్నారు. అంటే ఇతరులకి వచ్చిన ఇబ్బందులను ఆసరాగా చేసుకుని అపార సంపదలు ఆర్జించే వారన్నమాట. ఇటువంటి వారికి చక్కని ప్రతీకగా నిలుస్తాడు లిసినియస్ క్రాసస్ అనే పుణ్య పురుషుడు. క్రీ.పూ. 114 నుంచి 53 వరకు జీవించిన ఈ ఘనుడు ఒక రోమన్ మిలియనీర్. ఈయన ఐదు వందల మంది సిబ్బందితో ఒక పెద్ద అగ్నిమాపక దళాన్ని ఏర్పరిచాడు. ఇదేమీ సేవాపరాయణత్వం కోసం కాదు. పుణ్య పురుషార్థాల కోసం అంతకన్నా కాదు. ఎక్కడేనా ఇళ్ళు కానీ ఇతర ఆస్తులు కానీ తగులబడుతూంటే సహజంగానే వాటి యజమానులు ఈ లిసినియస్ దగ్గరకు సహాయం కోసం ఉరుకులూ పరుగులూ మీద వచ్చేవాళ్ళు. వెంటనే వాళ్ళతో బేరం పెట్టేవాడు ఈయన. ఆ తగులబడుతున్న లేదా ప్రమాదం ఏర్పడ్డ ఆస్తిని అతి చవకగా తనకి అమ్మేస్తేనే వాటిని ఆర్పడానికి తన సిబ్బందిని పంపుతాననేవాడు. లేదా సహాయానికి రానన్నేవాడు. దాంతో వాళ్ళు గత్యంతరం లేక ఎంత వచ్చినా వచ్చినట్టేనని ఒప్పుకొనేవాళ్ళు. లేదా మొత్తం తగులబడిపోతుండాయి. ఈ విధంగా ఈ పుణ్యాత్ముడు అపారమైన ఆస్తిని సంపాదించాడు. దాని విలువ చెప్పాలంటే కాగితం మీద రాయడం కష్టం. సూక్ష్మంగా చెప్పాలంటే 3,600,000,000 22 డాలర్ల పైన ఉంటుంది. అంటే (3,600,000,000 టు ది పవర్ ఆఫ్ 22).

ఇంతటి ఆస్తిపరుడికీ చివరికి అక్కరకొచ్చింది కేవలం ఆరడుగుల నేల మాత్రమే.

—కె. ఆర్. కె. మోహన్

మేమిలా తయారయాం.

ఇహ మా పిల్లలు పెద్దోల్లయితే మీదికి రాని పాముల్ని క్కూడా ఎతికి పట్టి చంపుతారేమో!" అన్నాడతను.

గూడానికి చేరాక తమ వాళ్ళందర్నీ సమావేశ పరిచి విజయ్‌ని పరిచయం చేసి.... అతను తమ నెలా కాపాడాడో చెపుతూ.... "ఆ దొర దేముడు. బోనాలమ్మ సొచ్చిగా ఈ దొరకూ.... దొర కూనకూ ఏ ఆపదా రాకుండా మనం సూడాల.... ఏ సాయమడిగినా సెయ్యాల. కొన్నాళ్ళు దొర ఇక్కడే ఉంటారు." అన్నాడు గురప్ప.

అంతా తల లూపారు.

తన రాకలోని అంతరార్థం క్లుప్తంగా చెప్పి.... దీన్నంతా రహస్యంగా ఉంచాలని గురప్పని ముందే ఆదేశించాడు విజయ్.

అలా ఆ చెంచుల అతిథిగా ఆ గూడెంలో ఉంటూ తన పరిశోధన ప్రారంభించాడు విజయ్.

"ఇప్పుడిహ ఈ అడవిలో ఉన్న రంగారావు స్థావరం కోసం గాలింపు సాగించాలి. ఈ చెంచులు తను ఏం చెయ్యమన్నా చేస్తారు. వీళ్ళ శక్తిని తన యుక్తిని జోడించి ముందుకు సాగాలి." అనుకున్నాడతను.

డి. ఎస్. పి. విజయ్ కొన్నాళ్ళు సెలవు పెట్టి తన వాళ్ళ దగ్గర కెళ్ళినట్టుగా, అతని ఆరోగ్యం సరిగ్గా లేనట్టుగా ఇంద్రాపూర్‌లో ప్రచార మయింది....

చెంచులతో కలిసి తిరుగుతూ చాలావరకూ అడివి అనుపానులు తెలుసుకో గలుగు తున్నాడు విజయ్....

* * * * * * *

గురప్ప పెద్ద కూతురు చెంచీత. చలాకీగా అందంగా ఉంటుందా అమ్మాయి. ఆమెకు నానీ అంత కొడు కున్నాడు. వాడి పేరు కుచ్చూ.

పొద్దున్నే లేచి గుడిశ అవతల మేస్తున్న ఆవుల పాలు పితికి, కాచి వాటిని కుచ్చుతో పాటు నానీకీ కూడా తాగించి, చెల్లి చేత ఒక గ్లాసు పాలు విజయ్‌కి పంపటంతో ఆ పిల్ల దిన చర్య ప్రారంభ మవుతుంది. కుచ్చూ అంటే ఆమెకు ప్రాణం. నానీని కూడా అలాగే చూసుకునేది.

చెంచు వనితలు ఎదిగాక, ప్రౌఢ వయసు దాటేవరకూ పర పురుషుడితో మాట్లాడరు. చెంచీత కూడా ఎప్పుడూ విజయ్‌తో మాట్లాడేది కాదు. కానీ.... అతనికి కావలసిన వన్నీ చెల్లెలైన నీలి ద్వారా అమర్చి పెట్టేది.

కుచ్చూ ఎప్పుడూ తల్లిని వదిలి ఉండేవాడు కాదు. చెంచీత మొగుడు నరసప్ప నల్లగా.... గడ బొంగులా.... పొగచూరిన కట్టెలా ఉండేవాడు. ఆ ఎర్రటి కళ్ళలో ఎప్పుడూ తాగుడు మైకం.... క్రూరత్వం తప్ప మరేం ఉండేది కాదు.

గురప్ప కిద్దరు కూతుళ్ళు. పెద్దది చెంచీత, రెండోది విజయ్ కాపాడిన నీలి.

గురప్పకి పెద్ద కూతురంటే చచ్చేంత ప్రేమ.

విజయ్‌కి ఆరుబయట మంచం వేసి, అక్కడే ఉన్న ఎత్తు అరుగుమీద కూర్చుని తనకు చెంచీతంటే ఎంత ప్రాణమో విజయ్‌కి వర్ణించి చెప్పేవాడు.

"దాని చిన్నప్పుడే తల్లిని బోనాలమ్మెత్తుకు పోయింది దొరా! అప్పు డింకో దాన్ని మనువాడ కుండా ఈ కూనని గుండెలకు కట్టుకు పెంచాను. అదెంత చలాకీ కూనని!? అది గురి చూసి బాణం వేసిందంటే ఇహ దానికి తిరుగు లేదు.

చిన్నపిల్ల నీలిని దెంత ముదిసానిలా చూసుకునేదో!

ఒక్క రోజు చెంచీతని చూడకపోతే నేనుండలేను...." అనేవాడు గురప్ప....

ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా ఉండే చెంచీతలో ఉన్నట్టుండి ఏదో మార్పొచ్చింది....

పరధ్యాన్నంగా.... ఏదో తీవ్రమైన విషయం గురించి ఆలోచిస్తున్నట్టుగా... విపరీతమైన మానసిక సంఘర్షణ ననుభవిస్తున్న దానిలా దిగులుగా ఉండేది....

ఒక పని చెయ్యబోయి మరోటి చేసి తరుచుగా మొగుడి ఆగ్రహానికి గురవుతూ ఉండేది....

ఆమెలో అలాంటి మార్పును మొదట గమనించిన వాడు విజయ్. కానీ.... ఆమెను అడగటానికి జంకేవాడు.

అక్కడి అమ్మాయిలు పెళ్ళి కాగానే మొగుడు తమ కోసం ప్రత్యేకంగా తయారు చేసిన గుడిశలోకి భర్తతో కలిసి, ఇంకెవరి తోడూ లేకుండా ప్రవేసిస్తారు.

ఇహ ఆ యువతి స్వాతంత్ర్యం సమాధి అయినట్లే. భర్త తమ్ముడితో కూడా మాటాడ గూడదామె.

(ఇంకావుంది)



"మా ఇంటి రామాయణం"లో మహాలక్ష్మి

బి. వి. సుబ్బారావు. సహదర్శకత్వం : నాగరాజ్. నిర్మాత : డి. కిశోర్.

## "అత్త మెచ్చిన అల్లుడు"

"అల్లుడుగా కృష్ణ, అత్తగా భానుమతీ రామకృష్ణ నటిస్తారు. జనవరి 2న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరుపుతాం. జనవరి 11-31, ఫిబ్రవరి 11-20 కాక మార్చిలో జరిగే చిన్న షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు కోడి రామకృష్ణ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీ లలిత కళాంజలి అధినేతలు వాకాద అప్పారావు, దాట్ల రామకృష్ణంరాజు నిర్మించే ఫై హాస్య రస ప్రధాన చిత్రంలో రాధ, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, గోపి, భక్తవత్సలం ఆదిగాగలవారు పాల్గొంటారు. గణేష్‌పాత్రో, కె. వి. మహాదేవన్, కళాధర్, సాహుల్, రామానుజం, దీప్తి, బి. శ్రీధర్, నాగేశ్వరరావు, కోడి వెంకటరమణ ప్రభృత సాంకేతిక వర్గంతో వాకాద తాతయ్య సారథ్యం, బి. హెచ్. సూర్యచంద్రరాజు నిర్వహణతో సూర్యకిరణ్ సమర్పణ.

## శివదుర్గ కంబైన్స్

"మలయాళంలో హిట్ అయి, తమిళ హిందీ భాషల్లోనూ పునర్నిర్మాణం జరిగిన 'నాడోడికాట్టు' ఆధారం. కోడి రామకృష్ణ శిష్యుడు ఎస్. ఎస్. రెడ్డిని డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నాం", అన్నారు ప్రముఖ సంకలనకర్త కె. సత్యం. ఈయన నేతృత్వంలో జి. జి. రాయుడు, శివప్రసాద్‌లు నిర్మించే శివదుర్గ కంబైన్స్ వారి చిత్రంలో సుహాసిని, చంద్రమోహన్, భానుచందర్, నూతన్‌ప్రసాద్, వై. విజయ ఆదిగాగల వారు పాత్రధారులు. పూసల సంభాషణలు, ఆత్రేయ- సి. నారాయణరెడ్డి గీతాలు, కృష్ణ- చక్ర సంగీతం, సురేష్ ఛాయ, కె. సత్యం కూర్పు తెర వెనుక హంగులు.

## బాలకృష్ణ, కోడి రామకృష్ణలతో జయభేరీ ఆర్ట్స్ చిత్రం

"డిసెంబర్ 3-10, జనవరి 1-10, ఫిబ్రవరి 1-10, ఊటీలో మార్చి 1-10 షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. ఈ చిత్రం షూటింగ్ ఎక్కువ భాగం ఔట్‌డోర్‌లోనే జరుగుతుంది", అన్నారు మురళీ మోహన్. ఈయన సమర్పణలో కోడి రామకృష్ణ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే జయభేరీ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ చిత్రంలో బాలకృష్ణ – భానుప్రియ, మురళీమోహన్ – జయసుధ, రావు గోపాలరావు, గిరిబాబు, రఘువరన్, రాజ్యలక్ష్మి, వై. విజయ వగైరా



నటవర్గం. కథా సహకారం : వియత్నాం వీడు సుందరం. మాటలు : గణేశ్‌పాత్రో. సంగీతం : చక్రవర్తి. ఛాయ : కె. ఎస్. హరి. శిల్పం : కళాధర్. నృత్యం : తార. కూర్పు : తాతా. సురేష్. నిర్వహణ :.



"రాక్షస సంహారం"లో అర్జున్

## హీరో కృష్ణ దర్శకత్వంలో రత్నా మూవీస్ ద్వితీయ చిత్రం

"నేను డైరెక్ట్ చేసే 4వ చిత్రమిది. నా తమ్ముళ్ళుగా రమేష్, మహేష్‌లు నటిస్తున్నారు. విచిత్రమైన పరిస్థితులలో చిన్నతనంలో విడిపోయిన అన్నదమ్ములు చివరికి ఎలా కలుసుకున్నారన్నది ప్రధాన ఇతివృత్తం. పూర్తిగా సెంటిమెంట్‌తో కూడుకున్న కుటుంబ గాథా చిత్రం. నాకు రాధ, రమేష్‌కి రజని హీరోయిన్స్. రాధ అన్న కూతురుగా మా అమ్మాయి ప్రియ నటిస్తోంది. మా తల్లిదండ్రులుగా గుమ్మడి, అంజలీదేవి నటిస్తున్నారు. ఇద్దరు ముగ్గురు డాన్స్ మాస్టర్లు, స్టంట్ మాస్టర్లు ఉంటారు. హైదరాబాద్‌లో, ఊటీలో షూటింగ్", అన్నారు కృష్ణ. ఈయన స్క్రీన్‌ప్లే, కూర్పు, దర్శకత్వంలో జి. నాగరత్నమ్మ నిర్మించే పై చిత్రంలో సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్, వినోద్ ఇతర పాత్రధారులు. పి. చంద్రశేఖరరెడ్డి సమకూర్చిన మూల కథకు పరుచూరి సోదరులు సంభాషణలు రాశారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, భాస్కరరాజు శిల్పం తెర వెనుక హంగులు.

## "నీ గుండెల సవ్వడిలో"

"జనవరి మొదటి వారంలో నెల్లూరు పరిసరాలలో జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు ప్రముఖ రూపశిల్పి కుమార్. ఈయన సమర్పించే చిత్రాంజలి మూవీస్ వారి పై చిత్రంలో భరత్, మయూరి, చంద్రబాబు, శోభ, సీతారామయ్య, సీతాలత, బాబూరావు, ఉమాలక్ష్మి, విజయ, వెంకటేశ్వరరెడ్డి, పగిర్రా ప్రజా నాట్యమండలి కళాకారులు పాల్గొంటున్నారు. బి. గోపాలం సంగీత దర్శకుడు. నిర్మాత : కె. జి. రాజేంద్రన్, కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం : వి. అశోక్‌కుమార్.

"డాన్స్ రాజా డాన్స్"లో దివ్య



## త్రిమూర్తి అండ్ శశిరేఖ మూవీస్ "దొరకని దొంగ"గా కృష్ణ

"స్పెషల్ ఎఫెక్ట్స్ దొంగగా కృష్ణది పూర్తిగా మాస్‌ని ఆకర్షించే వెరైటీ పాత్ర. శరత్‌బాబు ఇంపోర్టెడ్ దొంగ. మోహన్‌బాబు ద్విపాత్రలు నిర్వహించే 'తండ్రీ కొడుకులిద్దరూ' కూడా దొంగలే. అత్యధిక వ్యయప్రయాసలతో పద్మాలయా స్టుడియోలో జాదూమహల్ సెట్‌తో పాటు మరో 17 సెట్స్ నిర్మించాం. డిసెంబర్ 21 నుంచి జనవరి 14 వరకు హైదరాబాద్‌లో జరిగిన షెడ్యూల్‌తో మేజర్ వర్క్ అయిపోయింది. చివరి షెడ్యూల్ ఫిబ్రవరి 1 నుంచి 10 వరకు," అన్నారు పి. బాబ్జీ. ఈయనా, జి. సాంబశివరావు నిర్మిస్తున్న పై చిత్రంలో రజని నాయిక. సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, పద్మనాభం, హరిబాబు, పి. ఆర్. వరలక్ష్మి, కుయిలీ, దేవి ఇతర పాత్రధారులు. ఈ చిత్రాన్ని సమర్పించే పి. దూండీ కథ సమకూర్చారు. శేఖర్‌బాబు, నాగశ్రీ రచనా సహకారం, సత్యానంద్ మాటలు, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, సత్యం సంగీతం, భాస్కరరాజు శిల్పం, ఆదికేశవన్- ప్రభాకర్ ప్రొడక్షన్, డి. వెంకటరత్నం కూర్పుతో ఎం. జయదేవ్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. కె. ఎస్. ఆర్. దాస్ దర్శకుడు.



## "కృష్ణగారి అబ్బాయి" మూడో షెడ్యూల్

పాప్ సింగర్‌గా, మొరటు యువకునిగా రమేష్ ద్విపాత్రలను ఎంతో చాకచక్యంతో నిర్వహిస్తున్నాడు. మూడో షెడ్యూల్ డిసెంబర్ 21 నుంచి జనవరి 2 వరకు జరిగింది. చివరి షెడ్యూల్ జనవరి 2 నుంచి 30 వరకు," అన్నారు. కె. ఎల్. చౌదరి. ఈయన సమర్పించే సముద్రాల మూవీస్ వారి పై చిత్రంలో గౌతమి, సీతు నాయికలు.

## సినిమా

గిరిబాబు, కోట శ్రీనివాసరావు, వై. జి. మహేంద్ర, కె. కె. శర్మ, డాక్టర్ రాధాకృష్ణ, శ్రీలక్ష్మి, కల్పనారాయ్, కల్యాణి, ప్రియాంక, రజిత ఇతర పాత్రధారులు. టి. సాయినాథ్, యడవల్లి సంభాషణ కర్తలు. వేటూరి, జొన్నవిత్తుల గీతాలను చక్రవర్తి స్వరపరిచారు. పి. ఎన్. సుందరం ఛాయ, లీలాకృష్ణ శిల్పం, రఘు-శీను నృత్యాలు, ఎం. కులశేఖరరెడ్డి- రాయప్రోలు గోపి సహకార దర్శకత్వం, రామారావు ప్రొడక్షన్, డి.

''ఆస్తులు- అంతస్తులు''లో రాజేంద్రప్రసాద్, రమ్యకృష్ణ



వెంకటరత్నం కూర్పుతో దొరైరాజ్ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. సముద్రాల జయరాజ్ నిర్మాత. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : ఐ. మధుసూదనరావు.

## యువచిత్రలో నాగార్జున, విజయశాంతి

"ఫిబ్రవరి 1 నుంచి షూటింగ్. నాగార్జున సరసన విజయశాంతి తొలిసారి నాయికగా మా చిత్రంలో నటిస్తోంది. గౌతమి కూడా ఒక చక్కని పాత్రను ధరిస్తోంది" అన్నారు యువచిత్ర అధినేత కె. మురారి. "త్రిశూలం" చిత్రం తర్వాత ఈ సంస్థకు కె. రాఘవేంద్రరావు దర్శకత్వం చేసే ఈ తాజా చిత్రానికి సత్యానంద్ రచన, కె. వి. మహదేవన్ సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయతో కె. నరసింహం నాయుడు సమర్పణ.




సినిమా తీయటం మొదలెట్టి నాలుగేళ్లయింది - ఇంకా ఎన్నేళ్లకి పూర్తి చేయుగలనో చెప్పు!

## శోభన్ "రంగంలో రాంబాబు"

"డిసెంబర్ 14 నుంచి 31 వరకు చివరి షెడ్యూల్ జరిగింది" అన్నారు రాఘవేంద్ర సని క్రియేషన్స్ కందేపి సత్యనారాయణ. ఈయన నిర్మించే "రంగంలో రాంబాబు" చిత్రంలో శోభన్‌బాబు, రాధ, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, రాజా, హరిప్రసాద్, చలసాని కృష్ణారావు, భీమేశ్వరరావు, భమ్, గరగ, ఏచూరి, పూర్ణిమ, వనితశ్రీ, వై. విజయ, అన్నపూర్ణ వగైరా నటవర్గం. గణేశ్‌పాత్రో మాటలు, రాజ్‌కోటి సంగీతం : ఐ. సురేష్ ఛాయ, కళాధర్ శిల్పం, కోడి వెంకట రమణ- గాడి సత్యం ప్రొడక్షన్, రామానుజం సంయుక్త దర్శకత్వం, జనార్దనరెడ్డి- నాగేశ్వరరావు సహకారదర్శకత్వం, కె. సత్యం కూర్పుతో కోడి రామకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చి దర్శకత్వం వహిస్తున్నారు.

శత చిత్ర నటి

# సుమలత



# సమాధానాలు

ఎల్. వి. వరలక్ష్మి, విజయవాడ

ప్ర : సుమలతగారూ! ప్లీస్ ఒక్క అబద్ధం ఆడరూ?

జ : ఆహా! ఎంత చక్కని ప్రశ్న అడిగారండీ!

కె. పురుషోత్తం, జగ్గయ్యపేట

ప్ర : మనం నవ్వితే ఇరుగు పొరుగువారు నవ్వుతారు మనం ఏడిస్తే..?

జ : ఇంకా నవ్వుతారు. అదే మానవ ప్రకృతి.

తునకా రామకృష్ణ, రాయచూరు

ప్ర : రేడియోలో వార్తలు చెప్పేటప్పుడు రెండు మూడు సార్లు "ఈ వార్తలను మీరు ఆలిండియా రేడియో నుంచి వింటున్నారు", అని చెప్పడమెందుకండీ?

జ : లేకపోతే– పక్కింట్లోంచి మనం వింటున్నామని పొరబడవచ్చని ఆలిండియా రేడియో వారి అభిప్రాయం కామోసు.

వి. రంగనాధరావు, మెదక్

ప్ర : కన్నీరుకు, కొళాయి నీరుకు తేడా ఏవిటండీ?

జ : మొదటిది మనసును శుచి చేస్తే, రెండవది శరీరాన్ని శుచి చేస్తుంది.

డి. భ్రమర నాగవల్లి, పాలకొల్లు

ప్ర : కొందరు మంత్రులు ఖద్దరు వస్త్రాలు ధరిస్తారు కదా? వాళ్ళ భార్యలు మాత్రం ఖద్దరు చీరలు ఎందుకు ధరించరు?

జ : మీ సందేహం బావుంది. పోలీసు ఉద్యోగులు ఖాకీ దుస్తులు ధరిస్తే వాళ్ళ భార్యలు కూడా ఖాకీ చీరలు కట్టుకుంటారా?

బి. విశ్వేశ్వరశాస్త్రి, మారుటేరు

ప్ర : మరణించిన తర్వాత జీవించడం మీద మీకు నమ్మకముందా, నా అభిమాన తారగారూ?

జ : లేదు. మరణించే వరకు జీవించడం మీదే నమ్మకముంది.

బి. శ్యాంకుమార్, వెంకటాయపాలెం

ప్ర : రక్తముతో రాసిన అక్షరములను మీరు ఎన్నడైననూ చదివితిరా?

జ : 'చరిత్ర' అంటే ఏమిటి మరి?

భోగవిల్లి లక్ష్మయ్య, దుగ్గిరాల

ప్ర . మానవునికి సుఖము, శాంతి ఎప్పుడు లభించును?

జ : ఆ రెండూ లభించినా– లభించలేదనుకుంటాడు. మానవునికి ఎన్నడూ దొరకనిది తృప్తి.

పెబ్బిలి అప్పలరాజు, నర్సీపట్నం

ప్ర . ప్రకృతి ఎప్పుడు సౌందర్యమును సంతరించుకొనును? సూర్యోదయమప్పుడా, లేక సూర్యాస్తమయమప్పుడా?

జ : మీ ప్రశ్న– కలకండను ఏ వైపు నుంచి తింటే తియ్యగా ఉంటుంది– అని అడిగినట్లుంది.

కె. వరదాయి, కామారెడ్డి

ప్ర . భిక్షగాళ్ళు ఎప్పుడూ మా ఇంటి ముందొచ్చినా– 'అమ్మా, కబళం వేయండి' అంటారేగాని, 'అయ్యా, కబళం వేయండి" అని ఎందుకు అనరు?

జ : మనలో మన మాట.. మీ యింట్లో వంట చేసేది మీరా?

ఎస్. ఎ. హుసేన్, హుజూరాబాద్

ప్ర : లతగారూ మీరు ఎప్పుడు దేని గురించి ఆలోచిస్తుంటారు?

జ : దేని గురించి ఆలోచించాలా– అనే విషయంగురించి.

బి. రవికుమార్, కోలారు

ప్ర . సినిమా తారలు సినిమాలలో వేసుకొను నగలు బంగారువా, లేక రోల్డుగోల్డా?

జ : 'మెరిసేదంతా మేలిమి కాదు' అనే ఆర్యోక్తి మీరెన్నడూ వినలేదా? పైగా, మీరున్నది కోలారు కదా? □

గమనిక

ఈ వారం ఉత్తమ ప్రశ్నగా ఏదీ ఎంపిక కాలేదు –సం.

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న.............................................................

.............................................................

.............................................................

పంపినవారి పేరు.............................................................

పూర్తి చిరునామా.............................................................




(గతసంచిక తరువాయి)

మరునాటి సాయంత్రం ఊరేగింపు గుఱ్ఱపు బండి పైన జరిగెను. కిరీటి బండిలో కూర్చుండెను. శశిరేఖను తల్లియు, అప్పగారును తీసికొని వచ్చిరి. కిరీటి ఆమె నందిపుచ్చుకొని ప్రక్కను కూర్చుండ బెట్టుకొనెను. పేరంటాండ్రకు, మిత్రులకు నేత్రానందము కలిగెను. నాకబలి సమయమున నీటి కడవలో ఒక వెండి మట్టియు బంగారపు టుంగరమును వేసి సతీపతులను తీయుండనిరి. కిరీటి బుద్ధిపూర్వకముగా మట్టియే తీసెను. పరిశేష న్యాయము చేత శశిరేఖకుంగరమే దొరకెను. బాపిరాజు "ఒయ్యోయి పెండ్లి కొడుక! ఉంగరము మా అమ్మాయియే తీసినది" అనెను. కిరీటి బాపిరాజునకు బావమఱదుల వరుస. కిరీటి "అవి మీ అమ్మాయి తెలివితేటలు కావు. నేనే ఆ ఉంగరమును దాని చేతిలో ఉంచితిని" అనెను. అందరును పకాలున నవ్విరి. కిరీటి సిగ్గుపడెను. శశిరేఖ నవ్వదు, సిగ్గుపడదు, ఎవరి వంకను చూడదు. ఆమె మొగమనం దేభావమును కన్పించదు. అసంభవ మనుకొన్న యీ వివాహము జరుగుట చేత ఆమె దిగ్భ్రాంతురాలైన దని కొందరు. అనిర్వచనీయమైన ఒక మహానంద మామె అనుభవించు చున్నది, తదితరజ్ఞాన మామెకు లేదని కొందరు. మూడవనాడు కంకణములు విప్పిరి. ఆ రాత్రికి కార్యము. ఆ నాడు ప్రొద్దుక్రుంక బోవుచున్నది ధర్మారావును, కిరీటియు గ్రామమునకు ప్రాగ్దిక్కునసున్న సరకుతోటలకు, మామిడి తోటలకు పోయిరి. తక్కిన మిత్రు లెవరితోడనూ చెప్పకుండ వారట్లు పోవుట చేత తక్కిన వారందరు కొంత సేపు వారిని వెదకి తలా ఒక త్రోవ వాహ్యాళి కేగిరి. నాల్గు తోటల మధ్య చిన్న చిన్న సరకు మొక్క లప్పుడే నాటబడిన ఒక తోటలో వారిరువురును కూర్చుండిరి.

ధర్మారావు : నాయనా! నేను నిన్నేమని ఆశీర్వదింతును? నీ అదృష్టము నా ఆశీర్వచనమును దాటిపోవుచున్నది. నే నెప్పుడు పోదును? ఎప్పుడరుంధతికి సంగతులన్నియు తెలియ జేయుదు నని నాకు తొందరగా ఉన్నది. నేను వచ్చి పది నాళ్ళయినది. ఇంటికి లేఖయైనను వ్రాయలేదు. నా పోకపోవుట కన్న నీ స్థితి ఎట్లున్నదో అని ఆమె దిగులు పడుచుండును.

కిరీటి మనస్సు ధర్మారావు మాటల మీద లేదు. ఎప్పుడు ప్రొద్దు క్రుంకును? ఎప్పుడు రాత్రిపడును? ఎప్పుడు చిరతపః ఫలమువలె చిరకాంక్షితార్థముతన కౌగిట ఉండును? తామిద్దరును, కలసికొన్నప్పు డెట్లుండునో? ఒకరి కొఱకొకరు మృత్యుసమీపముదాక పోయివచ్చిరి. కలసికొనినపు డిద్దరును స్వర్గము దాక పోవుదురో, స్వర్గ ము దాటి పోదురో!

కిరీటి : "అన్నా! లగ్నమునకు పీటల మీద కూర్చున్నప్పటి నుండి నా యీ శరీరరోమాంచము తగ్గలేదు. అది జీవితమంతయునిట్లే నిలిచి పోవునేమో" అనెను. కిరీటి మాటాడు పద్ధతియు, కూర్చుండు పద్ధతియు ఏమియు బాగుగా లేవు. కంఠమునందు గాద్గదికము, శరీరమునందు కంపము, స్వేదము, రోమాంచము. మాటాడుచు మాటాడుచు నేత్ర నిమీలనము చేయును. కిరీటి "ఎంత సేపటికిని ప్రొద్దు క్రుంకదేమి?" అనెను. ధర్మారావు "నీ తొందర అతని కేమి తెలియును?" అనెను, సూర్యుడు పారాణిపూసిన నూత్న వధువు పదసరోజాతము ననుకరించెను. భాగ్యశాలిని యైన ఆపాదమునందును శంఖ చక్రములున్నవి. అదియు నఖచంద్రములకు దీధితినిచ్చును. ప్రేయోహృదయ సరోజాతమును వికసింప జేయును. తత్సూర్యబింబ వినిర్గత సాంధ్యరాగచ్ఛటలు కించి దరుణములై పసుపు కుంకుములచే మాగిన మధుపర్కములు కంకణములు విప్పిన నాడు చాకలి ఉతికి ఆర వేసినట్లుండెను. సరకు తోటలు – వ్రేలెడు మొక్కలవి, మూరె డెదిగినవి. రెండు నిలువుల ఎత్తున పెరిగినవి. పెరుగుట పూర్తియైనది. నాల్గు వైపుల పచ్చని మెట్లు కట్టినట్లుండెను. సూర్యకిరణములు పెరిగిన తోటలపై సంచరించుచు అట నుండి కాలుజారి చిన్న తోటల మీద పడుచుండెను. వ్రేలెడెదిగిన చెట్లు పసిపిల్లల వలె సూర్యకరస్పర్శకు పిల్ల, నవ్వులు పిల్ల సిగ్గులు కలియబోసికొని సిగ్గుచే ఎఱ్ఱబడెను. చూచుచుండగనే పెరిగిన సరకుబోదెల మధ్యగా దూరమున దృశ్యమానుడగుచున్న జరఠ సూర్య బింబమూర్తి. తేజో విరహితుడై తైక్ష్ణము కూడమానినవాడై పశ్చిమ దిక్సతీ సంయోగార్థము కాబోలు కాశ్మీర మిశ్రిత పటీరచర్చాసుందరమైన దేహముతో తిరోహితుడగుచున్నాడు ఆకాశమున తిరిగినంత సేపు తేజోదుర్నిరీక్షుడై, ప్రతిభాశాలియై, పశ్చిమదిక్సతీసంసర్గవేళ శాంతుడై శృంగార రసమూర్తియై చల్లబడెను. అట్లే కదా! ఎంత అధికారికైనను పరుల మీద చూపినంత తైక్ష్ణ్యము గృహమునందు చూపరాదు. తన ప్రతాపముచే తన కోపముచే తన అధికార శక్తిచే ఇతరుల భార్యలకు అపకారము జరుగవలయును, తమ అధికార ప్రాభవమెరుంగని స్వభార్యలు సుఖముగా మనవలయును గృహమునందున్న శాంతము, ఓరిమి - బయట కూడ ఉండరాదా? లోకము మేలుకూడ, లోకము సుఖము కూడ గొంత పరామర్శించరాదా? మధ్యాహ్న సూర్యుడు మండి పోవలయును, సాయం సూర్యుడు చల్లబడవలయును.

రాతిరి పీటల మీద నుండి లేచు వరకును

జరిగిన కథ – 38 : రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు. గవర్నరు గారు సుబ్బన్న పేటలో పురపాలక సంఘ భవనాన్ని ప్రారంభిస్తాడు సుబ్బన్నపేటకి బస్తీ కళవస్తుంది. జోస్యులు భార్య మంగమ్మను రామేశ్వరము లొంగ దీసుకుంటాడు. జోస్యులు రామేశ్వరమును ఏమీ చేయ లేక చచ్చి పోదామని అనుకుంటాడు. దేవదాసి గిరిక ప్రతిరోజూ ఆలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. హరప్ప నాయడు తాను చేయవలసిన పనులను గురించి ఆలోచిస్తూ ఉంటాడు. కిరీటికి అతనిమామ పిల్లనివ్వనని అంటాడు. జోస్యులను ఎవరో కొట్టి చంపుతారు. ధర్మారావు కిరీటి దగ్గిరికి వెడతాడు. రైలులోని ప్రయాణీకుల బాధలకు ధర్మారావు విచారిస్తాడు. కిరీటి సత్యాగ్రహం వల్ల అతని మామ పిల్లనిస్తానని అంటాడు.

మిత్రులు సన్నిహితులే యై ఉండిరి అప్పుడు విడిదికి పోయిరి రాతిరి రెండు జాములయ్యెను అందరును నిద్రించుచుండిరి కిరీటి వచ్చి ధర్మారావును నిద్ర లేపెను. ధర్మారావు లేచి ఆశ్చర్యపోయెను నిర్జనమ్మైన వీథిలో ⁄ నుండి మాటలాడ దొడగిరి కిరీటి అన్నా! నేడు శుక్రవారము కదా! అనెను ధర్మారావు "అవును అయిననేమి?' అనెను కిరీటి నేను గదిలోనికి పోయి ఆమెను పిలిచితిని కొంత సేపు పిలిచి విసిగి నేనే ఆమె వద్దకు పోయితిని పోయి ఆమెను బుజ్జగించితిని లాలించితిని కోపించితిని ఆమె ఏమియు సమాధానము చెప్పలేదు నా కేమియు అర్థము కాలేదు నా మీద ఆమె కంత ప్రేమ ఉండి చివర కిట్లు నిస్తబ్ధయై నిరుత్తరయై శిలాకృతి వదలకుండుటయేమో! నే నామెను మఱియు స్పృశించ బోతిని ఆమె నివారించినది దుఃఖించితిని రెండు గంటలు నేను బాధపడి నిస్పృహుడనగు వేళకు ఆమె "నీవెవ్వర'వని అడిగెను . నాకు మహాదుఃఖము వచ్చినది ఎవ్వరేమిటి? ఎనిమిదేండ్లు నీకై ఘోరతపస్సు చేసిన నిస్పృహుఁడ" నంటిని "నీవు భార్య వగుటకు దివారాత్రములు నిద్రాహారములు మానిన నిర్భాగ్యుడనంటిని, "నీ మేనత్తకుమారుడ' నంటిని ఆమె కన్ను తెఱచి చకితయైనది ఏదో స్మృతికి తెచ్చుకొన్నట్లభి నయించినది ఆమె చివరకు "మనమిద్దర మిచ్చట ఎట్లుంటిమి? ఇదియే ఊరు?" అనెను నేను 'నీవన్నది నాకర్థమగుట లేదు! ఇది బాపట్లయే, మన మిద్దఱమిచ్చట ఎందుకుంటిమో మూన్నాళ్ళ నుండి నీకు తెలియలేదా' అంటిని ఆమె తెల్లబోయి చూచెను తన్ను తాను పరిశీలించుకొనెను గులాబి పూలతో, చేమంతిపూలతో, మొగలి పూలతో పెద్ద జడ వేసిరి ఆమె శరీరమంతయు సువాసనా పరిమంజులమై ఉండెను కట్టిన చీర ఉల్లిపొర వలె తన శరీరకాంతి ప్రవాహమును వడబోయు చున్నట్లుండెను. ఆమె తన మూర్తి సంఘటన మంతయు చూచుకొని ఆశ్చర్య౯ పొందినట్లయ్యెను కొంత వరకు నేత్రములు తెఱచి ఆలోచించి "అట్లనా? మనకు వివాహమైనదా? అవును లీలగా స్మృతి కలుగుచున్నది. నీవు బావవుగదా!" అన్నది. నేను మఱల సమీప గతుడనై పరిష్వంగాభిలాష ప్రకటించితిని. ఆమె మరల వారించినది. ఆమె "నేడు శుక్రవారము. నీవు నన్ను తాకరాదు అయినను నేను పోయి స్నానము చేసి వచ్చెద నిచ్చటనే ఉండు" మని తాను గదిలో నుండి వెడలినది నేను శూన్యహృదయుడనైతిని నా భాగధేయ మంతయు వ్యత్యస్తముగా ఉన్నట్లు తోచుచున్నది, ఇదియేమో, దారినిబడి వచ్చి వచ్చి మహాసౌధము నారోహించబోవుచుంటి ననుకొని, మహారణ్యగతుడనై నన్ను నేను చూచుకొని నివ్వెఱవోయినట్లయినది, ఏమి చేయుదు"నని

కిరీటి దీర్ఘ నిశ్వాసము వదలెను, కన్నులలో బాష్పములు నిలిచెను. తూష్ణీంభావము వహించెను ధర్మారావు దీర్ఘాలోచనాపరుడై, "ఆమె దేవీపూజ చేయునని మనమిది వరకు వినియుంటిమి కదా! ఆమె నీ పెండ్లి నిర్ణయించిననా అప్పటికి వారము రోజుల నుండి తన స్మృతి తారెరు గదని మీ

మామ చెప్పెను గదా! గుంటూరులో పూజారి ముసలవ్వకూడ ఆమె దేవ్యు పాసకురాలని బోధించెను గదా! నేడు శుక్రవారము. దేవి కిష్టమైన దినము దేవ్యుపాసకుల కీనాడు పవిత్రమైన వారము. ఆమెకు నిజముగా ఈ పది రోజుల నుండియు స్మృతిలేదేమో!నీ యందామెకు మహాప్రేమ యని



విదితమైన విషయమే కదా! ఆ విషయములో. సందేహము లేదు నీ విప్పుడెంత ఆనంద సముద్రమున ఉంటివో, నీ కొఱకామెయు అంత ఆనంద మనుభవించవలసినదే దాని కేదియో పెద్ద కారణముండి ఉండవలయును ఆమె ఈపాటికి

# వేయి పడగలు

స్నానము చేసి నీకై వచ్చి ఉండును. నీవు పోయి ఆమె వచ్చిన తరవాత ఏమనునో కనుగొనుము. నీవు వెళ్ళుము" అని కిరీటిని బలవంతముగా పంపించెను. కిరీటి నిస్పృహుడై అడుగులు లెక్క పెట్టుకొనుచు పోయెను. ధర్మారావు పోయి మళ్ళల పండుకొనెను. అతనికి నిద్దుర పట్టలేదు. తెల్లవాఱుకడ మూడు గంటలకు కిరీటి మఱల వచ్చెను. ఇరువురును కలసి నిర్జన వీథిలో నిలుచుండిరి. కిరీటి "ఆమె అంత జడయు పూలన్ని తీసి వేసి విప్పి స్నానము చేసినది. ఒడలంతయు సుగంధ ద్రవ్యముల లందబడి యుండుటచేత స్నానము చేసిన ఆమె యొడలు బహువిధ పరిమళ ప్రవాహ మనోహరమయ్యెను. ఆమె ఆ చీర వదలి యింకొక పట్టు చీర కట్టుకొని వచ్చెను. పట్టురైక తొడిగెను. గదిలోనికి వచ్చినది. ఒడలనొక్కనగయైనను లేదు. చిన్న కుంకుమబొట్టు పెట్టినది. నేను దగ్గరకు పోయి స్పృశించబోతిని. ఆమె "తాక వలదు రెండు కొబ్బరికాయలును, హారతి కర్పూరమును కావలె" ననెను. నే "నిప్పుడెచ్చట నుండి వచ్చు" నంటిని. అందరును నిదురబోవు చుండిరి. ఆమెయే పోయి యిల్లంతయు వెదకి అవి తెచ్చెను. తెచ్చి ఆమె నన్ను తన వెంట రమ్మన్నది – మే మిర్వురమును వంటయింటి నానుకొని ఉన్న గదిలోకి పోయితిమి. అచ్చట గోడలో ఒక గూటిలో దేవీ విగ్రహమున్నది. ఆమె పూజ చేసి కొబ్బరి కాయలు కొట్టి, హారతికర్పూరము వెలిగించి నీరాజన మిచ్చి కొబ్బరి చిప్ప ముక్కలు తీసి నాకు నాలుగు పెట్టెను. ఇద్దరమును మఱల గదిలోనికి వచ్చితిమి. నే నామెను మఱల కౌగిలించుకొన బోతిని. ఆమె "నీవు నన్ను నేడు తాకరాదు. ఈ సంగతి అంతయు రేపు చెప్పెదను. తల్లి దయ చూచినది. నా తపస్సు ఫలించినది" అనెను. నాకు దాని మాటలు కొంచెము కొంచెముగా అర్థము కావచ్చెను. నా శరీరము నందు ప్రతి రక్తబిందువు లోనను మన్మథుని శరాఘాతమైనది. నేను పురఃస్థిత మాణిక్యపేటిని చూచి, అదినాది అని తెలిసి, అది నా కొఱకై ఎదుటికి వచ్చి నిలుచున్నదనియు తెలిసి తదనుభవమునకు దూరమైతినన్న సంగతి నాకు చాల బాధా హేతువయ్యెను. నేను బలవంతముగా ఆమెను కౌగిలించుకొని ముద్దాడితిని. ఆమె శిరోజ భార మెండ లేదు. అది అంతయు తడిగా ఉన్నది. నేను దాని కేశభారమంతయు ఉత్తరీయముతో తుడిచితిని. ఆమె అరగంట సేపు నా పరిష్వంగముననే ఉన్నది నన్ను నివారించలేదు. గంటసేపయిన తరువాత ఆమె యిట్లన్నది. "ఇద్దఱమును వాంఛకు లొంగిపోయి దేవి యెడ అపచారము చేయుచున్నాము ఈ అపచార మేమి దుష్ఫలితము నిచ్చునో? నేను నీవు నాకు లభించితివన్న ఆనందములో ఒడలు తెలియక నిన్ను కౌగిలినుండి నిరాకరించలేదు బావా! ఎనిమిది సంవత్సరము లోర్చుకొంటివి. ఇంక ఒక్క దిన మోర్చుకొనలేవా? నేను త్రిపుర సుందరీ మంత్ర ముపదేశమైతిని. మా బావను పెండ్లి యాడు కోర్కతో పదునేను దినముల నుండి జపము చేయుచుంటిని. అది ఫలమునకు వచ్చెను. ఇప్పుడు నేను నిన్ను తాకరాదు. నా యందు కామ ప్రవృత్తి కలుగరాదు. నేను రేపంతయు ఉపవాసముండి దేవికి శాంతి చేసి జపమును పరిసమాప్తము చేసి ఎల్లుండి నీ వద్ద ఉండెదను. నేడు, రేపు నా యందు నీవు కామించకుము. నీ వేమాత్రము వాంఛ ప్రకటించినను నేనును లొంగిపోదునేమో? చూచితివా? గంట నుండి నేను నీ కౌగిటిలో ఉన్నాను. ఈ అపచారమునకు తల్లి కోపించునేమో? దీని కేదైన మరల ప్రాయశ్చిత్తము చేయవలయునేమో? అబ్బబ్బా! నన్ను వదలుము. నాకు భయము వేయుచున్నది. నేను మహాపచారము చేసితిని. రేపు ఉపవాసముండి పూజ చేయు వరకును నా మనస్సు మనస్సులో ఉండదు. రెండు దినములు నన్నూరకే చూచుచు ఉండవలయును. అట్లుండుదునని నాకు వాగ్దానము చేయుము" అని శశి నా గడ్డము పుచ్చుకొని బతిమాలెను. నా పాదములపై శిరము మోపి మ్రొక్కెను. ఆమె వడలంతయు తపించి పోవుచుండెను. ఆమె కనుల వెంట సంతతధారగా నీరు కారుచుండెను. నా యందు మహాగ్ని ప్రేల్చుచున్నది. హోమార్థము సంస్కృతమైన మహాగ్ని యదత్తపురోడాశమై వాంఛాల వేపత్ప్రచలిత జిహ్వాగ్రములు చాచినది. నేను విధిలేక ఆమె చెప్పెడి మాటల కంగీకరించితిని. నేను సరిగానప్పుడు "ముహు రంగుళి సంవృతాధరోష్ఠం ప్రతి షేధాక్షరవిక్లబాభిరామమ్ ముఖ మంస వివర్తి పక్ష్మలాక్ష్యాః కథ మప్యున్నమితం సచుంబితంతు" అన్నట్టి స్థితిలోనే ఉంటిని. నే నంగీకరించితిని. ఆమె దూరముగా పోయి చీరకొంగు పరచి నేల పండుకొనబోయినది "కాదు. నేను పోవుచున్నాను. నీవు ప్రక్క మీదనే పరుండు మంటిని. ఆమె "నేను మంచముపై పరుండరాదు. నీవు నన్ను వదలి పెట్టి ఎచ్చటికి పోయెదవు? రెన్నాళ్ళు నీవు నన్ను వదలి పెట్టి ఉండుట కష్టమని నాకు తెలియును. నాకు మాత్రము కష్టము కాదా? ఎంత కష్టమైనను నీ రెండు దినము లింతే" అని ఆమె నేలపై పండుకొన్నది నే నరగంటసేపామెవంక చూచుచునే మంచముపై పన్నుంటిని. ఆమె యింతలో నిద్రపోయినదో మఱల స్మృతి తప్పినదో, నేను బయలుదేరి నీ దగ్గరకు వత్తు ననుకొంటిని మరల ఆమెను స్పృశించవలె ననిపించినది. ఆమె నిద్రాసౌందర్యము నన్ను కామపరిదగ్ధుని చేసినది. ఏడేండ్ల క్రింద మేము వారి యింటికి వివాహమునకు పోయినప్పుడు నే నామె నేకాంతముగా నిద్రితురాలిని గదిలో కలిసికొంటినని చెప్పితినే! ఇంతకుముందామెను చూచినప్పుడు అట్లే ఉన్నది. ఆమె అప్పటి కిప్పటికి నిద్రించుచునే ఉన్నది. నే నామెను మేల్కొల్పవలేక పోతిని. ఆమెను స్పృశించ బోయినంత మేర పోయి, మనస్సులో నివర్తితుడ నైతిని చివరకు బయలుదేఱి వచ్చితిని" అనెను.

కిరీటి సర్వ నాళములలోని రక్తము కామోన్ముఖమై యీనాటి రాత్రి పర్యవసానము నిర్ణయించకొని ఉండి ఉత్తప్త బలావరోధమును దాచుకొనలేక ఉండెను. అతని అంతర్హృదయములో శశిరేఖ తనదే అని తెలియును. ఆ రెండు రోజులాగుట కతడు సమర్థుడు కాక ఉండెను. ఎంత ఉత్తాలమైన ప్రకృతియైనను, ఫలమునందు ప్రబలోన్ముఖమైన ప్రవృత్తిని మహావరోధ హేతువు చేత నియచ్ఛించుటకు సమర్థుడు కాడు. దానికి ఎంతయో ప్రయత్నము చేయవలయును.

ధర్మారావతనిని నిబోధించెను? "ఇటు



చూచితివా! ఆమె దేవతా విషయకమైన ప్రతి బంధము చూపించినది. ఆమె నీయందు నిరాదర కాదు, నిష్ప్రణయ కాదు. ఆమె హృదయమునకు నీవే యధినాధుడవు. కాని ఆమె యీ వేళ కధి నాధురాలు కాదు. ఈనాడైనను నీవామెను బలవంతముగా కౌగలించి యుండవలసినది కాదు."

కిరీటి : నేను బలవంతముగా కౌగలించలేదు. ఆమె ఊరకున్నది.

ధర్మారావు : ఆమెయును తాత్కాలికముగా నీ వలన కామోద్రిక్తయైనది. సర్వ దేవతా స్వరూప మైన మీ ప్రణయము దేవతా తిరస్కారము జరుపరాదు. మీ యిద్దఱి ప్రేమ జీవితము మహా ఫలమేదియో కలిగించ వలయును. మహాపురుషు డెవడో మీ సంయోగము వలన జనించ వలయును. కాని యీ కించిదపచార మిదివఱకే జరిగినది. కానిమ్మిప్పటికిని మించి పోయినది లేదు. ఎల్లుండి రాత్రివఱకు నీవు నియమముగా ఉండవలయును. నీ ఉద్రేక మంతయు అణచు కొనుము. అదియుగాక, ఆమె అత్యంతాభిముఖురాలు కానప్పటి నీ ఉద్రేకము రమణీయము కాదు; మహానందకారియు కాదు.

కిరీటి: అన్నా! క్రమముగా అదియే తగ్గిపోవు చున్నది. పొంగి రాని మహానది కెదురు పొడిచి సముద్ర మేమి చేయగలదు?... పరస్పర వీచీ హస్తములే కలియవు.

తెల్లవారినది. మిత్రు లందఱును ప్రయాణము లైరి. అందఱును వచ్చి కిరీటి కభినందనము లిచ్చిరి. ఆ పిచ్చి పిల్లవాడు వెల వెల పోయెను. వారు కిరీటి ముఖ లక్షణములనే భావములు కనిపించు ననుకొనిరో అవి కనిపించక పోవుటచేత పలువురు బెల పోయిరి. ధర్మారావు నడిగిరి. అత "దేమియు లేదు. తరువాత చెప్పెదను లెండి" అనెను. అందఱును రైలునకు నడచిరి. ధర్మారావును వారితో చనెను. వారతనిని నొక్కి నొక్కి అడిగిరి. ధర్మారావు కథ అంతయు చెప్పెను. వారు సమ్మదపరీత హృదయులైరి. బాపిరాజు "నేను మూన్నాళ్ళ నుండి చూచు చుంటిని గదా! ఆమెలో నాకూ చైతన్యమే కనిపించ లేదు. ఇదా హేతువు!" అనెను. పశుపతి "ఇతని ప్రణయ కథ మొదటి నుండి చివరి వఱకు ఆశ్చర్య కథాపరిమితముగానే ఉన్నది" అనెను. శివరావు ఆంగిలేయములో "అతడు ధన్యుడు" అనెను. వారందరును బాపట్ల వదలి పోయిరి. అది ఏమో ధర్మారావు వెళ్ళెదనన లేదు. కిరీటి వెళ్ళుమని ఎట్లనును?

ఆ దినమంతయు ఇద్దఱు స్నేహితులును పరస్పరము సేవించు కొనిరి. సంవత్సరము కిరీటిని సుబ్బన్న పేట యందు కాచుట ఒక యెత్తు, నే డొక్క రోజతని పరామర్శించుట ఒక ఎత్తుగా తోచినది. కిరీటికి తలంటి పోసిరి. బంధువులు పరాచికము లాడిరి. అతనిని చూచివపు డెల్ల మామ అనురాగమును ప్రకటించెను. ఎక్కిన ఎండలతో పాటు కాలమును గడచినది. ఎట్టి దుర్భట వేళయందైనను ప్రాతః కాలము గడచుటలో బాధ ఉండదు. సాయం కాలము స్వభావముగా మాంద్యము గలిగిన వేళ! అప్పుడు కష్టములో నున్న మనుష్యులను పట్టుకొనుట కష్టమగును. స్నేహితు లిద్దరును వాహ్యాళి పోయిరి. ధర్మారావు పద్యములు చదివెను. భారత భాగవతముల మీద విమర్శ చెప్పెను. సంగీతము పాడెను. ఆధునిక నాగరికతను విమర్శించెను. నాటకములు సినీమాలను పరిహసించెను. అత డా సాయంవేళ చేసినంత అల్లరి అతని జన్మములో చేయలేదు. కిరీటి తన్ను తాను మఱచి పోయెను. కిరీటికి ధర్మారావు మహా మేధావి. అతడు చెప్పిన దతనికి వేదము. సూర్యు డస్తమించిన వేళ ఆలస్య మనిపించ లేదు. రాతిరికి ప్రొద్దు పోయి యింటికి వచ్చిన కిరీటి భోజనము చేసెను. విడిదిలో ఒంటరిగా ఏలయని ధర్మారావు వారి యింటి వద్దనే పందిరిలో పండుకొనెను. కిరీటి గదిలోనికి పోయెను. తెల్లవాఱు చున్నది ధర్మారావు కన్నులు తెఱచి చూచెను. కడచిన రాత్రి అంతయు పగ లంతయు నిద్రలేక అతనికి గాఢ నిద్ర పట్టెను. మెలకువ వచ్చు వఱకు కిరీటి తన ప్రక్కలో పండుకొని ఉండెను. ధర్మారా వతనిని నిద్ర లేపలేదు. వెనుకటి దినము వలెనే గడచెను. సాయం కాలమున ధర్మారా వడిగెను. "రాత్రి నా వద్ద వచ్చి పండుకొంటి వేమి?"

కిరీటి: ఏమియు లేదు. పండుకొనిన తోడనే నాకును నిద్ర పట్టినది. శశి వచ్చి నేలపై పండు కొన్నది. నిన్నంతయు ఆమె ఉపవాసమే; రాతిరి గూడ భోజనము చేయలేదు. పగ లెల్ల పూజలు పురస్కారములతోనే సరి పోయినది. నాకు రాత్రి రెండు జాములకు నిద్ర మెలకువ వచ్చి చూచితిని. నే నామె గదిలోనికి వచ్చుటయే ఎఱుగను. మఱల నే నామె నిద్రా సౌందర్యమే ఎరుగుదును. అప్పుడు వచ్చి నీ వద్ద పండు కొంటిని.




ధర్మా: నే డామె భోజనము చేసినదా?

కిరీటి: చేసినది అన్నా! బయలు దేరి వచ్చు చున్నప్పుడు చూచితిని. ఈ యైదు రోజుల నుండి విశేష మొకటి జరిగినది. నేను దుస్తులు ధరించి షికారునకు బయలు దేరి వచ్చు చుంటిని. ఆమెకు మొగలి, చేమంతి, గులాబి పూలతో జడ వేసిరి. మొన్న రాత్రి ఎట్లున్నదో సరిగా అట్లున్నది. నన్ను చూచి సిగ్గుభరితయై పోయినది. ఎన్నడులేని యీ సిగ్గెచ్చట నుండి వచ్చినది?

ధర్మా: విజయ విలాసము చదివితిని. ఉలూచి కథ చదివితిని. "ఇంతలో ఎచ్చట నుండి వచ్చె దరళేక్షణకున్ నునుసిగ్గు దొంతరల్"- నీ కిదే ఆశీర్వాదము. నీ తపస్సు లన్నియు ఫలించినవి. దేవి నీ ఎడల ప్రసన్నురాలైనది. తమ్ముడా! ఒక్క వాగ్దానము చేయుము. నన్ను మునుపటి వలెనే చూచు చుండుము. మఱచి పోకుము.

ధర్మారావు పడిన సందేహములో అర్థము లేదన్నట్లు కిరీటి చూచెను.

ధర్మారావు మరునాడు రైలునకు పోయెను. వెంటనే కిరీటి నడుచు చుండెను. నడచినంత మేఱ ఏవో రహస్యములు చెప్పుచుండెను.

"అన్నా! ఆమెను నా వక్షస్సుచేత, హస్తములచేత, పాదముల చేత, ముఖము చేత కప్పి వేసితిని. ఆమె నాలో ఇమిడి పోయినది.

"నేను ఆమె పొడుగరి అనుకొంటిని. మే మిద్దఱమును పండుకొంటిమా, ఆమె యఱకాళ్ళు నా పాదముల మీద ఉన్నవి. ఆమె తల నా గడ్డము క్రింద అణుచున్నది. ఆమె శిరస్సు, చేతులు, దేహము, పాదములు సర్వమును ఏదో పారిజాత ప్రసవ వాసనలే క్రుమ్మరించినవి. అట్టి వాసనలు నే

# వేయి పడగలు

నెన్న దెరుగను! అది గులాబి వాసన కాదు; చేమంతి తావి కాదు, గేదఁగి పరిమళము కాదు, అగురు గంధముల పునుగు కస్తూరుల తావి కాదు– వీని అన్నిటి సమాహార పరిమళమో, ఏమో తెలియదు. ఇదిగో, యిప్పుడును నా ఒడలంతయు ఆ వాసన వేయు చున్నది. నేను ఉచ్ఛ్వాసము తీసికొని నంత మేర, వదలి నంత మేఱ నా ఊపిరి తిత్తులయందా వాసనయే ప్రయాణము చేయు చున్నది.

"అన్నా! నా ఎదు రొమ్ము మీద రాతి రామె మొగము ముద్రిత మైనది. అచ్చు గ్రుద్దినట్టున్న ఆమె మొగము రాతిరి దీపము వెలుగున సువ్యక్తముగా కనిపించినది. నీకు చూపించ వలయు ననుకొంటిని. ప్రొద్దుననే మఱచి పోతిని.

"ఆమె నన్నడిగినది, మీ స్నేహితు డెవరని? స్నేహితుడు కాదు, అన్న అని చెప్పితిని. నీ సంగతి అంతయు చెప్పితిని. ఆమె ఊరకే ఆలించినది"

ధర్మారావు: నీవు మఱల సుబ్బన్నపేట ఎప్పుడు వచ్చెదవు?

కిరీటి: పది దినములలో వచ్చెదను.

ధర్మారావు: శశిరేఖ రానిచ్చునా?

కిరీటి: రాతిరి నన్ను "నీవు నీ"వనియే పిలువ జొచ్చెను. నేను "నీ వనుట నాకు బాగుగనే ఉన్నది. మీ రనవలయును. ఎవరైన విన్నచో ఏమను కొందు రంటిని. దాని కది అర్థము కాలేదు. "సరే నీ వనుమను చున్నావు గనుక అందు" నన్నది.

ధర్మారావు టిక్కెట్టు కొనెను. అతడు రైలెక్క బోవుచుండెను.

కిరీటి: "ఒక్క మాట" అని రహస్యముగా ఇట్లు చెప్పెను. "అన్నా! నా జన్మ కృతార్థమై పోయినది. ఆమె పూర్వ రాత్రి అంతయు లజ్జారాశి. పర రాత్రి అంతయు ప్రేమ రాశి. ఆమె చాల చదువు కొన్నది. వాత్స్యాయన కామసూత్రములు పఠించినదట. కొక్కోకము చదివినదట! ఇవి అన్నియు నా కొఱకే చదివినదట! నేనే పనివాడను."

ధర్మారావు కిరీటి బుగ్గపై చిటుక వేసెను. రైలు కూసెను అది వాయువేగ మనోవేగములతో, పరువెత్తు చుండెను. ధర్మారావునకు కిరీటి పొందిన స్వర్గ సౌఖ్యము మనస్సుతో అందు కొంద మన్న అందలేదు. దిగ్భ్రాంతుడై మహాశైలాగ్ర వినిస్సృత నిర్ఝరిణీ పరివేగ వత్ప్రచలిత మనః ప్రవాహము నడ్డు కట్టుకొనలేక ఊరకే కనులు మనస్సున కంటించుకొని చూచు చుండెను. ప్రక్క వృక్షములు పరువు లెత్తు చుండెను.

సుబ్బన్నపేట రక్షక భటాలయమునకు కలకత్తా రక్షక భటాలయము నుండి రహస్యమైన ఒక తంతి వార్త వచ్చినది. ఆ తంతి వార్తయేమో ఎవరికిని తెలిసినది కాదు. రక్షక భటులు గుంపులు గూడి తిరుగు చుండిరి. తరువాత నెలనాళ్ళ కొక ప్రొద్దున కాసాపేట లోని ఒక పురాతన గృహమును పోలీసు వారు ముట్టడి వేసిరి. ఇన్స్పెక్టరు లోనికి పోయి తనిఖీ చూచెను. లోన నొక పదునాలు గేండ్ల కుఱ్ఱవాడును, కరెన్సీ నోట్లు తయారు చేయు యంత్ర సామగ్రియు, అచ్చులు, రంగులు, కాగితములు దొరకెను. అవి అన్నియు స్టేషనునకు తెచ్చిరి. కుఱ్ఱవానిని నిర్బంధించిరి. ఇల్లొక కోమటిది. అతనిని పట్టుకొనగా "బాబూ! నా కేమియు తెలియదు. ఇల్లద్దె కిచ్చితిని" అనెను. "ఎవరి కిచ్చితి" వనిరి. "అయ్యా! నేను మనిసిని మాత్రమే ఎఱుగుదును. అతడు సినిమా కంపెనీలో ఉండును. వచ్చినచో పోయి చూపింతు" ననెను అచ్చటికి పోయిరి. నల్లనివాడు, బుట్ట క్రాపింగు వాడు, వ్యాయామము చేత కఠిన శరీరము కలవాడు, మొగము నిండ మశూచికపు మచ్చల వాడు, చలపతి యన్న పేరుకల వాడు– కోమటి చూపించినది వానిని, అతడు సినిమా రౌడీ. వాడు హాలులో నిలుచుండి "సైలెన్స్" అనగనే అందఱును కుక్కిన పేను వలె కూర్చుందురు. ఒకసారి ఒక పెద్ద మనుష్యుడు హాలులో సిగిరెట్టు త్రాగు చుండెను. అతడు పరాయి ఊరి వాడు. చలపతి దూరము నుండి "సిగరెట్టు పాఱవేయ్" అని తన అధికారమును మాటతో చూపించెను. ఆ కొత్తవాని కీ కథ తెలియదు, అతడు పాఱవేయ లేదు. మఱు నిముసములో చెంప ఛెడేలు మనెను. అందరును పెద్దలే. ఒక్కరు మాటాడిన వారు లేరు. అభియోగము తెచ్చుకొనుటకు సాక్ష్యము లేదు. సినిమా హాలులో ప్రభువు రీడింగు, ప్రభువు కారు, చలపతి. చలపతి పేరు చెప్పినచో ఊరంతయు గడగడ. చలపతిని పట్టుకొనిరి. పోలీసు స్టేషను లోపల రౌడీతనము పనికి రాదు. పది పోలీసు



చేతులు పర్యాయముగా ఆడు చుండును. బొమికల సందు సందున ఉబుకని చోట్లలోని మాంసము కములు చుండును. ప్రతి మాంసపు కండకు హృదయమునకు సంబంధ మాయెను! హృదయము వెలికి వచ్చును. దానితో రామేశ్వరము వెలికి వచ్చెను. ఆ సాయం కాలము రామేశ్వర మరెస్టు చేయబడెను. నోట్ల కట్ట లున్నవారు, ఉన్నవని అనుమాన మున్నవారు, నా యింటి వద్దకు వచ్చుచు పోవుచుందురని తెలియబడిన వారు ఏబది మంది సబ్ జైలులో చేరిరి. అస లచ్చు వేయగల అఱవ వాడును పట్టుకొన బడెను. అతడు పూర్వము టంకసాలలో నుండి ఉద్యోగము చాలించుకొని దేశము మీదికి సంపాదనకు వచ్చిన వాడు. వాని పేరు ఆర్ముగము.

ఆచోకీ ఎట్లు దొరికిన దనగా సినిమా కంపెనీలో నున్న ఒక పనివాడు పది వేల రూపాయల నోట్లు పట్టుకొని పోయి కలకత్తాలో మార్చబోయెను; ఒక వర్తకుడు సందేహపడి అతనిని వ్యవహారము మాటాడు చున్నట్లు కూర్చుండ బెట్టి పోలీసు వారికి తెలియ జేసెను. వారతనిని పట్టుకొని తాడించిరి. వాడు సుబ్బన్న పేట కబురు బయట పెట్టెను రామేశ్వరమును, చలపతియు చెఱసాల యందుంచబడుట చాల మందికి భగవంతు డున్నాడని పించినది. జమీందారు గారి జామీను మీద రామేశ్వరము వదలి పెట్ట బడెను చలపతికి జామీనుదారు లేడు అతని కున్న జామీనుదారే జామినుమీద వదలి పెట్టబడె నాయెను! బయటికి వచ్చిన రామేశ్వరము లక్ష విధముల తప్పించుకొన చూచెను. మదరాసు పరుగెత్తి పెద్ద న్యాయవాదులను దెచ్చెను. ఊరిలో మ్యాజిస్ట్రేటు వద్దకు పోయి, "మీరు కేసు కొట్టి వేసినచో ఇరువది వేలిత్తు" ననెను. వాని దౌష్ట్యమంతయు తెలిసిన మ్యాజిస్ట్రేటు దాని కంగీకరించ లేదు. పైగా "నా గడప ముందరి కీసారి వచ్చితివా, నిన్ను తుపాకితో కాల్పించెద" ననెను దశ తిరిగినది రామేశ్వరము క్రోధము వలన ఫలితము లేకపోయెను. చలపతి రామేశ్వరము గారికి వార్తలు పంపించెను "నన్ను కూడ జామీనుమీద వదలించుడు నేను మీకు చాల సహాయముగా నుందు"నని కాని రామేశ్వరమునకు పూర్వము తనకున్న పలుకుబడియు, తన అధికారమును సర్వము నశించినట్లే తోచెను ఇదివఱకు తా నన్నచో అందఱకు ప్రేమయు, గౌరవము అనుకొనెను అది అంతయు నటన. అసలు రహస్య మిప్పుడు తెలిసెను. తా నన్నచో అందఱికిని ద్వేషము, అగౌరవము. మంగమ్మ మహాపతివ్రత. పతి శరీరైక వ్రత కాదు పతివాగైక వ్రత మూడక్షరముల నతడు చెప్పినట్లే నడచెను.

(ఇంకా ఉంది)



# దూరదర్శనం

లత

## సీతాపతి

నాటకం – రచన నండూరి విఠల్

పదిహేనేళ్ళ కిందట సీతాపతి నాటకం రేడియో ప్రసారమయింది అంతకు ముందు నవలగా వచ్చింది కథ ఏమిటంటే ఒక భార్య సీత తన పేరుమీద కేసరి హనుమాన్లు అనే భర్త పేరుని సీతాపతి కింద మారుస్తుంది చచ్చినా మొగుడు మాట వినదు ఇలాగే ఉంటుంది నాటకం అంతా సీత స్నేహితురాలిగా వేసినమ్మాయి ఎవరో గాని సీతకన్నా చిన్నదిగా ఉంది పమిట లేకుండా తన అంగ సౌష్టవాన్ని టి వి చూస్తున్న లక్షలాది ప్రేక్షకులకు మాంచి సెక్సీగా – రొమ్ము విరుచుకుని మరీ కనువిందు చేసింది– టోటల్గా నాకు రేడియో బ్రాడ్కాస్టింగ్లో నే నచ్చలేదు విఠల్ గారు గయ్యాళి పెళ్ళాం చచ్చుమొగుడూ ఉంటే హాస్యం అనుకుని వ్రాశారు సరే ఏం చేస్తాం? ఆయన టి వి ఉద్యోగి డైరెక్టరు కూడా ఇప్పుడెక్కడ చేస్తున్నారో తెలియదు

ఆయన మంచి నటుడు రేడియోలో ఉండగా మంచి రచయిత అని ఎవరూ అనుకోలేదు అధికార రీత్యానే ఈ సీతాపతి ఆనాడు రేడియోలో ఈనాడు టి వి లో ప్రసారమవుతున్నది– నాతో పాటు ఎనౌన్సరుగా ఉండే విఠల్గారు నాకంటే రేడియోకి సీనియరు నాకు మంచి మిత్రులు కూడా అయినా ఇది గొప్ప నాటకం అని వ్రాయటం కష్టం హాస్యం అసలు మృగ్యం

## బహదూర్షా జఫర్

టి వి ఇస్తున్న నాటకాల్లో ప్రస్తుతం అగ్రస్థానంలో ఉన్న నాటిక ఇది

స్వతంత్ర సమరం ప్రారంభమయింది హిందూ సైన్యం ఇంగ్లీషు సైన్యాన్ని తిప్పి కొడుతుంది ఆ తొందరలో బహదూర్ షా అనుమతి లభించకుండానే – ఆడవాళ్ళనీ పిల్లల్నీ కూడా మట్టు బెడతారు యువరాజు త్రాగి ఉంటాడు ఇప్పుడూ అప్పుడూ దేశ ద్రోహుల వలనే దేశానికి ప్రమాదం అలాటి వాళ్ళని ఆధారం చేసుకొని – విభజించి పాలించు అన్న సూక్తిని అమలు పరచారు ఈ నాటిక చాలా బాగుంది విజయలక్ష్మీ పండిట్ ఈ నాటికని మెచ్చుకున్నదని ఎక్కడో చదివాను నిజమే మరి

## స్త్రీ

రచన శ్రీధర్ క్రిషీగర్ బుధవారం (4–11–87) శాంతి రాజస్థాన్ స్త్రీ భర్త లేదు ఈ భూమిక నిర్వహించింది రత్నాషా

కథలో ఆమె విధవ పదమూడు ఏళ్ళకే ఆమె వివాహం అయింది గాని మొదటి అత్తవారింటిని కాదని టేకే వాళ్ళి ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. ఇద్దరు పిల్లలు పుట్టారు కాని భర్త త్రాగి త్రాగి మరణిస్తాడు

టైలరింగ్లో ప్రతిభావంతురాలై దక్షిణ ఢిల్లీలో చిన్న ఇల్లు కట్టుకుని పిల్లల్ని పెంచుకొంటున్న భారతీయ స్త్రీ భర్తని కాదని మరో భర్తని చేసుకో గల సంస్కారం ఉన్న రాజస్థాన్ స్త్రీ సహగమనం కూడా చేయగలదు అదీ చిత్రం




## సుప్రభాతం

సీరియల్ నాటిక గురువారం (5–11–87) కరెంటు పోవటం వలన ఈ నాటిక మొదటి భాగం తరువాత మళ్ళీ ఈ రోజే చూస్తున్నాను. మా దాశరథి గారికి విష్ణు ద్వారం కనపడదేమోనని కరెంటు పోనట్టున్నది – అదుగో జయ విజయులు ద్వారాలు తెరిచారు శ్రీ దాశరథి లోపలికి వెళ్ళారు ఇది నా భ్రమంటారా? కావచ్చును నమ్మకం ఆ భ్రమలో నే ఉంది

ఈ నాటకం బాగుంది అమెరికా జీవితానికీ భారతీయ జీవితానికీ భేదం చూపిస్తున్నారు క్షమించాలి మిత్రులు దాశరథి గారి నిష్క్రమణ నేనింకా అర్థం చేసుకుని ఎడ్జస్టవలేక పోతున్నాను– లత ముద్ద మందారం అని ఎవరంటారు తినలేనమ్మా అని తన టిఫిను నా ప్లేట్లో ఎవరేస్తారు. రంగాచార్యులు. నారాయణరెడ్డి గార్ల దుఃఖాన్ని నేనూ పంచుకుంటున్నాను –నాకూ దుఃఖం తక్కువగా లేదు. క్షమించాలి ఇక వ్రాయలేను.

## రామాయణ్

ఆదివారం (8–11–87). సుగ్రీవ పట్టాభిషేకం అయింది వర్షాకాలం నాలుగు నెలలూ నీరాజ్యాన్ని సుస్థిరం చేసుకోమని శ్రీరాముడు చెప్పాడు అలాగే నని వెళ్ళిన సుగ్రీవుడు – భోగ పరాయణుడై శీతాకాలం వచ్చిందని మర్చి పోతాడు– హనుమంత జాంబవంతులు ఏం చేయాలో తోచక ఆలో చిస్తుంటారు శ్రీరాముడు – లక్ష్మణుడిని పిలిచి సంయమంతో వెళ్ళి సుగ్రీవుడి పరిస్థితి విచారించిరా అంటాడు నృత్య విలాసాల్లో మునిగిఉన్నాడు సుగ్రీవుడు. లక్ష్మణుడు కోపంతో బయలు దేరి అతని గృహ ప్రాంగణానికి చేరాడు రాజీవలోచనుడైన రాముని కథ మధురాతి మధురం

## నయీ దిశాయే

కుశల్ డ్రగ్ ఎడిక్ట్ కనక అతని సోదరి స్నేహ ప్రేమించిన ప్రవీణ్కి భార్య అయ్యే అర్హత కోల్పోయింది కుశల్ బాగుపడి తల్లికి దగ్గరయినా సరే – వాళ్ళ వంశం చెడిపోయినట్టే – ఇక బోరుగా ఉంది ఈ నాటిక ఉన్న వాటిల్లో బహదూర్ షా జఫర్ – బాగుంది అంతే

# వారఫలం

## 1-1-1988 శుక్రవారం మొదలు 7-1-1988 గురువారం వరకు

★ **మేషం:** కొన్ని వ్యవహారాలు, అనుకొన్న మేరకంటే సునాయాసంగా అనుకూలమవుతాయి. మీ నూతన వ్యాపారం లాభదాయకం. వస్తు వాహన సేకరణ అనుకూలం. కళారంగాన ప్రసిద్ధి ఆశించిన వారికి మేలు. స్త్రీలకు : సర్వానుకూలం.

★ **వృషభం:** వారఫలం ఉత్తమం. ఆరోగ్యమందు శ్రద్ధవహించుట ఎంతైనా అవసరం. కారణం ఒకటి రెండు గ్రహాలు అనుకూలం గాదు వృత్తి యందు కూడ జాగ్రత్త పడవలసిన సమయం, గ్రహించండి. స్త్రీలకు : ఇంట శుభ కార్యాలోచనలకు అవకాశం. ఉత్తమ సాహచర్యం లభ్యమవుతుంది.

★ **మిధునం:** శుభ కార్యాలోచనలకు ఆస్కారమున్నది. మీ మేలు కోరినవారు యింటికి రానున్నారు. విద్యా విషయంగా పెంపుగల వారం. అధికారుల వలన జరగవలసిన పనులు సుకరంగా జరుగుతాయి. స్త్రీలకు : కంపెనీ తరఫున గాని, ఉద్యోగరీత్యా గాని చాలమంది దూర ప్రాంతాలకు వెళ్ళుతారు.

★ **కర్కాటకం:** ఆదాయమందు వృద్ధి యున్నది. మాటకు గౌరవం లభ్యం. అనుకూల మిత్ర సహాయమున్నది. రాజకీయంగా ఏమాత్రం మేలు గాదు. అవకాశవాదులతో కాలం వ్యయించకండి. స్త్రీలకు : సుఖశాంతులు, ఆదాయమందు వృద్ధి, రాజకీయాలందు ప్రమేయము ంటే మేలే.

★ **సింహం:** చాలామందికి ఈ రాశి వారికి శుభ యోగమున్నది. 'రవిదశ' జరుగుతూ ఉంటే సర్వానుకూలం. ప్రసిద్ధులతో పరిచయానికి ఆస్కారమున్నది. స్త్రీలకు : ఉద్యోగరీత్యా అనుకూలం. మిత్ర సమాగమం.

★ **కన్య:** ఏది మేలో, ఏది కాదో గ్రహించలేక తికమక పడుతారు. అందవలసిన సైకం చేతికి రాక తికమక పడుతారు. వృత్తియందు వికాసముంటుంది. శుభ కార్యానుకూలతకు ఆస్కారమున్నది. స్త్రీలకు ధనయోగమున్నది. చుట్టుప్రక్కల వారితో గొడవలు రాకుండా చూచుకొనుట శ్రేయస్కరం.

★ **తుల:** సుఖశాంతులు, వ్యాపారరీత్యా అనుకూలం. నూతన వ్యక్తులతో పరిచయం యోగప్రదం కావటం గమనింపదగిన అంశాలు. రాజకీయాలందు ప్రమేయమున్న వారికి అధిక ఆదరణయున్నది. స్త్రీలకు · ఉద్యోగస్థులు జాగ్రత్త పడవలె

★ **వృశ్చికం:** 'శనిగ్రహ' కదలిక వలన ఎలాగైనా కొంతలో కొంత మేలు చేకూరుతుంది. పరిశ్రమలందు శ్రమించు వారికి అనుకూలం అప్పు సప్పులిచ్చారే, వాని వసూలకు పాటుపడవలసిన వారం. పై మెరుగులతో శ్రమించ తగని కాలం. స్త్రీలకు : ఆదాయం, ఆనందం, కార్యానుకూలం.

★ **ధనుస్సు:** ధన ధాన్యాలకు ఆస్కారమున్నది ప్రజారంగాన ప్రసిద్ధి ఏర్పడుతుంది. శుభ కార్యానుకూలతకు ఆస్కారమున్నది. శ్రమకరమైనా అన్ని విధాల లాభదాయకం. రాజకీయాలందు శ్రమించటం మేలుగాదు. గ్రహించండి. స్త్రీలకు ధన వసతి ఉన్నది. వ్యాపారం చేసేలాగైతే మేలు.

★ **మకరం:** 'శని' గ్రహం మీ శక్తియుక్తులను, ఆరోగ్య స్థితిని పరీక్షింపనున్నది. ఎలా మెలుగుతారో జాగ్రత్త వహించాలి. విద్యారంగాన కొందరకు ప్రసిద్ధి ఏర్పడనున్నది. వ్యాపారరంగాన అనుకూలమే. స్త్రీలకు : సుఖానుభూతి, రాజకీయాలందు అనుకూలం చెప్పదగిన అంశాలు.

★ **కుంభం:** ఉద్యోగ రంగాన మీకు అనుకూలత చేకూరగల వారం. మాటకు గౌరవం చేకూరుతుంది. ప్రతిష్ఠాకరమయిన వారం. వారఫలం అనుకూలం. రాజకీయంగా మేలు గాదని, యిటీవలే గ్రహించారుగా! స్త్రీలకు : సుఖశాంతులు, ధనాదాయం.

★ **మీనం:** అనుకొన్న విధంగా సమయానికి డబ్బు అందుతుంది. అవసరాలు తీరుతాయి. ఇటీవల సాగించిన ప్రయాణ మూలకంగా ఆదాయం ఏర్పడిందిగా! చేసిన యత్నాలు ఫలవంతమయినాయిగా! ఇంకేం కావాలి! స్త్రీలకు : వస్తు వాహన సేకరణకు, వృత్తి వికాసానికి అనుకూలం. గ్రహించాలి.

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## శ్రీ పి. ఆర్. రాజుకు 'చిత్రకళా శిరోమణి' బిరుదు:

మిత్రులు శ్రీ పి. ఆర్. రాజును నేను దాదాపు నాలుగు దశాబ్దాలుగా చూస్తున్నాను. ఆయన చిత్రాలనూ చూస్తున్నాను. ప్రతి దశాబ్దం ఆయనలో శతాబ్దాల పరిణతిని ప్రసాదిస్తున్నదా అని విస్తుపోతుంటాను. ఈ పరిణతికి కారణం ఆయనలోని తపన, సాధన, తపస్సు. కళాకారునికి ముఖ్యంగా ఉండవలసింది రేఖా సౌష్టవం. ఎంత భావుకుడైనా రేఖాసౌష్టవం లేకపోతే భావం వ్యక్తంకాదు, చిత్రం రాణించదు, మిత్రులు శ్రీ పి. ఆర్. రాజుకు ఎంతో సాధనతో ఎంతో తపస్సుతో ఈ రేఖా సౌభాగ్యం లభించింది. ఈయన రేఖలలో లాలిత్యం వుంది. పుష్టి వుంది. జీవం వుంది. సొగసైన రేఖలతో చిత్రానికి జీవం పోయగలడు. ఈయన చేయి సొగసైన శైలిని మలచుకోగలదు. నాకు ఈయన మూడు దశాబ్దాల కింద చిత్రించిన 'కోప గృహం' అనే చిత్రం ఇంకా జ్ఞాపకం వుంది. ఇదేదో అలనాటి సత్యభామ కోప గృహమో, మరే రాణివాసపు కోపగృహమో అనుకొనేరు. కాదు, కానేకాదు. ఎండి మోడువారిన కొమ్మలపై వాలిన పక్షుల జంట మాత్రమే. అలకను తెలుపడానికి శ్రీ రాజు కల్పించిన మోడు వారిన చెట్టు భూమిక, పక్షుల జంట ప్రపంచంతో మాకేమి పని అన్నట్టు వాలి ముడుచుకొని కూర్చున్న తీరు ప్రేక్షకులను మధుర జీవితానుభవాలకు తీసుకొని పోతుంది. ఇలాటివి ఎన్నో చిత్రాలు, రచయిత గాని, కళాకారుడు గాని తన రచనలతో ప్రేక్షకుని మనసును మారాకు తొడిగించినప్పుడే ఆరచన సార్థకత. దీనినే




కాళిదాసు ప్రకరణాంతరంలో "ప్రియేషు సౌభాగ్య ఫలాహి చారుతా" – అన్నాడు. ఆ చారుత శ్రీ రాజు చిత్రాలలో నిండుగా వుంది. శ్రీ పి. ఆర్ రాజు, పాళాల రాధాకృష్ణరాజు –చిత్తూరు జిల్లా నెల్లాటూరు

గ్రామంలో 1928డిసెంబర్9న జన్మించారు. తండ్రి శ్రీ గోవిందరాజు, తల్లి శ్రీమతి పుష్పమ్మ. చిన్ననాడే తండ్రిని కోల్పోయిన శ్రీ రాజు తిరుత్తణి బోర్డు ఉన్నత పాఠశాలలో చేరారు. అప్పుడు ఆయనకు తెలుగు అధ్యాపకులు శ్రీ బూదూరు రామానుజులు రెడ్డిగారు. ఆయన శ్రీ రాజులోని కళాపిపాసను గ్రహించి ప్రోత్సహించారు. పిదప ఈయన మద్రాసు స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ క్రాఫ్ట్స్‌లో చేరారు. అక్కడ ఈయనకు ఆచార్యులు శ్రీయుతులు హెచ్. వి. రామగోపాల్, ఆర్ కృష్ణారావు, విశ్వవిఖ్యాత శిల్పి శ్రీ దేవీప్రసాద్ రాయ్ చౌదరీ గార్లు. వీరి అంతే



రాష్ట్ర గవర్నర్ శ్రీమతి కుముద్ బెన్‌జోషి శ్రీ పి. ఆర్. రాజును "చిత్రకార శిరోమణి" అవార్డుతో సత్కరిస్తున్న దృశ్యం.

గణపతి ఊరేగింపు – చిత్రకారుడు ధన్‌ప్రసాద్, 8 వ తరగతి, వ్యాయామశాల హైస్కూలు, నాంపల్లి బంగారు పతకాలు పొందిన చిత్రాలలో ఒకటి.



వాసిత్వంతో ప్రాచ్య పాశ్చాత్య కళా సంప్రదాయాలను ఆకళింపుకొన్నారు.

1951 జులైలో మద్రాసులోని ఎగ్మోరు మ్యూజియం థియేటరులో సౌత్ ఇండియన్ సొసైటీ ఆఫ్ పెయింటర్స్ యాజమాన్యంలో జరిగిన కళా ప్రదర్శనంలో శ్రీ రాజు తూలికావైభవం పలువురు కళాప్రియులను ఆకర్షించింది. అప్పటి ఉమ్మడి ఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షతన జరిగిన ఈ కళా ప్రదర్శనంలో పలువురు శ్రీ రాజు చిత్రాలు కొని ప్రోత్సహించారు. అప్పటి నుండి ఈయనకు దేశంలోని వివిధ కళా సాంస్కృతిక సంస్థలతో సన్నిహిత సంబంధం కలిగింది. భారత కళా పరిషత్తును స్థాపించి గౌరవకార్యదర్శిగా వున్నారు. నేషనల్ అకాడెమీ ఆఫ్ ఆర్ట్సుకు సభ్యుడుగా ఎన్నికయారు. కేంద్ర లలిత కళా అకాడెమీ రికగ్నిషన్ అండ్ గ్రాంట్స్ కమిటీ సభ్యులు రాష్ట్ర ఫోటోగ్రాఫీ అకాడెమీ కార్యనిర్వాహక సభ్యులు. ఈయన చిత్రాలు ప్రధానమైన అఖిలభారత కళా ప్రదర్శనలలోను జాతీయ కళాప్రదర్శనాలలోను ప్రదర్శించబడ్డాయి. ఈయన

చిత్రాలు హవానా, క్యూబా, మెక్సికో కెంటకీ (అమెరికా) ప్రదర్శనాలలో మెప్పు పొందాయి. ఈయన పెక్కు బంగారు పతకాలు సంపాదించారు. రాష్ట్ర లలిత కళా అకాడెమీ ఇతనిని గురించి ఒక మోనోగ్రాఫ్ ప్రకటించింది. ఈయన చిత్రాలు దేశ విదేశాలలోని వివిధ కళా శ్రేణికలను అలంకరించాయి. 1975 లో జరిగిన ప్రథమ తెలుగు ప్రపంచ మహాసభలో రాష్ట్ర ప్రభుత్వం, 1984 కళా వేదిక కళాసరస్వతి బిరుదంతోను, 1984 లో బెంగుళూరులో జరిగిన ప్రథమ అఖిలభారత రాజ క్షత్రియ మహాసభ, 1985 లో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ఉత్తమ కళాకారుడుగాను, దేశంలోని వివిధ సంస్థలు ఇతనిని సన్మానించాయి. అన్ని విధాల సంపూర్ణ పరిణత కళాకారుడైన శ్రీ రాజు ఆర్ట్ స్టడీ సర్కిల్ (70/2 ఆర్. టి. ప్రకాశం నగర్, బేగంపేట విమానాశ్రయం ఎదుట, హైదరాబాద్–19) అనే కళా శిక్షణాలయం స్థాపించి ఐదు సంవత్సరాలుగా నిర్వహిస్తూ పెక్కు వందల కళాకారులను సృష్టిస్తున్నారు. చిత్రలేఖనంలో నిపుణత సంపాదించుకోవాలనుకున్న వారికి, తమ పిల్లలను చక్కని చిత్రకారులుగా చూచుకోవాలనే తలిదండ్రులకు ఈ స్టడీ సర్కిల్ మంచి అవకాశం కలిగిస్తున్నది. ఈ శిక్షణాలయంలో ప్రాచ్య పాశ్చాత్య పద్ధతులలోని వివిధ రీతులతో శిక్షణ ఉంటున్నది. ఉద్యోగాలు చేసే వారికి, గృహిణులకు సెలవు రోజులలో శిక్షణ ఇచ్చే ఏర్పాటున్నాయి. ఈ శిక్షణాలయంలో శిక్షణ పొందిన వారు రాష్ట్ర స్థాయిలోను విదేశాలలోను జరిగిన ప్రదర్శనాలలో బహుమతులు పొందారు. ఈ సంస్థ ఐదవ వార్షికోత్సవం డిసెంబర్ 13 వ తేదీన లోకాయుక్త శ్రీ అవుల సాంబశివరావు అధ్యక్షతన కళాభవన్‌లో మహావైభవోపేతంగా జరిగింది. ముఖ్యఅతిథిగా



నిడదవోలు చైతన్య సాహితి సమాఖ్య వారు ఇటీవల ఏర్పాటు చేసిన ఒక సమావేశంలో మనుచరిత్రపై మాట్లాడిన శ్రీ కె. వెంకటశివయ్యని సంస్థ అధ్యక్షుడు శ్రీ గణేశ్వరరావు సన్మానిస్తున్న దృశ్యం

## హైదరాబాద్ నోట్‌బుక్

రాష్ట్ర గవర్నర్ శ్రీమతి కుముద్‌బెన్ జోషి విచ్చేసి, ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన బాలచిత్ర కళా ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ ప్రదర్శనం పోటీకి 3025 చిత్రాలు వచ్చాయి. వాటిలో 500 చిత్రాలు ఉత్తమంగా ఎంపిక అయి ప్రదర్శింపబడ్డాయి.

ప్రదర్శనం డిసెంబర్ 21 వ తేదీ వరకు ఉంది. 21 ఉత్తమ చిత్రాలకు 21 బంగారు, వెండి, కంచు పతకాలు ఇవ్వబడ్డాయి. ఇవికాక 1987 ఉత్తమ బాల చిత్రకార బహుమతి కుమారి జానీజోన్‌కు (6 వ తరగతి, కేంద్రీయ విద్యాలయం, తిరుమలగిరి) ఫెస్టివల్ అనే చిత్రానికి, 1987 ఉత్తమ కళాచార్య బహుమతి శ్రీమతి నళినీగిరికి (హైదరాబాద్ పబ్లిక్ స్కూలు, బేగంపేట), ప్రదర్శనానికి అత్యధిక సంఖ్యాక చిత్రాలు (500కు పైగా) పంపినందుకు హైదరాబాద్ పబ్లిక్ స్కూలు, బేగంపేటకు, అత్యధిక బహుమతులు పొందినందుకు హైదరాబాద్ పబ్లిక్ స్కూలు, బేగంపేటకు – ప్రత్యేక బహుమతులు ఈయబడినవి. దాదాపు వేయి మంది విద్యార్థులకు యోగ్యతా పత్రాలు ఇచ్చారు. గవర్నర్ 20 పతకాలు, 40 ప్రశంసా పత్రాలు ఇచ్చారు. పిదప గవర్నర్ శ్రీ పి. ఆర్. రాజు కృషిని ప్రశంసిస్తూ, చిత్రకార శిరోమణి అవార్డు బహూకరించారు. ఈ సందర్భంలో ఆమె ప్రసంగిస్తూ, వచ్చే సంవత్సరం ఈ పోటీలు రాజ్‌భవన్‌లో నిర్వహించడానికి అంగీకరించి, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ యాక్షన్ సంస్థ అధ్యక్షురాలి హోదాలో సంస్థకు పది వేల రూపాయలు మంజూరు చేశారు. తర్వాత శ్రీ పి. ఆర్. రాజు అనే శీర్షికతో శ్రీ రాజు కళా తపస్సును వివరించే గ్రంథాన్ని గవర్నర్ ఆవిష్కరించారు. పిదప ప్రఖ్యాత రచయిత్రి, జవహర్ బాల్ భవన్ డైరెక్టర్ కుమారి వాసిరెడ్డి సీతాదేవి ఆర్ట్ స్టడీ సర్కిల్ ప్రత్యేక సంచికను ఆవిష్కరించారు. శ్రీ రాజు కృతజ్ఞత తెలిపారు. ఈ ప్రదర్శనం అర్వంత్ అగ్రో ప్రొడక్ట్స్ లిమిటెడ్ సంస్థ సహకారంతో ఏర్పాటయింది. చివరన కన్వీనర్ శ్రీ ఆర్. గణేశన్ ధన్యవాదాలు సమర్పించారు. 500 చిత్రాలు ప్రదర్శించినప్పుడు వాటి రచయితలు, వారి తలిదండ్రులు, అభిమానులు ప్రారంభోత్సవానికి వస్తారు గదా. కళాభవన్ చిన్నది గనుక ఉత్సవం రవీంద్ర భారతి వంటి విశాలమైన హాలులో పెడితే బాగుండేది. కళాభవన్ చిన్నది కావడం వల్ల తొక్కిసలాట తప్పలేదు. ముఖ్యమైన విషయం ఒకటి చెప్పడం మరచాను. ఈ ప్రదర్శనంలో శ్రీనివాసరాజు అనే మూగ బాలునివి నాలుగు చిత్రాలున్నాయి. అవి అందరి ప్రశంసలూ పొందాయి. తనకు కాలేజ్ ఆఫ్ ఆర్ట్ అండ్ ఆర్కిటెక్చర్‌లో సీటు దొరకలేదని అతడు నాతో అన్నాడు. అధికారులు అలాటి వారికి తగిన ప్రోత్సాహమివ్వాలి.

### ఉపశ్రుతి :–

బస్సు స్టాపులో ఒకరు మెడకుడి పక్కకి తిప్పుకొని మాట్లాడుతున్నారు. చాల సేపు చూచి, పత్రికా రచయితగా వున్న ఉత్కంఠతో – ఏమిటండీ, మెడ పట్టిందా? – అనడిగాను. లేదండీ. బస్సుల కోసం కుడి వైపునకు మెడ తిప్పి నిరీక్షించడంలో మెడ అట్టే ఉండిపోయింది – అన్నారు ఆ పెద్ద మనిషి. ఆహా! ఆర్. టి. సి. మాహాత్మ్యమా! – అనుకున్నాను.

–తిరుమల రామచంద్ర

ఇటీవల జరిగిన లయన్స్ వారోత్సవాల సందర్భంగా విజయవాడలో లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ మెట్రో, లయన్ లేడీస్ క్లబ్ ఆఫ్ విజయవాడ మెట్రో, లియో గరల్స్ ఆఫ్ విజయవాడ మెట్రో, మెట్రో లియో క్లబ్‌లు సంయుక్తంగా నిర్వహించిన నేత్రావధాన కార్యక్రమంలో పాల్గొన్న సి. హెచ్. శశికిరణ్, శైలజ సభాధ్యక్షులు శ్రీ కిశోర్, శ్రీమతి కిశోర్, అవధానశేఖర శ్రీ ధర్మాభొట్ల కోటేశ్వరశర్మ అవధాన కార్యక్రమాన్ని నిర్వహించారు.



# అందరికీ ఆసక్తి కలిగించే మారథాన్




ఇంగ్రిడ్ క్రిష్టియన్‌సేన్

"ఎథలిటిక్" పోటీలలో ఆకర్షణీయమైనది పరుగు పోటీలు. అందులో 'మారథాన్' మరింత జనాకర్షణ గల పరుగు పోటీ. మొదట్లో పురుషులకు మాత్రము ఉండే ఈ పరుగు నేడు మహిళలు సహితము పాల్గొని ప్రతిభ చూపిస్తున్నారు.

'మారథాన్' పుట్టుక ఎంత ఆసక్తికరమైనదో నేడు యీ పరుగుకు కూడా అంత ఆసక్తి యున్నది. క్రీ.పూ. 480 ఆగస్టు ఆఖరి వారములో గ్రీసు, పర్షియాల మధ్య జరిగిన యుద్ధములో గ్రీకు సైన్యాధిపతి మిల్టియుడెస్ విజయం సాధించినప్పుడు విజయ వార్త ఏథెన్స్‌కు చేర్చిన ఫిడిఫెడెస్ అనే సైనికుడు 35 మైళ్ళ నిద్ర, విశ్రాంతి లేకుండా పరుగెత్తి ఏథెన్స్ నగర గోడ వద్ద ఆత్రుతతో వేచి వున్న తన దేశస్థులకు శుభవార్త తెలిపి ప్రాణాలు వదిలాడు. అంతకు ముందు యుద్ధ సమయంలో ఫిడిఫెడెస్ సైనిక సహాయము కొరకు మిత్ర దేశమైన స్పార్టాకు 1240 స్టేక్స్ వెళ్ళి వార్త అందించి తిరిగి ప్రయాణం చేసిఉన్నాడు. అతని దేశభక్తికి గుర్తుగా 1896 మార్చి 29న ఆధునిక ఒలింపిక్స్‌లో మారథాన్ నుండి గ్రీకు వరకు అదే మార్గమున పోటీ జరిగినది. ఆధునిక ఒలింపిక్స్‌లో మారథాన్ పరుగు ప్రవేశపెట్టించిన ఘనత సర్‌బారన్ విశ్వ విద్యాయములో ఫ్రెంచి విద్యావేత్త మైకేల్ బ్రియుల్‌కు దక్కినది. అప్పటి నుంచి ప్రతి ఒలింపిక్ పోటీయందు, అంతర్జాతీయ ఎథలెటిక్స్ పోటీలు, ఆసియా, ఐరోపా యితర పోటీలలో మారథాన్ పరుగు పోటీ జరుగుతున్నది. ఇప్పటికి90 ఏళ్ళ నుండి యీ పోటీ జరుగుతున్నది.

"మారథాన్' పరుగు ఇతిహాస పరుగు అయినది. కాని గత 15 ఏళ్ళలో ఎంతో ఆసక్తికరముగా ఒలింపిక్స్, యితర అంతర్జాతీయ పోటీలో కన్నా ఎక్కువగా ప్రత్యేక పోటీలు జరుపబడి ఆకర్షణీయంగా రూపొందినది. 1897లో "బోస్టన్"లో మారథాన్ పోటీ ప్రారంభమైనది. ప్రతి ఏడూ అప్పటి నుంచి జరుగుతున్నది. ప్రపంచ అగ్రశ్రేణి క్రీడాకారులు అందరూ యీ పోటీలో పాల్గొనుచున్నారు. 1984వరకు విజేతకు విజయ కిరీటం, పతకము, వేడి 'సూప్' లభించేది. బహుమతికన్న పోటీలో పాల్గొని గెలుపు సాధించాలి అనే పట్టుదలతో క్రీడాకారులు పాల్గొనేవారు.

1947లో జపాన్‌లో గల 'ఫుక్యూగేకా', చెకొస్లొవేకియాలోని 'కొసిసీ' (1924 నుండి) మారథాన్ బహిరంగ పోటీలు ప్రారంభమయాయి.

అమెరికాలో మారథాన్‌కు క్రొత్త రూపము లభించినది. ప్రతి రోజూ ఉదయం, సాయంత్రం అమెరికాలోని ప్రతి నగరము, పట్టణము, పల్లెలో కొన్ని వేల మంది 'జాగింగ్'లో పాల్గొనుట ప్రారంభించారు. ఆరోగ్యము కొరకు, శరీరం బరువు తగ్గించే ఉద్దేశంతో మొదలైన యీ జాగింగ్ అనతి కాలంలోనే యితర దేశాలను ఆకర్షించినది. ఈ రోజు ప్రపంచ మహానగరములుగా భావించబడే న్యూయార్క్, వాషింగ్టన్, మాస్కో, మెక్సికో, పారిస్, లండన్, బెర్లిన్, సియోల్, మాంట్రియెల్, పెకింగ్, మాడ్రిడ్, రోమ్, మొదలగు చోట తెల్లవారు ఝామున కొన్ని వేలమంది 'జాగింగ్' చేయటం కనిపిస్తుంది. జాగింగ్ అలవాటు పడిన పిల్ల, పెద్ద, స్త్రీపురుషులను చూచి వ్యాపార సంస్థలు తమ వ్యాపార ప్రచారమునకు మారథాన్ పోటీలు అనేకము ప్రారంభించాయి. 1970లో అగ్రగామి మారథాన్ పరుగు క్రీడాకారులు కొద్ది మొత్తము బహుమతి సహితము ఇచ్చే వారు. 1987 నాటికి పరిస్థితి మారినది. ఎక్కువ బహుమతులుంటేనే పాల్గొనేవారు. పోటీ సమయంలో కొన్ని వేల మంది వచ్చేవారు. అతి చిన్న దేశాలు ఇథోపియా, టాంజనియా, డిజిబెటీలు సహితము మారథాన్ విజేతలను రూపొందించుకున్నాయి. బహుమతి విలువలు పెంచబడినవి.1987 మే 17న పారిస్ మారథాన్ రికార్డు నెలకొల్పిన కార్లస్‌లోప్స్ (2 గం., 7 ని 12 సె.) రికార్డును బ్రద్దలు కొట్టిన వారికి లక్ష అమెరికన్ డాలర్ల బహుమతి ప్రకటించింది. 1985 రోటర్ డామ్ మారథాన్ విజేత కార్లస్‌లోప్స్‌నకు 1,20,000 అమెరికన్ డాలర్లు బహుమతిగా లభించాయి. లండన్ మారథాన్ 1985 ఏప్రిల్‌లో గెల్చిన వేల్స్‌కు చెందిన స్టీవ్ జోన్స్‌కు పోటీలో పాల్గొన్నందుకు 40,000, గెల్చినందుకు 15,000,



మారథాన్ రాణి గ్రీటీవాయిట్జ్

పోటీ రికార్డు అయిన 2 గం. 8 ని. 16 సె.లు అధిగమించినందుకు 10,000 అమెరికన్ డాలర్లు లభించాయి.

నార్వేకు చెందిన ఇంగ్రిడ్ క్రిష్టియన్‌సేన్ అదే ఏడు విజయం పొందినందుకు 15,000, నూతన రికార్డు నెలకొల్పినందుకు, ప్రపంచ రికార్డు

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada _ 520 003, Acring Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

వింత - విశేషాలు







# దివ్య స్వరాల ఆమని డా॥ ఈమని అస్తమయం



సంగీత ప్రపంచంలో విశిష్టమయిన స్థానాన్ని అలంకరించిన డా ఈమని శంకర శాస్త్రి అస్తమయం రసజ్ఞలోకానికి తీరని లోటు మధుర స్వరాల మాధుర్య స్రవంతమే సంగీతం పద్మశ్రీ డా ఈమని శంకర శాస్త్రి అగ్రగణ్యాగ్రగణ్య వీణా వాదన ప్రవీణులు నిత్య స్వర కళోపాస నారాదనా నిరతులు సురు చిర సుగుణ ఖనులు

శ్రీ శాస్త్రి గారి జన్మ స్థలం తూర్పు గోదావరి జిల్లాలోని పవిత్ర ద్రాక్షారామ భీమేశ్వర ప్రసిద్ధ పుణ్యక్షేత్రం గౌరిదేవి అచ్యుత రామశాస్త్రి వీరి జనని జనకులు తండ్రి అచ్యుత రామ శాస్త్రియే వీరి గురువు

కాకినాడ పీఠికాపురం మహారాజా కళాశాలలో శ్రీ ఈమని విద్యాభ్యాసం చేసి, బి ఏ డిగ్రీ సంపాదించారు కేంద్ర ప్రభుత్వం శ్రీ శాస్త్రి గారిని పద్మశ్రీ అవార్డుతో సత్కరించింది కేంద్ర రాష్ట్ర సంగీత నాటక అకాడమీల నుంచి శ్రీ ఈమనికి అనేక అవార్డులు లభించాయి డా శాస్త్రి తన 65వ యేట మద్రాసుకు సర్కార్ ఎక్స్‌ప్రెస్‌లో వెళ్తూ గూడూరు ప్రాంతంలో హఠాత్తుగా గుండె పోటుతో డిశంబరు 23వ తేదీన మరణించారు

శ్రీ శాస్త్రి గారి అపార కృషి అనుపమ కల్పనా శక్తి ఆరు వీణలతో ఆదర్శ శిఖరా రోహణం పలు వేణువులతో వేణు ప్రణయం బహు కంఠ స్వర సమ్మేళనంతో స్వరతరంగిణి కంపోజ్ చేసి శ్రోత లందరూ విస్తుపోయే విధానం తమ అపూర్వ భావన సంపదని స్వరపరచి శాశ్వతీకరించారు శాస్త్రీయంగా ఎక్స్‌విటి ఈస్ మోర్ ఇంటరెస్టింగ్ దేన్ ఎ చీవ్‌మెంట్ అనేది వీరు అభిమానుల ఆటోగ్రాఫ్ పుస్తకాలలో సంతకం చేసే టప్పుడు వ్రాస్తుండే వారు

సంసారం చిత్రం ద్వారా శ్రీ ఈమని శ్రీ ఎ.ఎం రాజాగారిని నేపధ్య గాయకులుగా చిత్ర రంగానికి పరిచయం చేశారు కొత్త టాలెంట్‌ని ప్రోత్సహించే స్వభావం గల వ్యక్తి శ్రీ శంకర శాస్త్రి

సంగీత దర్శకుడిగా జెమినీలోనే 1957 వరకూ వృత్తిని సాగించారు శ్రీ శాస్త్రి గారు ఢిల్లీ ఆకాశవాణి కేంద్రానికి 1960లో ఛీఫ్ లైట్ మ్యూజిక్ ప్రొడ్యూసర్ ఆఫ్ క్లాసికల్ మ్యూజిక్‌గా పని చేశారు అనేకానేక ఘన సన్మానాలను పొందారు

1982లో ప్రొడ్యూసర్ ఎమెరిటస్‌గా రేడియో దూరదర్శన్ కేంద్రాలకై నియుక్తులైనారు శ్రీ శాస్త్రి గారు తిరుమల తిరుపతి దేవస్థానం ఆస్థాన విద్వాంసులుగా పని చేశారు ప్రముఖ వైణిక విద్వాంసులు శ్రీ చిట్టిబాబు శ్రీ శాస్త్రి గారి శిష్యులే

శ్రీ శాస్త్రి గారికి శంకరాభరణం రాగం అంటే మహాప్రీతి ఆ రాగంతో పాటు వేదం కూడా పలు చోట్ల వీణపై పలికిస్తూ శ్రోతలను పులకాంతులూగించే వారు

డిశంబరు 20న గుంటూరు నాగార్జున సాంస్కృతిక కేంద్రం ఆధ్వర్యంలో ఆయనకు కనకాభిషేకం జరిగింది

21వ తేదీన నరసరావు పేట త్యాగరాజ గాన సభలో చేసిన కచరియే చివరిది

– కల్పవల్లి

# మారథాన్

నెలకొల్పినందుకు 50 000 అమెరికన్ డాలర్లు బహుమతి లభించింది

అతి చిన్న దేశం డిబేటీకి చెందినసాల్హా రొబ్లా 1986 పారిస్, మారథాన్‌లో పాల్గొన్నందుకు లక్ష ఫ్రెంచి ఫ్రాంకులు అందాయి

1986 చికాగో మారథాన్‌లో పాల్గొనినందుకు ఇంగ్రిడ్ క్రిష్టియన్‌సేన్‌కు 40 000 విజయం పొందినందుకు 40 000, మజ్జ టి షర్ట్ పోటీ సమయంలో ధరించినందుకు సంవత్సరానికి 40,000 అమెరికన్ డాలర్లు పారితోషికంగా లభించినది

పోర్చుగీస్‌కు చెందిన కార్లొస్‌లోప్స్ నేడు పోటీలో పాల్గొన్నందుకు 50,000 డాలర్లు యివ్వాలి

ఒలింపియన్ జోన్ బూనాటో కు చికాగో మారథాన్ 1985 గెల్చినందుకు మొత్తం 2,80,000 డాలర్లు లభించాయి

గ్రిటీవాయిట్జ్ తన టీ షర్టుపై 'రాంక్ జీరక్స్' ప్రకటనకి 1,50,000 డాలర్ల పారితోషికం పొందింది

ఈ ఏడు న్యూయార్క్ మారథాన్‌లో 22,600 మంది పాల్గొనగా లక్షల మంది పోటీ తిలకించారు 40 ఏళ్ళ ఆంగ్ల మహిళ ప్రిస్కిల్లావెల్చ్ 2 గం 30 ని 17 సె లలో గెల్చి 25,000 డాలర్లు బహుమతి పొందింది పురుషుల విభాగంలో కెన్యాకు చెందిన ఇబ్రహీం హుస్సేన్ 2 గం 11 ని 1 సె లో పరుగెత్తి విజయం పొందాడు

మనము యిటీవల పూనాలో నిర్వహించిన అంతర్జాతీయ మారథాన్ పరుగు పోటీ ఎందరో అంతర్జాతీయ క్రీడాకారులను ఆకర్షించినది

- ముకరమ్